# హేతువాది

సంపుటి : 41 సంచిక : 1

సెప్టెంబరు 2022

ప్రధాన సంపాదకులు :
**రావిపూడి వెంకటాద్రి**
చీరాల, ప్రకాశంజిల్లా
సెల్ : 99892 23042

సహాయ సంపాదకులు :
1) మేడూరి సత్యనారాయణ, ఇంకొల్లు
2) కుర్రా హనుమంతరావు, ఇంకొల్లు
3) గుమ్మా వీరన్న, హైదరాబాదు
4) కరి హరిబాబు, ఇంకొల్లు
5) షేక్ బాబు, ఇంకొల్లు
6) ఆలూరి ప్రఫుల్ల చంద్ర, తెనాలి
7) షేక్ దరియావలి, జాగర్లమూడి
8) అడియాల శంకర్, తూప్రాన్
9) కె. శ్రీనివాసాచారి, తూప్రాన్

చందాలు, విరాళాలూ, వ్యాసాలు పంపవలసిన చిరునామా :
**మేడూరి సత్యనారాయణ**
మేనేజింగ్ ఎడిటర్
C/o రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్
ఇంకొల్లు - 523 167, ప్రకాశంజిల్లా
Cell : 98499 35117
E.mail : Hetuvadi1982@gmail.com

"Hetuvadi"
SBI Account No. 52177300267
Inkollu IFSC No. SBIN0020367

కాపీలు అందనివారు :
**షేక్ బాబు,**
సర్కులేషన్ మేనేజర్
ఇంకొల్లు - 523 167,
ప్రకాశంజిల్లా.
సెల్ : 98667 68144

సాలుచందా రూ. 500/-
జీవిత చందా రూ. 5,000/-
ABROAD Subscription
Annual Rs. 500, $ 300
Life Rs. 5000, $ 3000

ఇందులో....




ఎడిటోరియల్-1

# "హేతువాది"

– రావిపూడి వెంకటాద్రి

మతాలన్నీ [illegible] పుట్టిన సిద్ధాంతాలే. ఏదో ఒక మతం చేత ప్రభావితం కాని మానవ సమాజం ఈనాడు లేదు. సాధారణంగా ప్రతి మనిషీ నేరుగా మత సమాజంలో పుడుతున్నాడు. మత సమాజంలోనే పెరుగుతున్నాడు. కానీ, మనిషి స్వభావతః జిజ్ఞాసువు కావడంవల్ల ఆలోచించకుండా వుండలేక పోతున్నాడు. ఆలోచన అనేది హేతుబద్ధంగా తప్ప చేయడానికి వీలులేదు కాబట్టి, హేతుబద్ధంగా తప్ప ఆలోచించలేక పోతున్నాడు. నిన్నటికి భిన్నంగా తప్ప నేడు ఆలోచించలేకపోతున్నాడు. నిన్నటి రకంగా ఆలోచించేది నేటి ఆలోచన కాదు కాబట్టి, నిన్నటి మతానికీ-నేటి శాస్త్రానికీ పొత్తు కుదరడం లేదు. అంటే నిన్నటి జ్ఞానం మతం కాగా, నేటి జ్ఞానం శాస్త్రమవుతుంది. ఐతే ఉనికి (Being) మతంలోనూ పరిణతి (Becoming) శాస్త్రంలోనూ కావడంవల్ల, నేటి మనిషి మతాన్ని వదలుకోలేకనూ, జిజ్ఞాసను నిరోధించలేకనూ జీవితంలో ద్వంద్వ వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తున్నాడు. అందువల్లనే సిద్ధాంతాలూ – ఆచరణలూ భిన్న మార్గాల్లో ప్రయాణం చేస్తున్నాయి. పాతను సమర్థించుకోడానికి కొత్తను ప్రయోగించే వ్యర్థ ప్రయత్నాలు ప్రవృత్తిగా మారాయి. తత్ఫలితంగా మనిషి సుహృద్భావ పూర్వకమయిన సామాజికాభ్యున్నతిని సాధించలేక పోతున్నాడు. నైతిక స్థాయి తప్పుతున్నాడు. జ్ఞానంపరంగా ఆలోచిస్తే, నిన్నటి మత సోపానాన్ని మనం దాటాం. నేడు శాస్త్రజ్ఞాన సోపానం మీద ఎక్కివున్నాం. ఈ మెట్టుమీద నిన్నటి జాతి, మత, కుల, వర్గాదుల చద్దిని కూడా తోడు పెట్టుకొని కూర్చుంటే-వాటి బురద శాస్త్రజ్ఞానానికీ, మానవతకీ కూడా అంటుకొంటుంది. అందుచేత వాటి కథలన్నిటినీ పాత కథలుగా – పురాణ గాథలుగా పరిగణిస్తే తప్ప, మనం ప్రగతిని సాధించలేం. అందుకు శాస్త్రీయ హేతువాద చైతన్యం ఎంతయినా అవసరం.

ఈనాడు హిందూ, క్రైస్తవ, ఇస్లాం మతాదులన్నీ ఆయా సిద్ధాంతాలు పుట్టిన ప్రాథమిక దశకు మనిషిని లాక్కువెళ్లాలని చూస్తున్నాయి. అందుకోసం ప్రతి మతమూ ఫండమెంటలిజానికి ప్రయాణం కట్టింది. అది సాధ్యమయితే, మళ్లీ మనం ఆటవిక జాతి స్థాయికి దిగజారవలసిందే. మత సంస్థలు చేస్తున్న

జాతర్ల వల్ల భారతదేశం తిరిగి మత కల్లోలాల స్థాయికి దిగజారిపోయే ప్రమాదం వుంది. ప్రపంచమీనాడు మరో మత యుద్ధాల యుగంలో ప్రవేశిస్తే, మానవ జాతికి రక్షణే లేదు. అందువల్ల ఈ ప్రమాదాన్ని నివారించాలంటే, ప్రజల్లో వీలయినంత ఎక్కువ హేతువాద చైతన్యం కల్గించవలసిన అవసరం వుంది. మానవుడు వస్తుతః హేతువాది కాకుంటే, ఆ పని చేయడం అసాధ్యమవుతుంది: అది ఇత్తడిని పుత్తడి చేసే ప్రయత్నం లాంటిదే – కాని, మానవుడు ప్రాయికంగా హేతువాది. ప్రతి మానవుడిలోనూ జాగృతంగా కాకున్నా నిద్రాణంగానో, సక్రమంగా కాకున్నా వక్రంగానో హేతుత్వం వుంది. దాన్ని కదిపి, క్రమ మార్గాన చైతన్యవంతం చేసి, కార్య రంగంలోకి దూకించడానికి భావప్రసారం అవసరం. ఆ భావప్రసారం శాస్త్రీయ దృక్పథంతో సమర్థవంతంగా చేయాలనేది "హేతువాది" లక్ష్యాల్లో ప్రధానమైనది.

హేతువాద భావాలకు ప్రాచుర్యమిచ్చే పత్రికలు తెలుగుదేశంలో తక్కువగా వున్నై. అందునా కేవలం ఒక్క హేతువాదానికే అంకితమయిన పత్రిక 'చార్వాక' ఒక్కటేనేమో! శాస్త్రీయ హేతువాద జిజ్ఞాసను మారుమూలలకు కూడా చేర్చగల పత్రికల అవసరం ఇంకా ఇంకా వుంది. ప్రజల అనాసక్తినీ, నిష్క్రియాపరత్వాన్నీ అలుసుగా తీసుకొన్న ప్రభుత్వం సెక్యులరిజం పేరుతో మతాన్ని ప్రచారం చేస్తున్నది. ప్రొద్దుకూకు మాట్ల విఘ్నేశ్వర పూజచేసి, ప్రొద్దుపోయిన తర్వాత సెక్యులరిస్టు వుపన్యాసాలు దంచే రాష్ట్రపతులూ, ముఖ్యమంత్రులూ మనకు దాపురించారు. ('ఈనాడు', ఆగస్టు 27, 1982) వినాయకులు ప్రజల్ని వుద్ధరించరు. ప్రజలే తమను తాము వుద్ధరించుకోవాలి. మతాలూ, మత ప్రచార సాధనాలూ చేస్తున్న రణగొణ ధ్వని ప్రమాద స్థాయికి చేరుతున్నది. ఈ స్థితిలో మత మౌఢ్య నిర్మూలన కోసం, శాస్త్రీయ జిజ్ఞాసాభివృద్ధి కోసం, హేతువాద సిద్ధాంత చర్చ కోసం, హేతువాద సంఘ కార్యకలాపాల సమాచారానికి ప్రాచుర్యం యివ్వడం కోసం "హేతువాది" మీ ముందుకు వస్తున్నది. హేతువాదులూ, ప్రగతికాముకులూ, సత్యాన్వేషులూ "హేతువాది"ని ఆదరించి ప్రోత్సహించగలరని ఆశిస్తున్నాం. హేతుత్వం, విజ్ఞానం, సత్యం, స్వేచ్ఛ, నీతి అనే లక్ష్యాలను దృష్టిలో వుంచుకొని విజ్ఞాన వికాసానికి మా వోపినంతలో తోడ్పడగలమని హామీ ఇస్తున్నాం.

('హేతువాది' ప్రారంభ సంచిక (1982 సెప్టెంబరు) సంపాదకీయం)

– ఆర్వీ

# హేతువాద మానవవాద ఉద్యమ వాణి, "హేతువాది"

1982 సెప్టెంబరులో రావిపూడి వెంకటాద్రి యాజమాన్య సంపాదకత్వంలో ప్రచురణ ప్రారంభమైన "హేతువాది" తెలుగు మాసపత్రిక 2022 ఆగష్టు సంచికతో 40 సంవత్సరాలు పూర్తి చేసుకుని ఈ 441 సంచికతో 41వ సంవత్సరంలోకి ప్రవేశించింది. 40 సంవత్సరాలపాటు 'హేతువాది' లాంటి హేతువాద మానవవాద ఉద్యమ పత్రిక నిరంతరాయంగా ప్రచురణ కావడం వెనుక రావిపూడి వెంకటాద్రిగారి కృషి అభినందనీయం. 60 సంవత్సరాలు నిండిన వయసులో 'హేతువాది'ని ప్రారంభించిన రావిపూడి 40 సంవత్సరాలపాటు ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ లక్ష్యాల సాధన కొరకు ప్రచురించడం ఉద్యమ పత్రికల ప్రచురణ చరిత్రలో అపూర్వం.

'హేతువాది' పత్రిక ప్రారంభ సంచికకు రాసిన ఎడిటోరియల్‌లోనే పత్రిక లక్ష్యాన్ని ప్రకటిస్తూ రావిపూడి, "మానవుడు వస్తుతః హేతువాది కాకుంటే, ప్రజల్లో హేతువాద చైతన్యం కల్గించడం అసాధ్యమవుతుంది. అది ఇత్తడిని పుత్తడి చేసే ప్రయత్నం లాంటిదే – కాని, మానవుడు ప్రాయకంగా హేతువాది. ప్రతి మానవుడిలోనూ జాగృతంగా కాకున్నా నిద్రాణంగానో, సక్రమంగా కాకున్నా వక్రంగానో హేతుత్వం ఉంది. దాన్ని కదిపి, క్రమ మార్గాన చైతన్యవంతం చేసి, కార్యరంగంలోకి దూకించడానికి భావప్రసారం అవసరం. ఆ భావప్రసారం శాస్త్రీయ దృక్పథంతో సమర్ధవంతంగా చేయాలనేది 'హేతువాది' లక్ష్యాల్లో ప్రధానమైనది" అని ప్రకటించారు.

'హేతువాది' పత్రికకు రావిపూడి రచించిన ఎడిటోరియల్స్‌కు ఒక ప్రముఖ స్థానం ఉంది. కాబట్టే, రావిపూడి రచనల సంపుటాల్లో 2 సంపుటాలు హేతువాది ఎడిటోరియల్స్‌తో ప్రచురణయ్యాయి.

ఆధునిక విజ్ఞానం, హేతువాదం, మానవవాదాల మీద రావిపూడి, ఇతర రచయితలు రచించిన వ్యాసాలు 'హేతువాది' వ్యాసవాణి సిరీస్‌లో 60 గ్రంథాలుగా ప్రచురితమయ్యాయి.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని ఆంధ్ర తెలంగాణ జిల్లాలన్నిటికీ 'హేతువాది' పత్రిక చేరుతున్నదంటే 'హేతువాది' ప్రభావాన్ని మనం అంచనా వేయవచ్చు. రావిపూడి వెంకటాద్రి విశ్వవిద్యాలయాల్లో చేసిన ప్రసంగ పాఠాలు 'హేతువాది'లో ప్రచురించబడి గ్రామాలలోని పాఠకుల దగ్గరకు చేరాయి.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, భారత హేతువాద సంఘాల ఉద్యమ కార్యక్రమాల వివరాలను హేతువాది పాఠకులకు అందించి వారిని ఉద్యమంతో అనుబంధం చేయడంలో రావిపూడి వెంకటాద్రి విజయం సాధించారు. గ్రామాల్లో జరిగిన హేతువాద మానవవాద ఉద్యమ కార్యక్రమాల రిపోర్టులు 'హేతువాది'లో ప్రచురితమయ్యాయి.

హేతువాదం, మానవవాదం, భౌతిక వాస్తవికవాదం, విశ్వతత్వం, జీవపరిణామం, మతం–సైన్సు, సెక్యులరిజం, ప్రజాస్వామ్యం, పార్టీరహిత ప్రజాస్వామ్యం, వైజ్ఞానిక పునర్వికాసం, మత జాడ్యాలు, ఫండమెంటలిజం లాంటి పలు అంశాల మీద 'హేతువాది' రచయితలు ప్రామాణికమైన వ్యాసాలను రచించారు. ఎంతో మంది చేయి తిరిగిన రచయితలకు హేతువాదిలో అవకాశం కల్పించి, వారిని రచయితలుగా, ఉపన్యాసకులుగా, ఉద్యమ ఆర్గనైజర్లుగా రావిపూడి వెంకటాద్రి శిక్షణ ఇచ్చారు.

'హేతువాది' సారధ్యంలో భారత హేతువాద మానవవాద ఉద్యమం దేశవ్యాపితమై, ప్రపంచ హేతువాదులు, మానవవాదుల దృష్టిని ఆకర్షించింది.

గత 40 సంవత్సరాల కాలంలో తొలి 14 సంవత్సరాలు రావిపూడి పూర్తి బాధ్యతలతో హేతువాది ప్రచురణ, పంపిణీలను విజయవంతంగా నిర్వహించగా 1997 నుంచి 2000 వరకు తెనాలి నుంచి ముప్పాళ్ళ బసవ పున్నారావు మేనేజింగ్ ఎడిటర్‌గా, 2000 నుంచి 2002 ఫిబ్రవరి వరకు చీరాల నుంచి అంచా బాపారావు మేనేజింగ్ ఎడిటర్‌గా సహకరించారు. 2002 మార్చి నుంచి ఈనాటివరకు గత 20 సంవత్సరాల పైకాలం నుంచి మేడూరి సత్యనారాయణ మేనేజింగ్ ఎడిటర్‌గా, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు మిత్రుల సహకారంతో హేతువాది ప్రచురణ, పంపిణీలలో రావిపూడికి సహకరించారు. 'హేతువాది'కి అనుబంధమైన హేమా పబ్లికేషన్స్ రావిపూడి సారధ్యంలో 100 పైగా హేతువాద మానవవాద గ్రంథాలను ప్రచురించింది.

రావిపూడి వెంకటాద్రిగారు తమ తదనంతరం 'హేతువాది'ని, "హేమా పబ్లికేషన్స్"ని రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లుకు చెందునట్లుగా

వీలునామాను వ్రాసి ఇంకొల్లు సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయంలో రిజిష్టర్ చేయించారు.

1991లో రావిపూడి మార్గదర్శకత్వంలో, రావి సుబ్బారావు దాతృత్వంతో స్థాపించబడిన రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు 2003లో భవన నిర్మాణాన్ని పూర్తి చేయడంలో గత 20 సంవత్సరాలుగా రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ హేతువాదికి, హేమా పబ్లికేషన్స్‌కు కార్యాలయంగా మారింది. రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రుల నిరంతరాయ కృషి వల్ల ఇంకొల్లు హేతువాద మానవవాద ఉద్యమ కేంద్రంగా మారి జాతీయ స్థాయి మహాసభలకు, అధ్యయన తరగతులకు వేదికయింది.

2021 ఫిబ్రవరి 9న రావిపూడి వెంకటాద్రిగారు 100వ జన్మదినోత్సవాన్ని జరుపుకుంటున్న సందర్భాన ఉద్యమమిత్రుల సహకారంతో రాడికల్ హ్యూమనిస్ట్ భవనం పైన రావిపూడి వెంకటాద్రి మీటింగ్ హాలు ను విశాలంగా నిర్మించి ప్రారంభించడం ఉద్యమ అభివృద్ధిలో ఒక మైలురాయిగా నిలిచింది.

101 సంవత్సరాల వయసులోనూ రావిపూడి వెంకటాద్రిగారు 'హేతువాది' పత్రికకు యాజమాన్య సంపాదకీయ బాధ్యతలను క్రియాశీలంగా నిర్వర్తించడంతో యువ ఉద్యమ మిత్రులకు స్ఫూర్తిదాయకంగా నిలిచారు. హేతువాద మానవవాద ఉద్యమంలో భాగంగా భారత హేతువాద సంఘం, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, 'హేతువాది', హేమా పబ్లికేషన్స్‌ల కృషిని సమన్వయం చేసుకుని ముందుకు పయనించవలసిన కర్తవ్యం మన మీద ఉంది. హేతువాద మానవవాద ఉద్యమమిత్రులు ఈ కర్తవ్య నిర్వహణలో క్రియాశీలపాత్ర పోషించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. మిత్రులందరూ ఇతోధికంగా కృషి చేస్తారని, తమ సహకారాన్ని అందిస్తారని ఆశిస్తున్నాం.

'హేతువాది' మాసపత్రిక 40 సంవత్సరాల ప్రచురణను పూర్తి చేసుకుని 41వ సంవత్సరంలోకి ప్రవేశించిన సంతోషకరమైన సమయాన పత్రిక ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి, రచయితలకు, పాఠకులకు, దాతలకు, ప్రకటన కర్తలకు హేతువాద, మానవవాద ఉద్యమ మిత్రులకు అభినందనలు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

- మేదూరి సత్యనారాయణ

# నా మాట

**- రావిపూడి**

1943 ఏప్రిల్ 5న మా స్వగ్రామం నాగండ్లలో నేను కవిరాజాశ్రమం స్థాపించాను. కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి రచనల ప్రభావంవల్ల నా యవ్వన దశలోనే హేతువాద దృక్పథానికి చేరువైన నేను ఆనాటి నుండి నేటివరకు అదే బాణీలో కొనసాగుతున్నాను. మధ్యలో ఎం.ఎన్.రాయ్ ప్రతిపాదించిన రాడికల్ హ్యూమనిజానికి చేరువయ్యాను. హేతువాద దృక్పథం నాస్తికత్వం ద్వారా భౌతిక వాస్తవిక దశకు చేరి మానవవాద (హ్యూమనిస్టు) మార్గం పడుతుందని గ్రహించిన హేతువాద లక్ష్యం మానవవాద మార్గమంటూ ప్రసంగాలు చేయడం, రచనలు చేయడం ప్రారంభించాను. ఇప్పటికీ అదే దారిలో కొనసాగుతున్నాను. నేను మరే ఇతర రాజకీయ, లేక మరోతరహా ఉద్యమాలలో ఎన్నడూ జొరబడలేదు.

ఐతే, అనుకోని విధంగా కొంతమంది మిత్రుల ఒత్తిడి ఫలితంగా నేను 1979లో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ సారధ్య స్థానంలో ప్రవేశించవలసి వచ్చింది. 1989లో భారత హేతువాద సంఘ ఉపాధ్యక్ష స్థానం తరవాత 1990లో భారత హేతువాద సంఘ అధ్యక్ష స్థానానికి ఎన్నికయ్యాను. మధ్యలో కొన్నేళ్లు ఆ స్థానాన్ని ఇతర మిత్రులకు అప్పగించి నేను ఛైర్మన్ స్థానంలో వున్నాను. ఐనా, ఇప్పటికీ నేనేవో కొన్ని ప్రసంగాలు చేస్తూనే వున్నాను. నాకలం పని ఆగలేదు.

1982 సెప్టెంబరులో నేను చీరాలలో "హేతువాది", మాసపత్రిక ప్రచురణ ప్రారంభించి 15 సంవత్సరాలు కొనసాగించాను. అంతలో నాకు అనారోగ్య సమస్య ఎదురుకాగా 2 1/2 సంవత్సరాలు తెనాలి మిత్రులు, మరో 2 సంవత్సరాలు చీరాల మిత్రుడు దాన్ని నడిపారు. ఇక అది ఆగిపోయే దశకు చేరినపుడు ఇంకొల్లులోని రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ మిత్రులు ముందుకు వచ్చి, హేతువాది పత్రిక బాధ్యత స్వీకరించి గత 14 యేళ్లుగా శ్రమిస్తూ నిర్వహిస్తున్నారు.

అసలు ఏమిటి ఈ రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్? దీనికి 10 శెంట్ల విలువయిన తన స్వంత భూమిని రిజిస్ట్రేషన్ ద్వారా దఖలుపరిచిన రావి సుబ్బారావు ఈ కేంద్ర స్థాపకులు. దీనిలో భవన నిర్మాణానికి తొలి విరాళ

ప్రదాత ఆరమళ్ల పూర్ణచంద్రారెడ్డి. ఉత్సాహపూరితులైన సెంటర్ సభ్యులు విరాళాలు సేకరించి ఈ భవన నిర్మాణం చేశారు.

ఈ భవనమే ఈనాడు భారత హేతువాద సంఘానికి కేంద్ర స్థానంగా, కార్యాలయంగా మారింది. **నా దృష్టిలో ఇది కవిరాజాశ్రమానికి మరో మజిలీ.** ఈ కేంద్రంలో ఏడాదికి 3, 4 అధ్యయన కేంద్రాలు నడుస్తున్నాయి. రాష్ట్రంలోని వివిధ జిల్లాల, ప్రాంతాల నుండి కార్యకర్తలు ఈ అధ్యయన శిబిరాల్లో పాల్గొంటున్నారు. అంతేకాక, ఇక్కడ భారత, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ మహాసభలు జరుగుతున్నాయి. ఆ సభలకు ఒక్క ఈ రాష్ట్రం నుంచేకాక భారతదేశంలోని ఇతర రాష్ట్రాలకు చెందిన హేతువాద ఉద్యమ కార్యకర్తలు, ఆయా రాష్ట్ర సంఘాల బాధ్యులు కూడా హాజరయి ఉద్యమ కార్యక్రమాల్లో పాలుపంచుకొంటున్నారు. కొన్ని సందర్భాల్లో విదేశీ ప్రముఖులు, అంతర్జాతీయ మానవవాద సమాఖ్య అధ్యక్షులు, సభ్యులు కూడా వచ్చి ఇక్కడి సమావేశాల్లో పాల్గొంటున్నారు.

ఈ సెంటర్ అన్ని వసతులు కలిగిన భవనంలో వుంది. ఇక్కడ చాల మంచి గ్రంథాలయం వుంది. ఈ సెంటర్ వారే అనేక హేతువాద ప్రచురణలు చేపట్టారు. అందునా, నా రచనల్లో చాల ముఖ్యమైన వాటిలో చాలావరకు 23 సంపుటాలుగా తీర్చి, నిధులను సమకూర్చుకొని ప్రచురించారు. అన్నిటికంటె ఈ ప్రక్రియ చాల ఉదాత్తమైనది, భవిష్యత్తరాల హేతువాద ఉద్యమకారులకు ప్రయోజనకరమైనదని నా భావన.

ఈ సెంటర్ సభ్యులే దీని నిత్య నిర్వాహకులు. వారి అజమాయిషీ లేకుంటే భారత హేతువాద సంఘం తలదాచుకోటానికి చోటే దొరికేది కాదు. 1930లో భారత హేతువాద సంఘం ఆవిర్భవించిన నాటి నుంచీ, అది తలదాచుకోటానికి ఎన్ని చోట్ల తిరిగినా, చివరకు దానికి చోటిచ్చినది ఇంకొల్లులోని రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ మాత్రమే.

ఈ సెంటర్‌లోని కార్యకర్తలు చాల బాధ్యతగలవారు మాత్రమే కాదు, వారిలో చాలమంది వక్తలుగా, రచయితలుగా వన్నె తేలారు. అందరూ స్వయంకృషితో పెంపొందినవారే. "హేతువాది" మాసపత్రిక మంచి చెడ్డలంతా వారే చూస్తున్నారు. దాని అచ్చు, పంపిణీ భారాన్ని వారే మోస్తున్నారు. వారంతా స్వచ్ఛంద కార్యకర్తలే. దాని వ్యయభారాన్నీ వారే వహిస్తున్నారు. పేరు పేరునా చెప్పడానికి వీలుకాని సంఖ్యలో అక్కడ స్వచ్ఛంద కార్యకర్తలున్నారు. ఐనా, ఒక్క విషయం మాత్రం ప్రత్యేకంగా చెప్పక తప్పదు. భారత హేతువాద సంఘ

ప్రధాన కార్యదర్శి మేడూరి సత్యనారాయణ పరోక్షంలో అక్కడి ప్రచురణలేవీ సాగేవికావు. హేతువాది పత్రిక ప్రచురణ నేను సాగించినంతకాలం దాని భారమంతా నేనొక్కడినే మోయవలసివచ్చేది. అందువల్ల అది ఎంత కష్టభరితమైనదో నాకు అనుభవపూర్వకంగా తెలుసు. పత్రిక పంపిణీలో సహమిత్రులెంత సహాయపడినా, పత్రిక ప్రచురణ, గ్రంథ ప్రచురణ తన ఒక్కడి చేతులమీదుగా నిర్వహించడంలో సత్యనారాయణగారి శ్రమకు విలువకట్టలేం.

ఈ ఉద్యమంలో నేను చాలకాలంగా అధ్యక్ష స్థానాల్లో వున్నా, ఎన్నడూ నేను ఎవ్వరినీ 'అలా చెయ్యి, ఇలా చెయ్యి, అలా వద్దు, ఇలా వద్దు' అంటూ ఆదేశించి ఎరుగను. స్వచ్ఛంద సంస్థల్లో ఆదేశాలుండవు. ఈ ఉద్యమ ఆశయాలు నచ్చనివారు వేరుపడిపోవచ్చు – వారి కారణాలు వారికుంటాయి. ఈ ఉద్యమం ఏదో ఒక రాజకీయపార్టీలాగానో, కుల, వర్గ, మత సంస్థలవలెనో వ్యక్తులమీద నిర్బంధాలు విధించదు. ఈ ఉద్యమ స్వేచ్ఛాయోజన పద్ధతులు నచ్చినవారు ఇందులో కలసిమెలసి వుంటారు. నచ్చనివారు వేరయిపోతారు. అంతే : ఆదేశాలు, నిర్బంధాలు ఈ ఉద్యమకారులను అంటవు, అంటరాదు.

నాకు వయస్సు మీరింది. ఆరోగ్యం చలిస్తున్నది. కార్యశీలిని కాజాలననే నిర్ణయానికి వచ్చాను. అయినా, నాకు తోచినంతవరకు ఏదో ఒకటి వ్రాస్తుంటానుకాని, ఈ ఉద్యమ బాధ్యత నేనిక మోయలేను. కొంతకాలంగా పత్రిక ప్రచురణ, గ్రంథాల ప్రచురణ బాధ్యతలను, భారాన్ని మేడూరి సత్యనారాయణగారే నిర్వహిస్తున్నారు. అది చాల కష్టతరమైన విషయమని నా స్వీయానుభవంవల్ల నేను తెలుసుకున్నాను. అందువల్లనే ఈ ఉద్యమాన్ని అచంచలంగా నడిపే బాధ్యతను మిత్రులు మేడూరి సత్యనారాయణగారిపై వదలాలని నిర్ణయించుకున్నాను. ఇక ఈ ఉద్యమ కార్యక్రమాలన్నిటిపట్ల ఆయన సలహాలను పాటిస్తూ ఉద్యమ మిత్రులంతా ఆయనకు సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఇది ఆదేశంకాదు. ఇంతకుముందే చెప్పినట్లు ఈ ఉద్యమంలో ఆదేశాలుండవు. ఉంటేగింటే, సలహాలుంటాయి. నా సూచనను మన్నించి, నా సలహాను గౌరవించి, భారత హేతువాద సంఘ బాధ్యతలను, భారాన్ని తాను స్వీకరించడం తనకు తప్పనిసరి అని పరిగణిస్తూ, అలా స్వీకరించడం నన్ను గౌరవించినట్లుగా నేను పరిగణిస్తానని మేడూరి సత్యనారాయణగారికి మాట యిస్తున్నాను. ఇదే నామాట. ఈ మాటను గౌరవించవలసినదిగా సహచర మిత్రులందరినీ కోరుతున్నాను. సెలవు. – రావిపూడి వెంకటాద్రి

(రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ రజతోత్సవ సంచిక నుండి) 2016

# హేతువాదం

- రావిపూడి

హేతువు అనేది విశ్వక్రమంలోని లయ (rhythm). హేతుత్వం విశ్వక్రమం యొక్క ప్రతిధ్వని (echo).

భౌతిక ప్రకృతి అంతా నియమబద్ధమైనది (law governed). ప్రకృతి నుంచి ఉద్భవించిన మానవుడిలో ఆ నియమబద్ధత ప్రతిధ్వనించడంవల్ల అతడు వస్తుతః హేతుమంతుడు (essentially rational) అవుతున్నాడు.

అయితే, భౌతిక ప్రకృతి నుంచి ఉద్భవించిన జీవి మానవుడొక్కడే కాదు. ఇతర జీవజాలమంతా ప్రకృతి నుంచి ఉద్భవించినదే; ఐనప్పుడు, ఇతర జీవజాలంలోకూడా హేతుత్వం పనిచేయడంలేదా? అనే ప్రశ్న రావడం సహజం.

నిర్మాణరీత్యా పరిశీలిస్తే, జీవులన్నీ క్రమబద్ధమైన నిర్మాణం కలవే. లయబద్ధమైన శారీరక ప్రవృత్తి (function) కలిగి ఉన్నవే. జీవుల దేహాల్లోని ద్రవ్యప్రవర్తన, ప్రతిక్రియలు, రక్తప్రసరణ, హృదయ స్పందన, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, శోషణ విసర్జనాలు, ఉష్ణోగ్రతలు, బాహ్యప్రేరణలకు ప్రతీకరణలు, ఉపచయ- అపచయక్రియలు (metabolism), జనన మరణాలు మొదలైన లక్షణాలన్నింటిలోనూ జీవజాతుల మధ్య భిన్నత్వం ఉన్నప్పటికీ, ఏ జాతి జీవులకు ఆ జాతిజీవుల్లో ఈ చర్యలన్నీ-లయబద్ధంగానే, నియతిబద్ధంగానే జరుగుతున్నాయి.

ఇదంతా జీవుల నిర్మాణ-ప్రవృత్తుల విషయం : అంటే ప్రకృతిలోని నియమబద్ధత జీవులన్నిటి నిర్మాణంలోను, ప్రవృత్తిలోను అవశ్యంగా ప్రతిబింబిస్తున్నది.

ఆలోచనలోని క్రమబద్ధతను మనం హేతుత్వం (Rationality) అంటున్నాం.

మనుషుల్లో హేతుత్వం ఉన్నప్పటికీ, అందరిలోనూ అది ఒకే మట్టంలో లేదు. వేర్వేరు వ్యక్తుల్లో వేర్వేరు మట్టాల్లో పనిచేస్తున్నది. అది ఆయా వ్యక్తుల జ్ఞాన ప్రమాణంమీద ఆధారపడి పనిచేస్తున్నది. మనుషుల కంటే దిగువ మట్టంలోవున్న జీవజాలంలో కూడా హేతుత్వం ఉంది. కానీ, అది అక్కడ దిగువమట్టంలోనే, సహజాత (instinct) రూపంలో ఉంది.

పరిణామవృక్షాన్ని దిగుతూ క్రమక్రమంగా దిగువ జాతుల్లోకి పోయే కొలదీ, క్రమక్రమంగా తక్కువ ప్రమాణంలో హేతుతత్వం ప్రకటితమవుతుంది. వాటి అవయవ నిర్మాణం ఆయా జీవులకు అంతకంటె విస్తృతమైన ఆలోచనకూ, హేతుత్వానికీ అవకాశమివ్వదు.

ఉదాహరణకు వృక్షజాతులనే తీసుకొందాం. వాటిలో ఆలోచనా సాధనమయిన మెదడులేదు. అలాంటప్పుడు వాటిలో మానసిక వ్యాపారం (psychic function) అనే సమస్యే ఉత్పన్నంకాదు. అవయవాల ఏర్పాటునుబట్టే వాటి ప్రవృత్తి ఉంటుంది. అందువల్ల, మానసిక ప్రవృత్తికి సంబంధించిన హేతుత్వం వృక్షాలో ఉండదు. ఐనా, వృక్షాల్లోని వివిధ అవయవాల వ్యాపారాలు క్రమబద్ధంగానే ఉంటాయి.

జీవ ప్రకృతిలోనే కాదు – నిర్జీవ ప్రకృతిలోకూడా క్రమం ఉంది.

**విశ్వమంతా క్రమబద్ధంగానే ఉంది (cosmos), క్రమబద్ధంగానే ప్రవర్తిస్తున్నది, పరిణమిస్తున్నది. విశ్వం గలిబిలిగా ఉండే గందరగోళం (chaos) కాదు.**

మనం భూమిమీద జీవయాత్ర సాగిస్తున్నాం. భూమిగురుత్వ శక్తికి బద్ధులమై ప్రవర్తిస్తున్నాం.

చంద్రుడు నియత కక్ష్యలో భూమిచుట్టూ తిరుగుతున్నది. భూమి చంద్రునితో సహా అలాగే నియత కక్ష్యలో సూర్యునిచుట్టూ తిరుగుతున్నది. సూర్యుడు పాలపుంత (milkyway) అనే గెలాక్సీ (galaxy)లో కదలి పోతున్నది. మనపాలపుంత మరెక్కడికో పరిగెత్తుకు పోతున్నది. ఇవి అన్నీ బొంగరాల్లాగా తమ చుట్టూతాము గిరగిర తిరుగుతున్నాయి. ఇదంతా ఒక క్రమం ప్రకారమే జరుగుతోంది.

ఆక్రమం అలా జరుగుతున్నదని మనం అనుకోవడం వల్లనో, భ్రమపడటం వల్లనో, అలా జరగటం లేదు. మరొకరకంగా జరగాలని మనం అనుకుంటే మరో రకంగా జరగదు. ప్రపంచంలో ఉన్న ఏ వస్తువునయినా, క్రమాన్నయినా ఇలా ఉండాలని మనం అనుకోవడంవల్ల అది అలా ఉండడంలేదు.

"అలా" జరుగుతున్న క్రమంయొక్క ముద్ర మన మనస్సుల మీద పడడంవల్లనే, వస్తువులనూ, వాటి మధ్య ఉన్న సంబంధాన్నీ మనం అలా

ఉన్నట్లు గ్రహించగలుగుతున్నాం. ఆ విధంగా గ్రహించినదాన్ని మనం 'జ్ఞానం' అంటున్నాం. వస్తువుల రూపేణ మన జ్ఞానం బయలుదేరుతుంది కాని, మన జ్ఞానంవల్ల వస్తువులకు అస్తిత్వం ఏర్పడదు. మానసిక వ్యాధిగలవారికి మాత్రమే ఉన్నవి లేనట్లూ, లేనివి ఉన్నట్లూ అనుభూతి కల్గుతుంది.

విశ్వం నడకలో క్రమబద్ధత లేకపోయినట్లయితే, 24 గంటల రేయింబవళ్లు ఈ భూమిమీది మనకుండవు. 30 రోజుల నెలలుండవు. 365 రోజుల సంవత్సరాలుండవు. మూడు ముఖ్యఋతువులుండేవి కావు. గ్రహణాలనూ, గ్రహణకాలాలనూ ముందుగా చెప్పగలిగేవారంకాదు. సూర్యుడిలోని మచ్చలు 11 సంవత్సరాలకొకసారి క్రమంగా ఏర్పడి, అంతర్ధానమవతాయని కనుక్కోగలిగేవారంకాదు. ఎల్లప్పుడూ ఉండే హాలీ తోకచుక్క 76 ఏండ్లకొకసారి మన "దిసనేత్రాలకు' (naked eyes) దర్శనమిస్తుందని చెప్పగలిగేవారంకాదు. అన్నీ ఒక క్రమాన్ని అనుసరించి జరుగుతున్నాయి కాబట్టే, అవి మనకు అర్థమవుతున్నాయి. వాటి మధ్య ఉన్న సంబంధం మనకు అర్థమవుతున్నది. అలాంటి క్రమం లేకుంటే, వాటిని గురించిన జ్ఞానం మనకు కలగడమే సంభవం కాదు. అందువల్లనే, తిరిగి ''రేపు'' సూర్యోదయమవుతుందని చెప్పగలుగుతున్నాము.

అమావాస్య తర్వాత పక్షం రోజులకు పౌర్ణమి వస్తుందనీ, ఆ తర్వాత పక్షం రోజులకు తిరిగి అమావాస్య వస్తుందనీ, అలా పూర్ణిమ–అమావాస్యలు ఆవర్తమవుతుంటాయనీ (recurring) చెప్పగలుగుతున్నాము.

తుఫానులు, భూకంపాలు, ఉప్పెనలూ మొదలైనవి సంభవించడానికిగల కారణాంశాలను (causative factors) అర్థంచేసుకొని – ఆ కారణాలు తటస్థించినపుడు ఆ ఉత్పాతాలు జరుగుతాయని ముందుగానే తెలుసుకొని, వాటి రాకనుగురించి హెచ్చరికలు చేయగలుగుతున్నాము.

**ప్రకృతి నియమబద్ధంకాకపోతే, తద్వారా మనం కార్యకారణ నియమాన్ని అనుసరించకపోతే, ఇవేవీ మన జ్ఞానపరిధిలోకి రావు.**

**ప్రకృతి నియమాలు మన అనుభవంలోకి వచ్చినప్పుడు, వాటిని గురించిన జ్ఞానం మనకు కలిగినప్పుడు, ఫలానా కారణాలవల్ల ఫలానా ఫలితాలు వస్తున్నాయని తెలుసుకోగలుగుతున్నాము. అదే హేతుత్వమంటే. ప్రాథమిక దశలో అది కేవలం సహజ వివేకమే. ఇంగితజ్ఞానమే (common sense).**

**జ్ఞానం హేతువికాసానికీ, ప్రతిగా, హేతుత్వం ఇతోధిక జ్ఞానాభివృద్ధికీ**

దోహదం చేస్తాయి. జ్ఞానం సత్యాన్ని తెలుసుకోడానికి దోహదం చేస్తుంది. ఎందుకంటే, సత్యమంటే జ్ఞానవిషయమే **(Truth is the content of knowledge).**

దేన్ని మనం తెలుసుకొంటామో అది సత్యమవుతుంది. ఎంతమేరకు మనం తెలుసుకొంటే, అంతమేరకు ఆ తెలుసుకొన్నది సత్యమవుతుంది.

సత్యపరిజ్ఞానం స్వేచ్ఛ **(freedom)**కు దారితీస్తుంది. స్వేచ్ఛ అంటే మన జీవన మార్గంలో ఎదురయ్యే అవరోధాలను తొలగించుకోవటం. మొదటి సత్యంకంటే సమగ్రమయిన సత్యాన్ని మానవుడెల్లప్పుడూ తెలుసుకొంటూనే ఉంటాడు. అందువల్ల, స్వేచ్ఛానుభవం పెరగడం ద్వారా మానవుడి సుఖజీవనం కూడా పెరుగుతుంది.

కాబట్టి, హేతుత్వం, జ్ఞానం, సత్యం, స్వేచ్ఛ అనేవికూడా ఒక క్రమంలోనివే. అవి క్రమంగా పెరుగుతూ నీతికి మార్గం సుగమం చేయటానికి సోపానాలు నిర్మిస్తాయి. సమాజ సామరస్యకతకు దోహదం చేసేదే నీతి. కనుక, స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ అనేవి మానవాభ్యుదయానికి ప్రధాన హేతువులు. ఆలోచనారహితస్థితీ, స్వేచ్ఛాపిపాసరాహిత్యస్థితీ అనూహ్యాలు.

భౌతిక ప్రకృతిలో మనకు కన్పించే క్రమం కేవలం యాంత్రికం. మనుషుల్లో కన్పించే క్రమం, ప్రవర్తన ఐచ్ఛికం. హేతుయుతం.

దిగువజాతి జంతుజాలంలో కన్పించేక్రమం పై ప్రవర్తనలకు రెంటికీ మధ్య ఉండే సహజాత లక్షణం. అది సచేతనమయినా, చాలవరకు యాంత్రికంగానే ఉంటుంది.

ఉనికి, జ్ఞానం – ఏది ముందు?

భావవాదులూ, మాయావాదులూ మన జ్ఞానానికి ఆధారం వాస్తవిక ప్రపంచం (objective world) కాదంటారు. వాస్తవిక ప్రపంచం లేదంటారు. కాబట్టి "భౌతిక విశ్వమనేది ఉన్నదా? లేదా? మనం సంచయం చేసే జ్ఞానమంతా వాస్తవిక ప్రపంచాన్ని గురించినదవునా? కాదా? ఆ జ్ఞానాన్ని ఆర్జించేది మనుషులా? లేక మనుషులలోపల కానీ, వెలుపలకానీ, ఉన్న మరొకరా? అసలు మనం జ్ఞానం అనుకొంటున్నది జ్ఞానాన్నా, భ్రాంతినా?" మొదలైన విషయాలను గురించి కూడా మనం ఆలోచించడం అవసరం.

ఎందుకంటే, ఈ ప్రపంచమంతా మిధ్య అనే వాదాన్ని – అంటే

మాయావాదాన్ని – ఎనిమిదో శతాబ్దంలో, భారతదేశంలో, ఆచార్యత్రయంలోని శంకరాచార్యుడు ప్రసిద్ధం చేశాడు. దాని తాలూకు 'వేదాంతం' అనేక వికృతరూపాల్లో అద్వైతం పేరుతో ఈనాటికీ విస్తృత ప్రచారంలో ఉంది. అనంతరం 18వ శతాబ్దంలో – అంటే శంకరుడి తర్వాత పది శతాబ్దాలకు యూరపులో జార్జి బెర్కెలీ (1685–1753) అనే ఐర్లండు క్రైస్తవ మతాధికారి ఆధునిక భావవాద ధోరణికి పునాదులు బిగించాడు. ఆధునిక తత్త్వశాస్త్రంలోని భావవాదఛాయలకన్నిటికీ ఆయనతత్త్వమే మాతృక అనడంలో సందేహంలేదు. చివరకు, ఆధునిక విజ్ఞానం ద్వారా భావవాదాన్ని సమర్ధించటానికి యత్నించేవారు కూడా ప్రధానంగా బెర్కెలీ వరవడినే చేపట్టారు.

ఏ తరగతికి చెందిన భావవాదులయినా, ఈ ప్రపంచం యొక్క వాస్తవికతను అంగీకరించరు. అంతా మిధ్య, భ్రాంతి అంటారు. ఈ ప్రపంచమంతా మన మనస్సులోని భావచిత్రం అంటారు.

భావవాదమనేది 'ఆస్తికచింతన యొక్క అత్యున్నత స్థాయి' అనబడేదాని వికృతరూపమే. అది ఒకచోట భౌతిక అస్తిత్వాన్ని (physical existence) నిరాకరిస్తుంది. మరొకచోట భావ అస్తిత్వమే భౌతిక అస్తిత్వానికి మూలమంటుంది. 'ఉనికి జ్ఞానంమీద ఆధారపడి ఉంటుంది' (Existence depends upon awareness) అనేది దానికి ప్రాథమికసూత్రం. అంటే గ్రహించే శక్తిగల మనుషులున్నారు కాబట్టి ప్రపంచం ఉందనీ, మనుషులూ, వారికి మనసులూ లేకపోతే ఈ ప్రపంచానికీ ఇందులోని వస్తువులకీ అస్తిత్వంలేదనీ, విశ్వభావానికి (Universal Idea) మన భావం ప్రతిబింబమనీ, మన భావానికి ఈ విశ్వం ప్రతిబింబమనీ భావవాదుల నిర్ణయం.

ఈ నిర్ణయాలు చేసేవారెవరైనప్పటికీ, ఏ పేరుతో మనుగడ సాగించినప్పటికీ, వారు హేతువాదులు కారు. భౌతికవాదులూ, నాస్తికులూ కూడా కారు. ఎందుకంటే, పై జ్ఞాన సిద్ధాంతం (epistemology) మీద హేతువాదులూ, భౌతికవాదులూ వేసుకొనే ప్రశ్నలు ఇలా వుంటాయి.

మనం అనుభూతి (Experience) అనేది ఏమిటి? మనం దేన్ని అనుభూతి పొందుతున్నాం? కేవలం మిథ్యనే అనుభూతి పొందుతున్నామా? మనం అనుభూతి పొందేదంతా మనచుట్టూ ఆవరించి ఉన్న విశాలవిశ్వాన్ని (మనతో సహా) కాదా? వస్తువులను కాక, వస్తుసంబంధాలను కాక, మనం దేన్ని అనుభవిస్తున్నాం? దేన్ని గ్రహిస్తున్నాం? దేన్ని గ్రసిస్తున్నాం? దేన్నీ మనం

తినకుండా, జీర్ణించుకోకుండా, శరీరాన్ని పెంచుకోకుండా, ఆ శరీరానుభూతి లేకుండా, అది పెరగకుండా, మన మనస్సూ - అది ఆర్జించే జ్ఞానమూ సాధ్యమేనా? మన శరీరం లేకుండా మనస్సూ, ఆ మనస్సు లేకుండా జ్ఞానమూ సంభవమా? మనం దేన్ని జ్ఞానమంటున్నాం? మన జ్ఞానమంతా దేన్ని గురించి? మన జ్ఞానం మనపరిసర విశ్వాన్ని గురించి కాక, దాని అంతట అదే మన మనస్సులో స్వచ్ఛందంగా (spontaneously) జనిస్తున్న భ్రాంతియేనా? అది దేన్ని గురించిందీ కాదా? ఐనప్పుడు, మన ఉనికిని గురించి మనకు కలుగుతున్న జ్ఞానం కూడా భ్రాంతి కాదా? అందువల్ల, మన అస్తిత్వం భ్రాంతి కాదా? ఐనప్పుడు, భ్రాంతి అనేది ఏమవుతుంది? మనలో కలిగే జ్ఞానానికిముందు మనభౌతిక అస్తిత్వంలేదా? మన భౌతిక అస్తిత్వానికి ముందే జ్ఞానమనబడే దానికి అస్తిత్వం ఉన్నదా? అంటే, మనుషులులేక ముందూ, లేకపోయినప్పటికీ జ్ఞానమనేది ఉంటుందా? మన అస్తిత్వానికి ముందే జ్ఞానమనబడే దానికి అస్తిత్వం ఉన్నదా? అంటే, మనుషులులేక ముందూ, లేకపోయినప్పటికీ జ్ఞానమనేది ఉంటుందా? మన అస్తిత్వానికి ముందే మనకు బాహ్యంగా కనిపిస్తున్న ప్రకృతి లేదా? వస్తుమయ జగత్తుమీద ఆధారపడకుండా భావాలు ఏర్పడడం సాధ్యమా?

భౌతిక అస్తిత్వాన్ని నిరాకరిస్తూ, భావవాదాన్ని ప్రచారం చేసేవారు పై ప్రశ్నలకు అభౌతిక ఆచరణరీత్యా కూడా సమాధానం చెప్పవలసి ఉంది. ఆ సమాధానమే వారి తత్వస్వరూపాన్నీ, స్వభావాన్నీ అద్దంపట్టి చూపిస్తుంది.

**ఒక విధంగా చూస్తే భావవాదులూ, మాయావాదులూ "నాస్తికులే" - వారు వ్యక్తిక దైవాన్ని (personal god) ఆమోదించరు. దేవుడికి కాళ్లూ, చేతులూ తగిలించరు. ఐనా, వారిది నిరీశ్వర వాదం కాదు. "నాస్తికత్వం" కాదు. వారిది భౌతిక అస్తిత్వాన్ని కాదనే "నాస్తితత్వం". నాస్తికులు భౌ అస్తిత్వాన్ని కాదనరు. అభౌతికతనూ, అతీతత్వాన్నీ మాత్రమే నిరాకరిస్తారు. అందువల్ల, నాస్తికులంతా అవశ్యకంగా భౌతికవాదులు (materialists) కావాలి. బౌతిక వాస్తవికవాదులు (physical realists) కావాలి. భౌతిక వాస్తవికతకూ, భౌతిక నాస్తిత్వానికీ (Physical Nihilism) మధ్యగల తేడాను గమనించడంలోనే హేతుతత్వం ఉంది. భౌతిక నాస్తిత్వాన్ని ప్రతిపాదించే మాయావాద నాస్తిక్యం నాస్తికత్వంకాదని నిర్ణయించడంలోనే హేతుత్వ ప్రతిభ వెల్లడవుతుంది.**

అందువల్ల "ఉన్నదంతా మనజ్ఞానంవల్ల కలుగుతున్న భ్రమ-

భ్రాంతి–తప్పు, మనుషులు లేకపోతే విశ్వమనేదేలేదు" అనే ఆలోచనారీతి నాస్తిక ఆలోచనారీతి కాదు. అది మిధ్యావాద ఆలోచనారీతి.

"మనుషులు లేకపోయినా విశ్వం ఉంటుంది" అనేది వాస్తవిక సత్యం. "ఒకవేళ ఏదో ప్రమాదం వల్ల ఈ భూమిమీది ప్రాణికోటి అంతా నశించి" పోయినప్పటికీ, ఈ ప్రపంచం ఉంటుంది. లేకపోతే ఈ ప్రపంచం అంతర్ధానమై పోతుందా? కొలంబస్ కనుగొనకముందు అమెరికా ఉండేదికాదా? సూక్ష్మదర్శినిని కనుగొనక ముందు సూక్ష్మజీవులుండేవికావా? దూరదర్శినిని కనుగొనకముందు మన దిసనేత్రాలకు గోచరించని నక్షత్రాలులేవా? మన మామూలు కంటికి కనిపించని పరమాణువులూ, అందలి భాగాలు అబద్ధమా? మన పంచేంద్రియాల ద్వారా గుర్తించలేని భూచలనం–ద్వివిధ, త్రివిద, చతుర్విధచలనం అబద్ధమా?

కాదు – ఎన్నటికీ కాదు.

విశ్వం వాస్తవం (real), విశ్వంలోని మనం వాస్తవం, మన అనుభూతి వాస్తవం. మన జ్ఞానం వాస్తవం. ఇందులో ఏదీ అవాస్తవికమైనది లేదు. మనం వాస్తవమైతే, పదార్ధ – ప్రదేశ – కాలసహితమైన బాహ్య ప్రపంచాన్ని గురించిన మనఅనుభవం కూడా వాస్తవికం కావాలి. ఎందుకంటే, ఆ అనుభవం నుంచే జ్ఞానం చిందుతున్నది కానీ, కేవలం మనస్సులోనే మన జ్ఞానం స్వచ్ఛందంగా ఆవిర్భవించడం లేదు. మనస్సు అనేది 'నాస్తి' (nowhere) లో నుంచి భావాలు ఊరే బావి కాదు. పుట్టుగ్రుడ్డికి దృశ్యజ్ఞానం ఉండదు. పుట్టుచెవిటికి శబ్దజ్ఞానం ఉండదు. నాసికేంద్రియం జబ్బు చేసిన వారికి వాసన తెలియదు. ఆ ఇంద్రియజ్ఞాన పరోక్షంలో మనస్సుపడే ఆరాటం ఆలోచనకాదు – తద్వారా జ్ఞానం లభించదు. మన పంచేంద్రియాలూ, మనస్సూ కలసి పనిచేయడం వల్లనే, ఈ ప్రపంచంలో కేవలం జీవించినంత మాత్రానే, జ్ఞానం ఆర్జించగలుగుతున్నాం. అంటే, మానవుడు జీవించడమంటేనే "జ్ఞానించడం". అది జ్ఞానమార్జించడం అనే స్వచ్ఛంద ప్రవృత్తిగా మారిపోతుందన్నమాట!

నేటివరకు మానవుడు ఆర్జించిన బహువిధ జ్ఞానమంతా, శాస్త్రజ్ఞానమంతా, పెంపొందించుకొన్న తత్వజ్ఞానమంతా విశ్వతత్వాన్ని అర్ధం చేసుకోవడం వల్ల లభించిందే. విశ్వమంటే ఏదైతే ఉన్నదో అదంతానూ అని భావం. పరమాణు గర్భస్థ ప్రాథమిక కణాలు మొదలుకొని అనంత రోదశిలో వ్యాపించిన బృహద్గోళాల వరకు ఉన్న యావదస్తిత్వమూ, దాని ప్రవృత్తి

వైవిధ్యమూ, పరిణతీ అని భావం. విశ్వంలో నియమాలు లేకపోయినట్లయితే - విశ్వంలోని సర్వస్వం నియమబద్ధం కాకపోయినట్లయితే - శాస్త్రం ఉండేది కాదు; దానికి అర్థం ఉండేది కాదు.

ఆ నియమాలను కనుగోవడం, అధ్యయనం చేయడం, వాటి మధ్య ఉండే సంబంధాలను అర్థంచేసుకోవడంగా తప్ప - శాస్త్రజ్ఞానమంతా వేరే ప్రత్యేకంగా ఎక్కడ ఉంది? జ్ఞానమనేది ఎక్కడ ఉంది?

ఆ శాస్త్రజ్ఞానం మనకు లభించబట్టే, నేడు భూమి గురుత్వశక్తినీ, ఇతర గోళాల గురుత్వశక్తినీ అధిగమించి రోదసీయానం చేయగలుగుతున్నాం. రోదసీ గహ్వరంలోకి చొచ్చుకొని పోగలుగుతున్నాం. యదార్థంగా పోగలుగుతున్నాం తప్ప, పోతున్నామని "అనుకోవడం" లేదు.

భూమిమీద నుంచి రోదసిలోకి పంపబడుతున్న వ్యోమనౌకలు, కృత్రిమ ఉపగ్రహాలు భూమిమీదవున్న శాస్త్రజ్ఞుల ఆదేశాలనూ, సంకేతాలనూ పాటించి, అనేక ఖగోళాల ఛాయాచిత్రాలు తీసి, భూమిమీదకు ప్రసారం చేస్తున్నాయి. ఆ గోళాల్లోని మృత్తికను రసాయనిక పరీక్షకు గురిచేసి, ప్రయోగ ఫలితాలను ప్రసారం చేస్తున్నాయి. వాటిని బట్టి, అక్కడ బంగారమే ఉందో, వెండి ఉందో, మరేమి ఉన్నదో, ఏమిలేదో ప్రత్యక్షంగా మనం చూడకుండానే అవి అక్కడ ఉన్నాయనీ, లేక లేవనీ మనం నిర్ధారించుకోగలుగుతున్నాం. విశ్వం నియమబద్ధం కాకపోతే, ఆ నియమాలను మానవుడు గ్రహిస్తూ ఉండకపోతే, గ్రహించబడిన నియమాల ప్రకారమే విశ్వం నడుస్తూ ఉండకపోతే, ఆ నియమాలను గురించిన మానవుడి జ్ఞానం సరయినది కాకపోతే - మానవుడు పంపిస్తున్న వ్యోమనౌకలు అనేక అవాంతరాలను తప్పించుకొంటూ ప్రయాణం చేసి, దిగమన్న గ్రహంలో, దిగమన్న ప్రదేశంలో, దిగమన్న కాలానికి దిగి, ఇక్కడి ఆదేశాలను పాటించడం ఎలా సంభవం?

పైగా ఆయా ఖగోళాలనుండి భూమికి ఉండే దూరాన్ని మనం గజం (మీటరు) బద్దలతో కొలవడంలేదు. వాటి ఆకర్షణశక్తిని కట్టురాళ్ళతో తూయడంలేదు. వాటిమీది కొండలనూ, లోయలనూ, దగ్గరగా, జాగ్రత్తతో పరిశీలించి రహదారులు చూచుకోవడం లేదు. అంతా గణితం ప్రకారం గుణించేదే. ఇందులో ప్రత్యక్ష ప్రమాణానికి ఆస్కారం లేదు. ఐనా, లెక్కల ప్రకారం వచ్చిన ఫలితాలను సరయినవిగా రుజువుచేస్తూ కృత్రిమ రోదసీనౌకలు శాస్త్రజ్ఞుల ఆదేశాలను శిరసావహిస్తూనే ఉన్నాయి. కానీ గజంబద్దతో కొలిస్తే

తప్ప తాడిచెట్టుఎత్తు తెలియదంటూ ప్రత్యక్ష ప్రమాణాలకోసం అర్రులుచాచే వారికి విశ్వం గజిబిజిగా, గందరగోళంగా కన్పించక ఏమి చేస్తుంది?

పంచేంద్రియగోచరమైన జ్ఞానం మాత్రమే పరమంకాదు. ఆ జ్ఞానం (awareness) పశుపక్ష్యాదులకు కూడా ఉంది. కెమేరావలె పనిచేసే కండ్లూ, టేప్‌రికార్డర్ వలె పనిచేసే చెవులూ, బాహ్య ప్రకోపాలకు ప్రతీకరించే ఇతర ఇంద్రియాలూ గ్రహించే జ్ఞానానికి చెవులూ, బాహ్య ప్రకోపాలకు ప్రతీకరించే ఇతర ఇంద్రియాలూ గ్రహించే జ్ఞానానికి మానవుడు హేతుత్వాన్ని సంధించి పెంపొందించడం వల్ల, ఆ జ్ఞానం బహుగుణీకృతమవుతుంది. అదే మానవుడి జ్ఞానంలోని విశిష్టత.

ప్రత్యక్ష జ్ఞానాన్ని మననంచేసి మనిషి మనస్సు ఆలోచిస్తుంది. ఆ ఆలోచన ఇతర ఆలోచనలతో కలసి ఆలోచనా క్రమాన్ని కొనసాగిస్తుంది. అది నిరంతర క్రమం.

ఒకసారి ఏర్పడిన జ్ఞానపటాలు, భావచిత్రాలు వస్తువులు (objects)గా మారిపోతాయి. అందువల్ల వాటిని మన పంచేంద్రియాలు (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం) "ప్రత్యక్షంగా" (directly) గ్రహించలేకపోయినా, మనస్సులో వాటి పటాలు మెదలడంతోనే పంచేంద్రియ గ్రహనకు దీటైన జ్ఞానాన్నే మనస్సు కలిగిస్తుంది. వస్తువుల పరోక్షంలో కూడా ఆ జ్ఞానం కలుగుతుంది. దాన్నే స్మృతి జ్ఞానమంటాం; కోరినంతమాత్రాన ఏ వస్తువైనా మన "మనస్సులో" ప్రత్యక్షమవుతుంది; ఐతే, ఏ వస్తువును గురించి అంతకు ముందు మనకు జ్ఞానంలేదో, ఆ వస్తువెన్నడూ మనకు ప్రత్యక్షం కాదు. అది ప్రత్యక్షజ్ఞానమూ కావచ్చు. లేక అప్రత్యక్ష వస్తువులను – అంటే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులవంటి కాల్పనిక రూపాలను గురించి మన మనస్సుల్లో మనం వివిధ భావాల సంఘట్టనం ద్వారా ఏర్పరచుకొనే పటాలను గురించిన జ్ఞానమూ కావచ్చు.

దీన్నిబట్టి, ఆవేశిత (ప్రబుద్ధ) జ్ఞానమనేది (revealed wisdom) లేదని తేలుతుంది. జ్ఞానం దానంతట అది పూనకం ద్వారా రాదు. అలానే అంతరింద్రియజ్ఞానం (Intution) అనేది కూడా లేదు. అంతరింద్రియజ్ఞానం పేరుతో పిలువబడే జ్ఞానమంతా కూడా అంతకు ముందు ఆర్జించబడిన వస్తుజ్ఞానం (objective knowledge) మీదనుంచి బయలుదేరుతుంది. అందువల్ల, వస్తువులమీదకాక, ఆ వస్తుజ్ఞానం యొక్క స్పృహమీద కానీ ఆధారపడకుండా 'జ్ఞానం' అనేది స్వచ్ఛందంగా ఏర్పడటానికి వీలులేదని

తేలుతుంది. ఐతే, ప్రతి ఆలోచనకీ ముందు దానికి సరిపడే జ్ఞానం వుండాలి అంటున్నామంటే, అది ప్రత్యక్ష జ్ఞానం మాత్రమే కానవసరం లేదు. అది ప్రత్యక్షానుభవం మీద ఆధారపడిన పరోక్ష జ్ఞానమయినా కావచ్చు.

అందువల్లనే, ప్రతి అంశానికీ ప్రత్యక్ష ప్రమాణాన్ని అపేక్షించకుండానే ఏది సంభవం (probable), ఏది అసంభవం (im-probable), అనే విషయాన్ని మనం హేతుత్వం ద్వారా, వివేచన ద్వారా, బుద్ధిబలం ద్వారా తేల్చుకొంటాం. అందుకు మనం ఆర్జించుకొన్న ప్రకృతి పరిజ్ఞానం సహాయం చేస్తుంది.

"రాకెట్టు సహాయంతో మనిషి ఆకాశంలోకి దూసుకుపోయాడు" అనే వార్త మనకు చేరితే, అది సంభవమేనంటాం. "కామరూప శక్తిగల ఒక యోగి నిష్పదార్థంగా (dematerialisation) మారి, విశ్వాంతరాళందాటి, భగవద్దర్శనం చేసుకొని పునఃపదార్థమై (rematerialisation) తిరిగివచ్చాడు" అనే కట్టుకథ మనకు చేరినప్పుడు అది అసంభవమంటాం. "సత్యసాయిబాబా బుల్లిశివలింగాన్ని మింగి, వెళ్ళగ్రక్కాడంటే" సంభవమేనంటాం. "అమరావతిలోని మహాశివలింగాన్ని మ్రింగివెళ్ళగక్కాడంటే" అసంభవమంటాం.

సంభావ్యతా సంభావ్యతలను గ్రహించలేని మనిషి "మనిషి అర్థాన్ని" కోల్పోతాడు. అందువల్ల ప్రతి సంఘటన కూడా తన పంచేంద్రియాలకు "ప్రత్యక్షంగా" గోచరించాలని ఏ హేతువాదీ అనడు. అంగీకృత ప్రయోగాల ద్వారా, ప్రమాణాల ద్వారా, పునఃపరిశీలించి రుజువు చేసుకొని నిజాన్ని ధ్రువపరచుకోవాలని మాత్రమే అంటాడు. అది కేవలం ఇంగిత జ్ఞానానికి సంబంధించిన విషయం. అందులో పెద్ద సిద్ధాంత బాదరబందీ ఏమీ లేదు.

(1977 చార్వాక)

---

## విజ్ఞప్తి

**'హేతువాది' డి.టి.పి. ప్రచురణ, పంపిణీ వ్యయం పెరిగినందువల్ల, 'హేతువాది' సంవత్సర చందాను సెప్టెంబరు 2021 నుంచి రూ. 500/-లకు, జీవిత చందాను రూ. 5,000/-లకు పెంచడమైనది. పాఠకులు గమనించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. సుదీర్ఘకాలం నుంచి హేతువాదిని చదువుతున్న వారందరూ జీవిత చందాదారులు కావలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.**

**– ఎడిటోరియల్ బోర్డ్, 'హేతువాది' పత్రిక**

# హేతువాదం ఎందుకు?

- రావిపూడి

హేతువు (Reason) సాధనమే (Means) కాని, లక్ష్యం కాదు. హేతువాదం (Rationalism) విధానమే కాని, సిద్ధాంతంకాదు. దీనిమీద ఎవరెన్ని వ్యాఖ్యానాలు చేసినా అది అంతే.

హేతువును సాధనంగా వినియోగించుకొని లక్ష్యాలను నిర్ణయించుకోవాలి; ఆ లక్ష్య సాధన హేతుబద్ధంగా ఉండాలి. అలా అని చెప్పే విధానమే హేతువాదం.

ముందుగా ఏవో నిర్ణయాలను సిద్ధంచేసుకొని, ఆ నిర్ణయాలను సమర్థించుకోడానికి చేసే తర్కం (logic) హేతువాదం కాదు. మతగ్రంథాల్లోని అపశ్రుతుల్ని అసంబద్ధ ప్రమాణాలతో నిరూపించడానికి ప్రయత్నించే పద్ధతి హేతువాదం కాదు. ఆధునిక విజ్ఞానం యొక్క తాత్విక ఫలితాలను వక్రీకరించి, యుక్తీకరించడం (rationalisation) హేతువాదం కాదు. ఏ వ్యక్తీ సర్వజ్ఞుడుకాదు. కాబట్టి తనకు నచ్చిన వారిని "పురుషోత్తములు"గా ముద్రలు వేసి, వారి ఉవాచత్వాలను ప్రమాణించి, వాదనకు దిగడం హేతువాదం కాదు. హేతువాదమనే మాటలో "వాదం" అనే శబ్దం ఉన్నంత మాత్రాన, అది కేవలం వాదిస్తుందనుకోవడం సరైన అవగాహన కాదు. ఇంగ్లీషులో ఇజం (ism) అనే సఫిక్సుకు తెలుగులో "వాదం" అని తర్జుమా చేస్తున్నంత మాత్రాన, దాని అర్థాన్ని వక్రీకరించడం సరైన పద్ధతి కాదు. హేతువాదమంటే హేతుత్వాన్ని అన్వయించడమే. హేతువును సాధనంగా తీసుకొని తాత్విక నిర్ణయాలు చేసుకొనే విధానాన్నే మనం హేతువాదమంటాం. ఆ నిర్ణయాలను హేతుబద్ధంగా అమలు చేసే రీతినే నీతి అంటాం.

మత గ్రంథాల్లో అనేక విషయాలుండవచ్చు. పుస్తక సత్యం ప్రాపంచిక సత్యంతో పొందిక కలది కావాలని లేదు. (తరచు కాదు కూడా). ఆయా పుస్తకాలు వ్రాసేనాటికి ఆయా రచయితలకు ప్రపంచాన్ని గురించీ, జీవితాన్ని గురించీ ఉన్న అవగాహన మాత్రమే వాటిలో ఉంటుంది. పుస్తకంలో నిక్షిప్తం చేయబడ్డ "సత్యం" అలాగే పడివుండగా, ప్రపంచ సత్యాన్ని గురించిన మానవుడి జ్ఞానం రోజురోజుకూ, పెరుగుతూ, మారుతూ ఉంటుంది. అందువల్ల

మతగ్రంథాల ప్రమాణాన్ని హేతువాదం తిరస్కరిస్తుంది. విషయాలను విశ్లేషించి, పరిశీలించి, ప్రయోగం చేసి, పునర్విచారించి, శాస్త్ర పద్ధతిలో మానవుడు పెంపొందించుకుంటున్న జ్ఞానాన్ని లక్ష్యాల నిర్ణయంలో, లక్ష్యసాధన పద్ధతుల్లో హేతుబద్ధంగా వినియోగించుకోవాలంటుంది. ఇదీ హేతువాద పద్ధతి.

శాస్త్రపద్ధతిలోకాక, మరోరీతిగా మనకు వాస్తవిక జ్ఞానం అందే మార్గం లేదు. ఆధునిక విజ్ఞానార్జన పద్ధతులు మానవుడికి అందని రోజుల్లో అతను చేసిన ఊహలన్నీ సరైన జ్ఞానంలో భాగం కానవసరంలేదు. అనేక సందర్భాల్లో కావు కూడా. జ్ఞానం దానంతట అదే ఉద్బుద్ధం (reveal) అవుతుందనీ, అతీంద్రియ జ్ఞానం (intution), దివ్యజ్ఞానం (devination) సంభవమనీ ఒకప్పుడు అనుకొనేవారు. ఇప్పటికీ అలా అనుకొనేవారున్నప్పటికీ, అలాంటి ఇప్పటివారు "అప్పటివారి" క్రిందనే లెక్క. నిజానికి సిగ్మండ్ ఫ్రాయిడ్ అన్నట్లు, **"there is no other source of knowledge of the universe but the systematic intellectual analysis of carefully verified observations - (in fact, what is called research) and no knowledge can be obtained from revelation, intution or divination"** ఉద్బుద్ధం కావడం ద్వారా, అతీంద్రియ సాధనం ద్వారా, దివ్యమార్గం ద్వారా జ్ఞానం లభిస్తుందనేది అబద్ధం. ప్రకృతి జ్ఞానానికి శాస్త్రపద్ధతి తప్ప మరో మార్గం లేదు.

జీవితానుభవంవల్ల కూడా మానవుడికి జ్ఞానం లభించేమాట నిజమే కాని, దానికి కొన్ని పరిమితులున్నాయి. అది నిర్దుష్టం కానవసరంలేదు. మన అనుభవంలోని లోపాలు కూడా ఆ "జ్ఞానం"లో ఇమిడి ఉంటాయి. విశ్లేషణ పద్ధతి ద్వారా ఆ లోపాలను సరిదిద్దుకుంటాం. తత్ఫలితంగా మనజ్ఞానం నిర్దుష్టం కావడమే కాక, ఇనుమడిస్తుంది కూడా. కేవల దర్శనం వల్ల మనకు సత్యం తెలియకపోవచ్చు. ఫలితంగా భ్రాంతులనే సత్యాలుగా మనం భ్రమించవచ్చు. ఎండమావుల్లో నీరున్నట్లు మనకు దృశ్యభ్రమ కల్గడం లేదా? ఉద్బుద్ధజ్ఞానాన్ని, అతీంద్రియ జ్ఞానాన్ని, దివ్యజ్ఞానాన్ని గురించిన భ్రమలు కూడా అలాంటివే. నిజానికి, శాస్త్రజ్ఞానం కూడా అనుభవంతో సంబంధంలేనిది కాదు. అది "సాధారణ" అనుభవ జ్ఞానాన్ని సరిదిద్దే శాస్త్రీయానుభవ జ్ఞానం. అసాధారణ అనుభవాలు రోగ చిహ్నాలు.

విలువలన్నీ మన జ్ఞానం మీద ఆధారపడి నిర్ణయమవుతాయి. అంటే,

విలువలకు మూలమైన జ్ఞానం అపసవ్యమైనదైతే, మన విలువలు కూడా అపసవ్య మైనవవుతాయి. విలువలుగా ఇప్పటిదాక మనం భావిస్తున్నవన్నీ నిజంగానే అపసవ్యమైన, అసమగ్రమైన, అపార్ధజనితమైన జ్ఞానం మీద ఆధారపడి నిర్ణయమైనాయి. అందువల్లనే అవి మానవికాలు కాలేకపోయినై.

ఉన్నది ఈ లోక మొక్కలే. ఈ లోకంలో మనిషి ఎప్పుడేమి చేసినా తన కోసమే. అందువల్ల విలువలు మనిషికి సంబంధించినవే.

కష్టాన్నీ, దుఃఖాన్నీ, బాధనీ, నిర్బంధాన్నీ తగ్గించుకోవడం; సుఖాన్నీ, ఆనందాన్నీ, సంతోషాన్నీ, స్వేచ్ఛనీ పెంచుకోవడం మానవ జీవిత పరమ లక్ష్యం.

మతవాదుల మోక్షం కూడా అలాంటి లక్ష్యమే. అయితే, దానికోసం "ఇక్కడ" కష్టపడితే, "మరెక్కడో" అది లభ్యమవుతుందని వారి అంచనా. ఈ కడ" తప్పితే "మరొక కడ" లేదనే నిజం వారి ఊహకు అందలేదు. వారు నిర్మించుకున్న విలువలన్నీ అవాస్తవాలమీద, దురభిమానాలమీద, అపార్థాలమీద, ఆధారపడినవే. వారు "సర్వేజనా స్సుఖీనోభవంతు" అన్నప్పుడు, వారి సర్వజనుల్లో జనమంతా లేరు. అది ఒక జాతి జనాన్ని ఉద్దేశించినదే. ఇప్పటి మన రాజకీయ నాయకుల "ప్రజల్లో" కూడా ప్రజలంతా లేరు. ఇప్పటికీ మనం జాతి, మత, కుల, వర్గ, ముఠాతత్వాలకు అతీతంగా ఆలోచించే స్థితికి చేరలేదు. మానవుడెక్కడ ఉన్నా, ఏ రంగువాడైనా, ఏ అభిప్రాయాలు కలవాడైనా, ఒకే ఒక జాతికి చెందినవాడనే అభిప్రాయానికి రావడం ఇప్పటికీ కష్టమైపోతున్నది. ఆ ముఠాతత్వాలను అలాగేవుంచి, వాటిమధ్య వైషమ్యాన్ని అంతం చేయాలని ప్రయత్నించడం వల్ల ప్రయోజనంలేదు. అందువల్ల, మనుషులమధ్య హద్దులు గీచుకొని, ముఠాలచుట్టూ గిరులు గీచుకొని, సంకుచిత ఉద్వేగాలకు లోనయి నిర్ణయించుకొన్న విలువలను మనం త్రోసివేయవలసివుంది. విశాల ప్రాతివదికపై మానవుణ్ణి కేంద్రంగా తీసుకొని విలువలను నిర్ణయించుకోవలసివుంది.

నీతిని గురించి ప్రతి మతమూ పాఠాలు చెపుతుంది. దైవవిశ్వాసం లేకపోతే, నీతి నశిస్తుందని గగ్గోలు పెడుతుంది. కాని, ఈనాడు ప్రపంచంలో కోకొల్లలుగా ఉన్న అవినీతికి కారణమేమిటో, ఏ మతస్థుడూ చెప్పడు. ఏనాడు, ఏ మత సమాజంలో మానవ నీతి పరిఢవిల్లిందో చెప్పడు. మానవుణ్ణి కేంద్రంగా తీసుకొని నీతిని నిర్దేశించిన మతమే లేదు. మనిషి బ్రతికేది తనకోసంకాక, మరొక దైవం కోసమని బోధించే మతాలు మనిషికి సంబంధించిన నీతిని

ఏమని చెపుతాయి? సర్వ మానవ సమతను ఏ మతమూ బోధించలేదు. వారి బోధల్లో ఎక్కడైనా సమత ప్రసక్తి వుంటే, అది సర్వమానవ సమతకాదు. అందుకే మనుషుల్ని 'స్వ – పర' విబజనచేసి, పరజనంమీద మతం పేరుతో, మతం పడగనీడలో మతవాదులు ఎంతో ఘోరకలి జరిపినట్లు చరిత్ర రికార్డు చేసింది. దాని నేపథ్యంలో ఉండేది జాతి, మత, కుల, వర్గ వైషమ్యమే. ఏనాడూ, ఏ మతమూ మంచిని సహించలేదు. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ పోవాలంటే హైందవం సహించలేదు. అస్పృశ్యత పాటించరాదంటే సహించలేదు. సతీసహగమనం కూడదంటే సహించలేదు. వితంతు వివాహాలు కావాలంటే సహించలేదు. స్త్రీలకు విద్య కావాలంటే సహించలేదు. బాల్య వివాహాలు పోవాలంటే సహించలేదు. ఏ మంచినీ నిరోధించకుండా మతం వదలలేదు.

హత్య అన్ని సమాజాల్లోనూ నేరంగా పరిగణించబడింది. కాని, అన్ని ముఠా సమాజాలూ – జాతీయ సమాజమూ, మత సమాజమూ, కుల సమాజమూ, వర్గ సమాజమూ "తమ" ఉద్వేగ ప్రీతికోసం హత్యలు చేస్తూనే వస్తున్నాయి. ఆ హత్యలు నేరంగా పరిగణించబడడంలేదు. అవి వీరోచిత కృత్యాలుగా, ఘనకార్యాలుగా, స్వధర్మ నిర్వహణ విధులుగా కీర్తించబడుతూనే ఉన్నాయి. హింసనూ, క్రౌర్యాన్నీ, మానవ మారణ కాండనూ సాగించిన వారుకూడా అహింస, దయాదాక్షిణ్యాలు, శాంతిదాంతులు వగైరాలను విలువలుగా పేర్కొన్నారు. కానీ, అవి స్వవర్గ ప్రయోజనాలతో మాత్రమే సమన్వయించబడినై. వారి స్వర్గ నరక మోక్షభావాలు కూడా వారి విశ్వాసావిశ్వాసాలు ప్రాతిపదికగానే తీర్చబడినై. ఈ స్థితి మారాలంటే మనిషి మారాలి. ఇతరుల అవివేకానికి విధేయత చూపే దశనుంచి సొంత వివేకాన్ని వినియోగించుకొని నిర్ణయాలు తీసుకొనే దశకు పెరగాలి.

"వ్యవస్థ మారాలి" అనే మాటను ఈ రోజుల్లో రాజకీయ వాదులందరి నోటా చాల తరచుగా వింటున్నాము. వ్యవస్థ మార్పు అంటే ఇప్పటి పాలకులుపోయి, కొత్త పాలకులు రావాలని వారి భావం. అంటే, సంఘంలో రాజకీయపరమైన మార్పు రావాలనీ, ఆ మార్పువస్తే ఆర్థికంగా, సాంఘికంగా ... అన్ని విధాలుగానూ మార్పు వస్తుందనీ వారి అంచనా. ఆర్థిక నియతివాదాన్ని సమర్థించే మార్క్సిస్టులు కూడా తెలిసో, తెలియకో ఈ రాజకీయ నియతివాదాన్నే పట్టుకొని ప్రాకులాడుతున్నారు.

వేల సంవత్సరాలుగా ఈ దేశంలోని సాంఘిక వ్యవస్థ ఎలా ఉన్నదో,

చరిత్ర మనకు చెపుతున్నది. మతగ్రంథాలూ, వాటిని అనుసరించే ఈనాటి సమాజమూ సాక్ష్యం పలుకుతూ ఉన్నాయి. వేల సంవత్సరాలుగా ఈ దేశ సామాజిక వ్యవస్థలోని తారతమ్యభావాలు ఇంచుమించు ఇలాగే ఉన్నాయి. వేల సంవత్సరాలనాటి నిచ్చెనమెట్ల సామాజిక భావాలే ఈనాటికీ మానవుడి చిత్తవృత్తిని ఏలుతున్నాయి. ఈ జాతి మనస్తత్వం, కుల మనస్తత్వం, ఉచ్ఛనీచ తారతమ్య భావాలు, పరస్పర విద్వేషాలు ఈనాటివి కావు. ఏది నీతి - ఏది అవినీతి, ఏది మంచి - ఏది చెడు, ఏది తప్పు అనే వాటిని చట్టాలు ఎలా నిర్ణయించినా, వాటిని గురించి వేల సంవత్సరాలుగా మనస్సులో జీర్ణించుకుపోయిన భావాలు, దురభిమానాలు చెదరనేలేదు. కులానికొక శిక్షవేసే పద్ధతి పరదేశీయుల పాలనలో కొంత మార్పు చెందినా, కులాన్నిబట్టి గౌరవాగౌరవ భావాలు, ఉచ్ఛనీచభావనలు మన మనస్సుల నుంచి చెరగలేదు. మన రాజ్యాంగం మతానికొక శిక్షాస్మృతిని ఆమోదించడం ద్వారా "కొత్త కులతత్వానికి" పునాదులు బిగించింది. వేల సంవత్సరాలనాటి మౌఢ్యాలు, మోసాలు, ముఠాబానిస భావాలు సడలనేలేదు. పామరులు అమ్మవారి కొలుపుల పేరుతో ఆగాలు చేస్తుంటే, సంస్కృతం చదువుకున్న అయ్యవార్లు (అశ్వ) మేధాల పేరుతో యాగాలు చేస్తున్నారు. ఏనాటి భావాలు ఈనాటి మనుషుల్ని అలాంటి అవివేక చేష్టలకు పురికొల్పుతున్నాయో, మనం ఆలోచించాలి. వాటిని సమర్థించే "ఆధునికులు" కూడా అల్పసంఖ్యలో లేరు. సోషలిజమో, కమ్యూనిజమో వస్తే, ఈ జనమంతా భౌతికవాదులైపోతారనుకోవడం భ్రమ. అసలు మూఢ సనాతన భావాలకు తలలు తాకట్టు పెట్టిన జనంచేత సోషలిస్టు, కమ్యూనిస్టు విప్లవాల్ని చేయిద్దామనుకోవడం కూడా భ్రమే. విప్లవాలంటే ఏమిటో, అవి ఎందుకు, ఎలా చేయాలో, వాటి ఫలితంగా రావలసిన వ్యవస్థ ఎలా ఉండాలో వారికి తెలియదు. ముందు విప్లవం రానీయండి చూద్దాం అనడం ఎలా ఉంటుందంటే, ముందు స్వరాజ్యం రానీయండి చూద్దామన్నట్లుంటుంది. స్వరాజ్యం వచ్చింది, చూస్తున్నాం.

ఈ జనమంతా అప్పటికీ, ఇప్పటికీ మానసిక నిద్రలో ఉన్నారు. దోచుకొనేవాళ్ళూ, దోచుకోబడేవాళ్ళూ, అంతా వేల సంవత్సరాల నుంచి అలా నిద్రపోతూనే ఉన్నారు. వారు మానవత పరంగా సుప్తదశలో ఉండబట్టే జాతి, మత, కుల, వర్గ, ముఠా వైషమ్యాలతో, విద్వేషాలతో కొట్టుక చస్తున్నారు. వాటికొరకు చంపడం-చావడం వీరోచితకార్యంగా, విధ్యుక్తధర్మంగా

భావిస్తున్నారు. ఒకే ప్రపంచంలో బ్రతకలేకపోతున్నారు. ఈ దేశంలో ఒక గ్రామంలోనే బ్రతకలేకపోతున్నారు. హెరాక్లిటస్ అన్నట్లు when men are awake, they can live in a common world. మానవత్వం పరంగా వారింకా మేలుకోలేదు. కాబట్టే, పరస్పర విద్వేష ఉద్వేగోన్మాదాలతో మానవజాతి సుఖానికేకాక, భద్రతకూ, మనుగడకూ కూడా ముప్పుతెస్తున్నారు. ఉద్వేగాన్ని ఉపశమింపజేసి, వివేకాన్ని మేల్కొల్ప గలిగినప్పుడు మాత్రమే మనం ఒకే ప్రపంచంలో జీవించగలుగుతాం.

"ఏదైనా ముఖ్యమైన ప్రపంచ సమస్యమీద ఎవరైనా ప్రపంచ ప్రముఖునితో చర్చించి నివేదిక పంపిచమని" 1932లో నానాజాతిసమితి ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌ని కోరింది. ఆయన "యుద్ధంనుంచి ప్రపంచాన్ని కాపాడే మార్గం ఉందా?" అనే సమస్యను ఎన్నుకొని ప్రఖ్యాత మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు సిగ్మండ్ ఫ్రాయిడ్‌తో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు. ఆ సందర్భంలో, 1932 సెప్టెంబరులో ఫ్రాయిడ్ ఐన్‌స్టీన్‌కు వ్రాసిన ఉత్తరంలో, **"The ideal conditions would obviously be found in a community where every man subordinated his instinctive life to the dictates of reason. Nothing less than this could bring about so thorough and so durable a union between men, even if this involved the severance of mutual ties of sentiment"** అన్నాడు. హేతువాదం ఎందుకు కావాలో, ఈ రెండు వాక్యాలే మనకు స్పష్టం చేస్తున్నాయి. సమాజంలో ఉత్తమ ఆదర్శవంతమైన సంబంధాలుండాలంటే, సహజాత ఉద్వేగాలతో కొట్టుకపోయే జీవితాన్ని హేతువు యొక్క ఆదేశాల ప్రకారం మలచుకోవాలి. దానివల్ల పరస్పర రాగభావబంధాలు దెబ్బతినేదికద్దు. అయినా, మానవ సత్సంబంధాలు చిరంతనంగా నెలకొనే స్థితి రావాలంటే, అంతకంటె మార్గం లేదు.

ఈ క్రమం సత్వర ఫలితాన్ని ఇవ్వకపోవచ్చు. ఫలితం సత్వరంగా రావడం ఒక్కటే ప్రధానంకాదు. ఎలాంటి ఫలితాన్ని సాధించామనేది ప్రధానం. ఈనాటి సమాజ రుగ్మత ఈనాటిదికాదు. చిటికెలో దాన్ని నయంచేసే మార్గంలేదు. మూలానికి వెళ్ళి సమాజాన్ని పునర్నిర్మించే ప్రయత్నం చేయాలి. సమాజ మూలమైన మానవుడు మారనిదే సమాజం మారదు. దౌర్జన్య పద్ధతులు మనిషిని మార్చలేవు. మనిషి మారడమంటే అతని మనస్సు మారడం. బలవంత

పద్ధతులవల్ల మనసు మారదు.

యుద్ధానికెన్ని కారణాలైనా ఉండవచ్చు. మానవ సంబంధాలు హేతుబద్ధమైన రీతిలో దిద్దితీర్చబడినప్పుడు ఆ కారణాలన్నీ అంతర్ధానమవుతాయి. మానవులమధ్య విద్వేషాలను, కక్షలను, ఆవేశోద్వేగాలను రెచ్చగొట్టే భావాలు ఈనాటికీనాడు పుట్టినవికావు. వాటి పునాదులు చాల లోతుగా ఉన్నాయి. హేతుత్వం ఎంత బలంకలదైనా, మానవుడి ఉపచేతనం (ఉపబుద్ధి)లో పాతుకొనిపోయిన భావాలను కదల్చడం అంత తేలికకాదు. వేల సంవత్సరాలనాటి వికృత భావాలు తరంనుంచి తరానికి సంప్రదాయాలుగా సంక్రమించి నిలదొక్కుకున్నాయి. ఎన్నడూ వాటి మీద హేతుబద్ధమైన అదుపులేదు. ఉద్వేగాలమీద పెత్తనం హేతువు కెన్నడూ లభించలేదు. ఉద్వేగాలు జంతువారసత్వాలు. సహజంగానే అవి మానవుడి ప్రవృత్తుల్లోకి దిగుమతి అయినై. అట్లని మానవుడు ఉద్వేగాలను బానిస అయితే జంతు దశను దాటనట్లే. అందుకే మనం మన ఉద్వేగాలను హేతువు అదుపులో, సారధ్యంలో ఉంచాలంటుంది హేతువాదం.

మతాలెక్కడో ఆకాశం నుంచి దిగుమతి అయినవికావు. అవి జాతుల్లో పుట్టినవే, జాతుల ఆదర్శాలుగా పెరిగినవే. ఆయా జాతుల్లో ఆచార సంప్రదాయాలుగా, కట్టుబాట్లుగా, ఆదర్శాలుగా పెంపొందినవే. జాతీయోద్వేగం ఆ మతాల్లోకి దిగుమతి అయింది. అలాగే తెగల కట్టు బాట్లు కులకట్టుబాట్లుగా దిగుమతి అయినై. అవి అలా ఉండగానే వర్గతత్వం మరో ఉద్వేగమూలకమైంది. వాటి వెనుక ఉన్న అహేతుక మందతత్వాన్ని గమనించకపోవడంతో మనిషిని విభజించిచూచే తత్వమే ఇక్కడి విలువలకు మూలమైంది. జాతి, మత, కుల, వర్గ సంస్కృతుల మీది అభిమాన దురభిమానాలతో ఉద్వేగాలను రెచ్చగొట్టడం, వాటి పేరుతో అత్యాచారాలకు పాల్పడడం మానవుడి ప్రవర్తనలో భాగమైపోయింది. నానాడు మానవుడు సంపాదించుకొంటూ వస్తున్న జ్ఞానాన్ని కూడా ఆ ప్రవర్తనను సమర్థించుకోడానికే వినియోగించడం జరుగుతున్నది. ఎన్నో తరాలుగా తిష్టవేసిన ఆ భావోద్వేగాలను పది, ఇరవై, యాభై, వంద సంవత్సరాల్లో కదల్చడం, మంచి మార్గానికి మలచడం సులభసాధ్యం కాదు. మన సంస్కారంలో హేతుబద్ధమైన ఆలోచన భాగమైనప్పుడు మాత్రమే అది సాధ్యమవుతుంది. అది ఒక్కనాడు జరిగే క్రమంకాదు.

అదాటుగా సమాజంలో జరిగే "విప్లవాలు", రాజకీయాధికార

మార్పిడులు, ఆ క్రమాన్ని సాధించడానికేనన్నట్లు మనకు భ్రమల్ని కల్గిస్తాయి. కాని, చరిత్రలో అది అంతతేలికగా సాధ్యం కాలేదనేది మన అనుభవమే. కారణాలేమైనప్పటికీ, వ్యవస్థను సమూలంగా మార్చడానికి ప్రోత్సహించగల భావవిప్లవం ఈ దేశంలో రాలేదు. భావ పునర్వికాస (రినైజాన్స్) ఉద్యమం ఈ దేశంలో నడవలేదు. ఇప్పుడు నడిచే అవకాశం లేదు. ఈ దేశంలో మతపునపుద్ధరణవాదం (రివైవలిజం), మతఛాందస వాదం (ఫండమెంటలిజం) బలిసే అవకాశం ఉంది. దానివల్ల చరిత్ర వెనక్కు తిరుగుతుంది. సమాజం వెనక్కు నడుస్తుంది. అత్యంత ప్రమాదకరమైన ఆ స్థితిని నివారించుకోడానికే హేతువాద ఉద్యమం అవసరం. జ్ఞానదీప్తిని నిత్య నూతనంగా ఉంచగలిగేది హేతువాద దృక్పథం ఒక్కటే. మానవవాద ఉద్యమంవైపు పయనించే హేతువాద ఉద్యమమే ఈనాడు దేశంలో తాత్విక విప్లవానికి మార్గం.

యూరపియన్ రినైజాన్స్ కాలంలో మానవుణ్ణి మతం సంకెళ్ళ నుంచి విడిపించడానికి మేధావులు అన్ని రంగాల్లోనూ కృషిచేశారు. మనిషి స్వేచ్ఛా జిజ్ఞాసవైపు మళ్లింది అప్పుడే. తత్ఫలితంగా ఖగోళ విజ్ఞానం, భౌతిక రసాయనిక జీవశాస్త్రాలు సరికొత్త పుంతలు తొక్కినై. ఆధునిక విజ్ఞాన శాస్త్రావిర్భావానికి పూర్వరంగం రినైజాన్స్ వల్ల తయారుకాగా, ఆ శాస్త్రజ్ఞానం ఆవిష్కరిస్తూ వచ్చిన నూతన సత్యాలు బైబిలు యొక్క ప్రాపంచిక విజ్ఞానాన్ని సవాలుచేస్తూ వచ్చినై. దాదాపు మూడు నాల్గు శతాబ్దాలు శాస్త్రానికీ – మతానికీ మధ్య ఎడతెగని పోరాటం జరిగింది. (కొన్ని చోట్ల ఇప్పటికీ – మతం జీవపరిణామవాదంమీద పోరాటం జరుపుతూనే ఉంది). మతానికి దెబ్బమీద దెబ్బ తగలడం, శాస్త్ర జ్ఞానానికి విజయం మీద విజయం లభించడం సామాజికుడు సుదీర్ఘంగా గమనిస్తూనే వచ్చాడు. అదే అక్కడి సంస్కారాన్ని రూపొందిస్తూ వచ్చింది.

ఇక్కడి పరిస్థితి వేరు. ఇక్కడ మతంమీద తిరుగుబాటు జరగలేదు. మతం పిడికిళ్ళనుంచి మనిషి విముక్తి పొందలేదు. ఆధునిక విజ్ఞానం ఆవిర్భవించలేదు. శాస్త్రానికీ, మతానికీ మధ్య ఘర్షణ తలెత్తలేదు. ఆధునిక విజ్ఞానాన్ని ఇటీవలే మనం దిగుమతి చేసుకొన్నాం. అయినా, ప్రాచీన భావాల దాస్యం మనల్ని వదలలేదు. యూరపియన్‌లు లాటిన్ భాషను విడిచి దేశ భాషలవైపు పయనించగా, మనం దేశభాషల్ని వదలి సంస్కృతభాషవైపు జరిగిపోతున్నాం. వారు లాటిన్ గ్రంథాల్ని వదలి సత్యాన్వేషణపథంలో అనంత విజ్ఞానోమ్ముఖులు కాగా, మనం సంస్కృత గ్రంథాల్లో ఉన్న కాణాచిని వెదకడానికి

ఇప్పుడు ఉపక్రమించాం. సంస్కృత గ్రంథాల్లో ఉన్న మంచిచెడ్డల్ని మన పూర్వులు ఏడెనిమిది వందల సంవత్సరాల క్రిందట చర్చించి ఉంటే, మనదేశం బాగుపడిపోయేది. కాని, ఆ పని జరగలేదు. ఇప్పటికీ తెలుగులోకి రాని "అదవి సంస్కృత' గ్రంధాలున్నాయి. వాటిలోనే విజ్ఞాన సర్వస్వం ఉందని ప్రచారం చేసేవారి లక్ష్యం మానవాభ్యుదయం కాదు. మనమిప్పుడు సంస్కృత గ్రంధాల నుంచి నేర్చుకొనే దశలో లేము.

ఒకనాడు యూరపియన్ అర్థంలో రినైజాన్స్ అన్నది ఇప్పుడీ దేశంలో రివైవలిజం క్రింద మారిపోతోంది. ఇప్పటికే రివైవలిస్టు ఛాయలు బలిసిపోయినై. పాశ్చాత్యులు ఆధునిక విజ్ఞానశాస్త్ర యుగంలో ప్రవేశించిన తర్వాత మనదేశంలో బయలుదేరిన దయానందులు, వివేకానందులు రివైవలిజానికే సహాయపడ్డారు. అందువల్ల, యూరపులో జరిగిన చారిత్రక క్రమంలో, వెనక్కు వెళ్ళి ఇక్కడ తాత్విక విప్లవాన్ని తీసుకురావాలనడం తప్పిదమవుతుంది. మారిన భావనాసరళికి అనుగుణంగా అక్కడ బయలుదేరిన కొత్త రాజకీయార్థిక వ్యవస్థలూ, ఆధునిక విజ్ఞానశాస్త్రమూ అక్కడ నుంచి ఇక్కడకు గెంతువేయవలసి ఉంది. కానీ, వేయలేదు. కాబట్టి, శాస్త్రీయ హేతువాద దృక్పథంతో పాత విలువల్ని త్రోసివేసి, కొత్త విలువల్ని మనం ఏర్పరచుకోవలసి ఉంది. రినైజాన్స్ తర్వాత యూరపు సూచించిన మానవవాద మార్గంవైపు పయనించవలసి ఉంది. పరలోకం పేరుతో సాగే నియంతృత్వంతోపాటు, ఇహలోకంలో జరిగే నియంతృత్వాన్ని కూడా మనం ఎదుర్కోవలసి ఉంది. నాలుగు శతాబ్దాలుగా యూరపు సాధించిన ఆధునిక విజ్ఞానశాస్త్ర జ్ఞానాన్ని తయారైన వస్తువు (finished product)గా దిగుమతి చేసుకున్న మనం ఆ శాస్త్ర ఫలితంగా వారు ప్రతిపాదించిన తాత్విక, మానవ విలువల్ని ఆమోదించకపోవడం వివేకంకాదు. మనం ఇంకా ముందుకు పోవాలంటే, ఆధునిక విజ్ఞానంవద్ద నుంచే బయలుదేరాలి. వేదాదుల్లో శాస్త్రాన్నీ, తత్వాన్నీ వెదకమనే దుర్బోధను మనం ఎదిరించాలి. వేదాలదాక వెనక్కుకాని, వేదాల "వద్ద" నుంచి ముందుకుకాని సాగాలనడం అవివేకంతోనైనా కావాలి, దుష్టసంకల్పంతోనైనా కావాలి.

నేటి భారత సామాజిక పునాదిని ఆర్థికతలో చూచేవారంతా ఎండమావుల్లో నీటిని చూస్తున్నారు తప్ప, వాస్తవికతను గమనించడంలేదు. ఇక్కడ ప్రతి సామాజికుడి సంస్కారాన్ని అతని మతభావాలు, కులాచారాదులు నిర్ణయిస్తున్నాయి. మార్చుకుంటే మతంమారినా, కులంమారని సమాజంలో

మనమున్నాం. మతాంతర వివాహాలవల్ల కొత్తమతాలు పుట్టకపోయినా, కులాంతర వివాహాలవల్ల కొత్తకులాలు పుట్టే సమాజంలో మనమున్నాం. దోచుకొనేవాడూ, దోచుకోబడేవాడూ వర్గవిభేదాల్ని మరచి కౌగలించుకొనే కుల మత సమాజంలో మనమున్నాం. కులం పేరతో, మతం పేరుతో మనిషిని మనిషి అన్యుడుగా పరిగణించే సమాజంలో మనమున్నాం. అత్యంత ఆధునిక విజ్ఞానంతో పరిచయమున్నవారు కూడా ఆటవికుల దేవతల్ని పూజించే సమాజంలో మనమున్నాం. ఒకవైపు అధునాతన సాంకేతిక విజ్ఞానాన్నీ, మరోవైపు బాబాలనూ, స్వాములవార్లనూ పెంచుకుంటున్న ద్వంద్వ ప్రకృతుల సమాజంలో మనమున్నాం. పశువుల్ని పూజిస్తూ, మనుషుల్ని అస్పృశ్యులుగా పరిగణించే పిచ్చ సమాజంలో మనమున్నాం. పాములకు పాలు, మనుషులకు విషము పోసే సనాతన ధర్మ సమాజంలో మనమున్నాం. ప్రత్యక్షంగా దర్శనమిస్తున్న ఈ వాస్తవాన్ని చూస్తూ కూడా చూడనట్లు నటించే రాజకీయ సంస్కారం చాలా హానికరమైనది. దీనికి పరిష్కారం కేవలం రాజకీయపరంగాకాని, ఆర్థికపరంగాకాని లేదు. రోగం ఒకటయితే, మందు మరొకటి వాడడం వల్ల ప్రయోజనం లేదు.

మనకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత విలువల గందరగోళం వల్ల మంచి కంటె చెడు ఎక్కువగా పెరిగింది. ఈ రాజకీయ, ఆర్థిక వ్యవస్థ మారవలసిందే. అందులో ఏమాత్రం సందేహంలేదు. అది ఇంతలో మారేట్లు లేకపోగా, ఎవరు మార్చాలి, ఎలా మార్చాలి, ఎటువైపు మార్చాలి, అనే ప్రశ్నలు మిగిలేపోయినై. కేవలం రాజకీయ "మార్పు" వచ్చినంత మాత్రాన మనుషుల మానసిక సంస్కారంలో అమాంతంగా మార్పువస్తుందని ఆశించడం పొరపాటవుతుంది. తాము అధికార పీఠాన్ని ఎక్కిందాకా ఈ సామాజిక రీతి ఇలానే కొనసాగాలనడం దుర్మార్గమవుతుంది. రాజకీయాధికారాన్ని సాగించేవారు ఆ అధికారాన్ని నిలబెట్టుకొనే ప్రయత్నంలోనే తలమునకలుగా ఉంటారు. అప్పుడీ సామాజిక వ్యవస్థలోని కుసంస్కారాన్ని ఇలాగే అట్టి పెట్టడం వారి వ్యూహంలో భాగమవుతుంది. అదే జరిగింది ఇప్పటిదాకా.

రాజకీయ పాలకులు భావపరిణామాన్ని సాధించిన ఘట్టాలు చరిత్రలో చాల తక్కువ. మంచిగానైనా, చెడ్డగానైనా, ప్రజల భావనాసరళిలో మార్పులు తెచ్చినవారు భావోద్యమకారులే. రాజకీయాధికారం లేకుండానే బుద్ధుడు భావవిప్లవం సాధించాడు. రాజకీయ ప్రవాసిగా ఉంటూనే మార్క్స్

రాజకీయార్థిక విప్లవ భావాలు ఎదజల్లాడు. అయితే, ఏ భావాలైనా భ్రష్టమై వ్యవస్థీకరణ పొంది మత ప్రాతిపదిక సంపాదించుకొనే సందర్భాలు మనకు ముఖ్యంగా రెండు కన్పిస్తాయి. భావాలను "సామాన్యుడి" స్థాయికి తీసుకువెళ్లాలనే తొందరలో వాటి వికారాలను ప్రచారం చేయడం ఒకటి, స్వాధికారం స్థిరం చేసుకోవడం కోసం పాలకులు వాటిని భ్రష్టపరచి వ్యాపింపజేయడం మరొకటి. ఈ రెండు సందర్భాలలోనూ "అసలు భావాలు" ఆనవాలు పట్టడానికి వీలులేకుండా పోతాయి. హేతువాదవైఖరిని వ్యాప్తిలోకి తీసుకువచ్చే సందర్భాల్లో కూడా తరచు అలా జరగవచ్చు. హేతువాదాన్ని కేవలం తర్కంగానో, నాస్తికవాదంగానో, సంస్కరణవాదంగానో వికారంగా ప్రదర్శించడం జరుగుతుంది.

అన్ని కాలాల్లోనూ ప్రగతి సాధకులైన మేధావులు మైనారిటీలోనే ఉంటారు. యూరపియన్ రినైజాన్స్ కాలంలోనూ అంతే; దాన్ని అనుసరించిన ఆధునిక విజ్ఞాన శాస్త్రయుగంలోనూ అంతే; అంతే కాదు. ఆ రోజుల్లో మెజారిటీ ప్రజానీకం ప్రగతి నిరోధకులనే బలపరిచింది కూడా. అదే పరిస్థితి ఈనాడు కూడా ఉన్నందుకు మనం చింతించనవసరం లేదు. ప్రగతి సారధులీ వాస్తవాన్ని గమనించాలి. సత్యాన్ని వారి ముందుంచడంవల్ల పాత సమస్యలకు తీసిపోని కొత్త సమస్యలు తలెత్తుతాయి. బారెడు దూరమైనా, బాటనే పోవాలి. ఏ లక్ష్యాన్ని చేరడానికయినా సరయిన మార్గమే దగ్గర దారి. అడ్డదారి వల్ల లక్ష్యానికి ద్రోహం జరిగితీరుతుంది. అందువల్ల, మనం హేతువాదాన్ని దాని అసలు రూపంలోనే ప్రజల దగ్గరకు చేర్చాలి. దాన్ని అందుకొనే దశకు ప్రజల్ని వికసింపజేయడానికి మనం ప్రయత్నం చేయాలి.

ఇటీవల "హేతువాదం" పేర గౌతముడి న్యాయదర్శనానికి భావానువాదం (రాంషా) వెలువడింది. అపాటి హేతువాదం సాంఖ్య వైశేషికాదుల్లో కూడా ఉంది. వారి తర్కం వాస్తవికతకు అతీతమైన అస్తిత్వాన్ని కూడా ప్రతిపాదించింది. అభౌతికతను, అతీతత్వాన్ని, అతీంద్రియత్వాన్ని ఆమోదించే స్థితిలో ఆధునిక విజ్ఞానం, హేతువాదం లేవు. అందువల్లనే కేవల తర్కం హేతువాదం కాదంటాము.

మన పూర్వులు ఆయా విషయాలమీద ఏమేమి చెప్పారో తెలుసుకోవడంలో తప్పులేదు. తెలుసుకోవడం అవసరంకూడా. అయితే, వారి తర్కాన్నే హేతువాదమని భ్రమపడితే తప్పుచేసిన వాళ్ళమవుతాం. ఈ భ్రమలు

పడవలసిన కాలం నుంచి మనం కొన్ని వందల ఏళ్ళు దాటి ముందుకు వచ్చామనడం అందుకే. ఈనాడు విజ్ఞానం ఏ పూజారీ – రాజరిక వర్గాలవారి గుత్తాధికారమో కాదు. తాటాకులమీది రాతల్ని కాగితాలమీది కెక్కించడం ద్వారా అచ్చు యంత్రం విజ్ఞానాన్ని అందరి అందికలోకి తెచ్చింది. ఈ విజ్ఞానం మతాన్ని త్రోసి రాజంటున్నదని చూపడానికి విశేషావకాశాలున్నాయి. మతాన్ని మ్యూజియం వస్తువుగా ప్రదర్శించడానికి కావలసిన ప్రచార సాధనాలున్నాయి. అయినా, మతం స్థానాన్ని మతానికి చూపించడానికి రాజకీయ అవకాశవాదమే అవరోధాలు కల్పిస్తున్నది. అందువల్ల, మతం నోరుచేసుకుంటున్నది. దాని నోరుమూయించడానికి చిత్తశుద్ధితో శాస్త్రీయ హేతువాదవైఖరిని వ్యాప్తిచేయాలి.

మనం మారిన ప్రపంచంలో ఉన్నాం. భౌతిక ప్రపంచం గురించి, జీవజగత్తు గురించి, మానవుణ్ణి గురించి, అతని మానసిక ప్రతిభావ్యుత్పత్తుల్ని గురించి ఎంతో వాస్తవజ్ఞానం ఆర్జించిన రోజుల్లో మనమున్నాం. దేశావధులుదాటి, జాతిభేదాలు మరచి, గతాన్ని – వర్తమానాన్ని గురించి మనమెంతో తెలుసుకుంటున్నాం. అయినా, ఆ విజ్ఞానంతో సమన్వయం పొందవలసిన తాత్విక అవగాహన కొరవడింది. అందువల్ల, ఆధునిక సమాజం నైతిక సంక్లిష్టపరిస్థితిలో ఇరుక్కుపోయింది. కొందరు వాదిస్తున్నట్లు ఈ పరిస్థితికి కారణం ఆధునిక విజ్ఞానం కాదు. పాతవిలువలమీది మమతే అందుకు కారణం. శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానం పెరిగిన మేరకు భావపరిణామం జరగడంలేదు. పాతవిలువల్ని వదలుకోనూలేక, కొత్తవిలువల్ని ఆమోదించనూలేక మనం సతమతమవుతున్నాం.

నీతి తగ్గిపోతున్నట్లూ, అవినీతి పెరిగిపోతున్నట్లూ భావించేవారు కొందరున్నారు. అందుకు కారణం కొత్త జ్ఞానంతో పాత విలువ సమర్థించుకోవడంలో ఉందని వారు గుర్తించాలి. నీతి సాక్షికంకాదు. దాని పక్షపాతం లేదు. విలువలు మతాలపరంగా నిర్ణయం కారాదు.

మానవజాతి మొత్తంగా జాగృతం కావాలని మనం కోరుకుంటున్న తరుణమిది. తరతరాలుగా ప్రత్యేక హక్కులు, సౌకర్యాలు గుత్తాధికారంగా అనుభవిస్తూ, ఇతరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరిస్తున్న వారికి తమ పాత అలవాట్లకు ఇబ్బంది కల్గించే ప్రతి అంశమూ అవినీతికరమైనదిగా కన్పించవచ్చు. విలువల్ని గురించి నూతన దృక్పథంలో ఆలోచించకపోవడం వల్ల ఆ పరిస్థితి ఉత్పన్నమవుతుంది. పాత – కొత్త విలువల మధ్య ఘర్షణ వచ్చినప్పుడు, జాతి

మత కుల వర్గాది మురాల పేర్లతో పోరాటం తప్పుదారి పట్టినపుడు విలువలకు విలువ చచ్చిపోతుంది. అలా చచ్చిపోవడం వల్లనే జాత్యుద్ధరణ పేరుతో ఫాసిస్టు నియంతృత్వమూ, వర్గసముద్ధరణ పేరులో కమ్యూనిస్టు నియంతృత్వమూ అవతరించినై. 20వ శతాబ్దంలో వేసిన ఆ తప్పటడుగులు అంతకు ముందు రెండు శతాబ్దాల్లో మానవ విలువలపట్ల పెరిగిన గౌరవానికి విఘాతం కల్గించినై. ఈ స్థితిని అవకాశంగా తీసుకున్న మతవాదులు తాత్విక రంగంలో భావవాదం కోసం పిలుపు ఇచ్చారు. మంత్ర తంత్రాల్నీ, అతీంద్రియ శక్తుల్నీ, గారడీ గమ్మత్తుల్నీ, మూఢ విశ్వాసాలనూ సమర్థిస్తూ శాస్త్రజ్ఞానం మీద సవాళ్ళు విసరడం ప్రారంభించారు. మతాలన్నీ ప్రాథమిక ఛాందసదశ (fundamentalism)కు వెళ్లి వీరమతవాదాలుగా మారుతున్నాయి. అత్యంత ప్రమాదకరమయిన ఈ అరిష్టాన్ని నివారించడానికి నవ్యవీరమత వాదాలు పనికిరావు. మత వ్యతిరేకత మరోమతానికి దారితీయరాదు. ఎందుకంటే, అది మరొక రియాక్షన్ అవుతుంది. కొత్తమౌఢ్యాలను రంగంలోకి దించుతుంది. ఆధునిక విజ్ఞానంతో సమన్వయం పొందిన విలువల్ని అది కూడా కాపాడజాలదు.

రియాక్షన్స్‌ని రివొల్యూషన్స్‌గా అపార్థం చేసుకొనే తాత్విక సంధియుగంలో మనమున్నాం. అందువల్ల ఈనాడు మానవవాద విలువల్ని ప్రతిపాదించి పరిరక్షించే హేతువాదం అత్యావశ్యకమవుతున్నది. ఫాసిజమో, కమ్యూనిజమో - ఒక దశాబ్దమో, శతాబ్దమో అధికారంలో కొనసాగినంత మాత్రాన, ఆధునిక మానవ సమస్యలు పరిష్కారమవుతాయనుకోవడం పొరపాటు. ఆధునిక మానవుడు చాల సంశ్లిష్ట సమాజంలో ఉన్నాడు. శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానం అతనిముందు బహుళ సమస్యలను ఉంచింది. అతనిప్పుడు వెనక్కుమళ్ళే సమస్య లేదు. ముందుకు వెళ్ళాలంటే మారిన పరిస్థితులకు అనుగుణంగా కొత్త విలువలకు పిలుపు ఇవ్వాలి. సమాజం వినాశోన్ముఖం కాకుండా ఉండాలంటే అదే మార్గం. మానసిక విప్లవం రానిదే, సంప్రదాయగాడి నుంచి ఆలోచనా విధానం విముక్తం కానిదే, నూతన విలువలకు అనుగుణంగా నడచుకోవడం సాధ్యం కాదు. మానసిక చైతన్యాన్ని నిత్యనూతనంగా మలచగల హేతువాదం మాత్రమే దానికి శాశ్వత మార్గం.

మతాలను స్థాపించుకొంటూ పోయే దశను మనం అధిగమించాం. గత మూడునాల్గు శతాబ్దాల వైజ్ఞానికానుభవం మనకు ఆ విషయాన్ని రుజువు చేసింది. నిరంతర పరిణామంతో వైజ్ఞానికాభివృద్ధిని సాధించే శాస్త్రపద్ధతిని

మనం ఎన్నుకున్నాం. రోజురోజుకూ సత్యానికి మెరుగులు దిద్దుకుంటున్నాం. అలానే జీవనతత్వం కూడా నిరంతర ప్రగతిశీలం కావాలి. అందుకు సాధనం హేతువాదమే. పెరుగుతున్న విజ్ఞానానికి అనుగుణంగా జీవనతత్వాన్నీ, విలువల్నీ, వాటి సాధన పద్ధతుల్నీ మలచుకొంటూ పురోగమించే హేతువాద విధానమే అందుకు మార్గం. జీవించడం ఎంత అవసరమో, హేతుబద్ధంగా జీవించడం అంత అవసరం. జీవించడానికి ఉచ్ఛ్వాస విశ్వాసాలు ఎలా అనివార్యమో, మానవించడానికి హేతుబద్ధమైన వివేచన అలా అనివార్యం. మానవుడు జీవించడమంటే మానవించడమే - అంటే ఆలోచనా పూర్వకంగా జీవించడమే. మానవించడానికి ఫలితమే అభ్యుదయం.

వెట్టిచాకిరి విధానం పోవాలంటున్నాం, వెట్టి ఆలోచనా విధానం పోవాలని అనలేకుండా ఉన్నాం. శారీరక బానిసత్వం పోవాలంటున్నాం. మానసిక దాస్యం పోవాలని అనలేకుండా ఉన్నాం. కండబలాన్ని తాకట్టుపెట్టవద్దంటున్నాం, బుద్ధిబలాన్ని తాకట్టు పెట్టవద్దని అనలేకుండా ఉన్నాం. ఇవి ద్వంద్వ ప్రకృతులు. పాశవికమైన అంశాల్లో స్వాతంత్ర్యాన్నీ, మానవికమైన అంశాల్లో దాస్యాన్నీ ఎన్నుకోడానికి హేతువాద పద్ధతి అంగీకరించదు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సర్వేసర్వత్రా వెల్లి విరియాలని హేతువాదం తీర్పు చెపుతుంది. తాత్విక భౌతికవాదాన్ని "భౌతిక అవసరాల వాదం"గా చిత్రించేవారు భావాల స్వేచ్ఛను ఆమోదించరు. భావోత్పత్తిని మానవుడి విశిష్ట లక్షణంగా గుర్తించే హేతువాదం భావస్వేచ్ఛను గుర్తించని ఏ సిద్ధాంతాన్నయినా హర్షించలేదు.

మనిషిని మనిషిగా అర్థంచేసుకొని, మానవ ప్రవృత్తిని నిరాటంకంగా కొనసాగించే విధానం హేతువాదం, కాబట్టి, "మానవవాదంలో పరాకాష్ట చెందే హేతువాదం ఎందుకు?" అనే ప్రశ్న ఉదయించదు. పశువువలె దొరికిన కాయకసరుల్ని మేస్తూ మనిషి ద్రిమ్మరలేక పోయాడు. అద్భుతమైన ఉత్పాదక శక్తిని పెంచుకున్నాడు. గుహావాసాలనుంచి గృహావాసాలకు మారాడు. వెలుగు కోసం గాయత్రిని జపించే దశనుంచి వెలుగు (విద్యుత్తు)ను వెలువరించే దశకు పెరిగాడు. నీటి మడుగుల్ని ఈదే దశనుంచి మహా సముద్రాల మీదుగా నౌకాయానం చేసే దశకు పెరిగాడు. ఎగిరే పక్షిని చూచి విస్తుపోయే దశ నుంచి విమానాల్లో, రాకెట్లలో ఆకాశంలోకి దూసుకుపోయే దశకు పెరిగాడు. భావాలనూ, భావనావిధానాలనూ వ్యవస్థలనూ ఏర్పరచుకొంటూ,

మార్చుకొంటూ పురోగమిస్తున్నాడు. జీవ నిర్జీవ ప్రకృతిని, మానవుడి మానసిక ప్రవృత్తిని విశ్లేషించి, పరిశీలించి, అధ్యయనం చేసి మానవజాతి మనుగడకు, సుఖజీవనానికి మార్గాలు వేసుకొంటున్నాడు. ఈ క్రమమంతటిలోనూ అతన్ని నడుపుతున్నది హేతుబద్ధమైన ఆలోచనే. "అందువల్ల", ఇంతకు ముందే చెప్పినట్లు, మనిషిని పశువునుంచి వేరుచేసే హేతుత్వం మనిషికెందుకు అని ప్రశ్నించడం అర్థరహితమవుతుంది. కనీసం పశువుగా నిలబడిపోకుండా ఉండడానికయినా మనం సహేతుకంగా ప్రవర్తించాలి. సమస్యల పరిష్కారానికి పాశవిక బలమొక్కటే మార్గంకాదని తెలుసుకోడానికయినా మనకు హేతువాద ఆలోచనా విధానం అవసరమే. (హేతువాదం 1980)

---

# రాడికల్ హ్యూమనిజం

- రావిపూడి

రాయ్ ప్రకారం మానవవాదం దేశకాలాలకు పరిమితమైంది కాదు. "అది అన్ని ప్రదేశాల్లోనూ, అన్ని యుగాల్లోనూ ఉన్న మానవ ఆలోచనాసారం. అందువల్లనే యే ఆలోచనైనా ప్రాయికంగా హ్యూమనిస్టు ఆలోచనే. మానవుడి ఆలోచన యెల్లప్పుడూ హ్యూమనిస్టు మార్గంలోనే నడవటానికి ప్రయత్నించింది. ఐతే మానవుడి అసమగ్ర జ్ఞానం వల్ల అది దారి తప్పుతూ వచ్చింది. అందువల్ల హ్యూమనిజమనేది మొత్తం మానవ జాతి సౌశీల్యానికి, వారసత్వానికి ప్రతీక. ఆలోచనాపరుడైన మానవుడేనాటివాడో, హ్యూమనిజమూ ఆనాటిదే! అందువల్ల తార్కికంగా ఆలోచిస్తే హ్యూమనిస్టు తత్వాన్ని సృజించాలి అని మనం అనము; హ్యూమనిస్టు పునరుజ్జీవనాన్ని, పునర్వికాసాన్ని పెంచాలని మాత్రమే మనమంటాం" అంటాడు రాయ్. అందువల్ల రాయ్ ప్రతిపాదించిన హ్యూమనిస్టు విధానాన్నీ, సూత్రాల్నీ తూ.చా. తప్పకుండా నిర్నిబంధంగా తీసుకొమ్మని గానీ, దానికేవిధమైన సవరణలూ ప్రతిపాదించరాదని కానీ రాయ్ భావం కానేకాదు.

రాయ్ సమకాలీనుల్లోనే జీన్‌పాల్ సార్త్రే, గిల్బర్ట్‌ముర్రే, జాన్ డ్యూయీ, బెర్ట్రాండ్‌రస్సెల్, జూలియన్ హక్స్లే మొదలైన మానవ వాదులున్నారు. వీరంతా మతేతర దృక్పథం కలవారే. జాక్విస్ మారిటైస్, కారల్‌జాస్పర్స్ వంటి మత దృక్పథం కల మానవవాదులూ ఉన్నారు. పైగా మారిటైస్ మానవవాదాన్ని దైవకేంద్ర- మానవకేంద్ర మానవవాదాలుగా విభజించాడు. అంతకుముందు భావవికాస యుగంలో ఫ్రెంచి, జర్మన్ మానవవాదులున్నారు. "వీరుకాక ప్రాచీన 'మానవ' వాదులూ, 'మానవతా'వాదులూ (హ్యూమనిటేరియన్స్) ఉన్నారు. వారి తత్వాలకూ, తన తత్వానికీ ఉన్న భేదాన్ని ప్రస్ఫుటం చేయగలందులకే రాయ్ తన తత్వాన్ని శాస్త్రీయ మానవవాదమన్నాడు. రాయ్ ప్రతిపాదించిన నవ్యమానవ వాదానికి ఆధునిక శాస్త్రజ్ఞానమే ఆధారం. ఆ ఆధారంతోనే మానవుని స్వభావానికి అర్థం చెప్పుకొని, భవిష్యత్ మానవ సమాజానికి రూపురేఖలు దిద్దే విధంగా రాయ్ తన సిద్ధాంతంలో మానవుని తాత్విక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక శ్రేయస్సుల దృష్ట్యా కొన్ని నిర్దుష్ట ప్రతిపాదనలు చేశాడు. మానవుడి స్వభావాన్ని గురించిన తప్పుడు భావాలే యీనాటి చెడుగులన్నిటికీ మూలమని భావించటం వల్లనే రాయ్

మానవుడి స్వభావాన్ని గురించిన ఆలోచనల్ని మొదలెత్తుకోవలసి వచ్చింది. అందువల్ల ఆయన ప్రతిపాదించినది సరికొత్త మానవవాదమైంది. ఐతే అది పిడివాదం కాదు. అదే తుదిమాట కాదు. అదొక జీవిత విధానం. మానవ జీవిత విధానంపట్ల ఒక వైఖరి.

మానవవాదం యీనాటిది కాదు. మానవ తత్వ శాస్త్రమెంత ప్రాచీనమో మానవవాదమంత ప్రాచీనమైనది. ప్రొటాగరస్ మొదలుకొని యెరాస్మస్ వరకు, యెపిక్యూరియన్లు మొదలుకొని చార్వాకుల వరకు అంతా మానవవాద ఛాయలు కలవారే. కారుణ్య బుద్ధితో "మానవతా" వాదానికి చేరువగా వచ్చిన మత ప్రవక్తలు, సంస్కర్తలు చరిత్రలో కోకొల్లలుగా మనకు కన్పిస్తారు. నాటి క్రీస్తు నిజంగా చారిత్రక పురుషుడైతే, మానవతావాదియే. ఐతే మానవుని పైన యే విధమైన ఆధిపత్యాన్నీ అంగీకరించక, మానవుని స్వయంసత్తానూ, సర్వాధిపత్యాన్నీ గుర్తించే మానవవాదుల్ని, దైవాధిపత్యాన్ని అంగీకరించే మానవతావాదుల నుంచి విడమరచి చూడటం అవసరం. ఆధునిక శాస్త్ర ఫలితాలను ఆధారం చేసుకొని, మానవుని స్వభావానికి అర్థం చెప్పుకొని, అతని సర్వతోముఖ శ్రేయస్సును కాంక్షించి, రాయ్ ప్రతిపాదించిన నవ్యమానవవాదం సమగ్రమైన తత్వం. ఇతరుల మానవవాద భావాలకూ, సమగ్రమైన తన మానవవాదానికీ మధ్యగల తేడాను స్ఫురింపజేయటానికే రాయ్ తన తత్వానికి ముందు రాడికల్, న్యూ, ఇంటెగ్రల్, సైంటిఫిక్ అనే విశేషణాలను ఉంచమనవలసి వచ్చింది.

మానవవాదం (Humanism) సమగ్ర దృక్పథం. కాగా, మానవతావాదం (Humanitarianism) మానవుడి పట్ల కారుణ్య భావాన్ని వెల్లడించే దృక్పథం. ఇన్నాళ్ల నుంచీ మానవవాద శబ్దం వింటేనే చిర్రుబుర్రులాడుతూ వచ్చిన "కమ్యూనిస్టులు" సైతం యీనాడు 'సోషలిజం కూడా హ్యూమనిజమే'ననే దశకు చేరారు. సోషలిస్టు హ్యూమనిజమే అసలయిన హ్యూమనిజమే'ననే దశకు చేరారు. సోషలిస్టు హ్యూమనిజమే అసలయిన హ్యూమనిజమనే నినాదాన్ని కూడా నోటబట్టారు. అంటే హింసాదౌర్జన్యాలకూ, నియంతృత్వానికీ మారుపేరుగా మారిన కమ్యూనిస్టు పదాన్ని వదలుకోడానికిది ప్రారంభోత్సవమేమో! కాకుంటే, కమ్యూనిస్టుల్లోని అత్యుగ్ర వాదులు కూడా గతితార్కిక భౌతిక మానవతావాదం (Dialectical Materialist Humanitarianism) పేరుతో బయలుదేరడం జరగదు. కేవలం పేరుమీద

మోజుపడితే చాలదు. హ్యూమనిజం డైలెక్టికల్ (?) కానీ, థియోసెంట్రిక్ (దైవకేంద్రం) కానీ కాదు. మానవుడు తన భవితవ్యాన్ని తానే నిర్మించుకోగలడన్న నమ్మకం, మానవ శ్రేయస్సుకు మానవుణ్ణి కేంద్రంగా – కొలమానంగా తీసుకొనే దృక్పథం మానవవాదానికి మూల సూత్రం. ఐతే మతవాదులూ, వర్గవాదులూ, నియంతృత్వ వాదులూ కూడా ఈనాడు మానవ వాదమనే పదాన్ని వాడుకోడానికి ప్రయత్నిస్తున్నారు. హిందూ మానవవాదం, క్రిస్టియన్ మానవవాదం, ఇస్లామిక్ మానవాదం, సోషలిస్టు మానవవాదం అంటూ బయలుదేరేవన్నీ మానవుడి స్వయంసత్తాను, సర్వం సహాధికారాన్ని గుర్తించేవి కావు. ప్రజాస్వామ్యాన్ని (Democracy) ప్రజల కొరకు స్వామ్యం (For Democracy) అనే అర్థంలోకి మార్చినట్లే, మానవవాదాన్ని కూడా మానవుల కొరకు మరొకరు పైనుంచి దిగుమతి చేసే తత్వంగా కార్యాచరణగా భావించడానికి వీలులేదు.

ఆధునిక శాస్త్రజ్ఞానాన్ని బట్టి చూస్తే భౌతికవాద మొక్కటే తత్వశాస్త్రంగా మనకు బోధపడుతుందంటాడు రాయ్. భావవాదం, ఆధ్యాత్మిక వాదం, అధి భౌతికవాదం, మిథ్యావాదం వగైరా అనేక పేర్లతో పరతత్వాన్ని బోధించే సిద్ధాంతాల్లో సత్యం లేదు. మానవుడు యీ లోకంలో తన కోసమే జీవించాలి. మరొక లోకం ప్రసక్తిగాని, మరొక లోకంలోని మరొకరి కోసం జీవించే ప్రసక్తిగాని మానవుడికి లేదు. అందువల్ల మానవుడికి సంబంధించిన విలువలన్నిటికీ మూలం మన మీ లోకంలోనే, మానవునిలోనే చూడగలగాలి.

భౌతికేతర తత్వాలన్నీ మిధ్యలుగా యెగిరిపోతై. నేటివరకు నాస్తికవాదంగా భావించబడే పదార్ధవాదం (మెటీరియలిజం)లోని "పదార్ధం" అనే శబ్దం అనూచానంగా సంపాదించుకున్న అర్థాన్ని కోల్పోయింది. పదార్థాన్ని శక్తిగాను, శక్తిని పదార్థంగానూ పరివర్తన చెందిస్తున్న యీ యుగంలో ఆధునిక విజ్ఞానశాస్త్రరీత్యా ఆ శబ్దాన్ని మార్చవలసి వచ్చింది. భావాలకు కూడా పదార్థానికివలె భౌతిక ఉనికి ఉన్నది. భావగమన సూత్రాలకు కూడా ఒక తర్కం ఉన్నది. ఒకసారి యేర్పడిన భావం దానిమీదుగా మరొక భావం ఉత్పన్నం కావటానికి దోహదం చేస్తున్నది. అందువల్ల భావాల భౌతిక వాస్తవికతను శంకించడానికి వీల్లేదు. ఐతే భావాలు ముందు, పదార్థం వెనుక అనే భావవాదాన్ని అంగీకరించటం అశాస్త్రీయం. వాటికి ద్వయి భావాన్ని కల్పించడానికి వీలు లేదు. భావవాదాన్ని పదార్థ (భౌతిక) వాదం నుంచి వేరుచేసి చూడటానికీ వీల్లేదు. విశ్వమంతా భౌతికంగా వాస్తవం కావటంవల్ల, భౌతికేతర సత్యమేమీ

లేకపోవటం వల్ల, పదార్ధవాదమనే పేరు స్వయం వివరణ యీయలేక అవ్యక్తంగా వుండిపోవటం వల్ల నేటి భౌతిక వాదాన్ని రాయ్ "భౌతిక వాస్తవిక వాదం" (ఫిజికల్ రియలిజం) అన్నాడు. విశ్వం యొక్క అస్తిత్వాన్ని భౌతిక వాస్తవకతగా గుర్తించి, అందులో ఒక భాగంగా మానవుని అస్తిత్వాన్ని గుర్తించి, హేతుత్వం, సత్యం, స్వేచ్ఛ, నీతి అనే మూల స్తంభాలమీద నిర్మితమైనదే హ్యూమనిజం

ప్రకృతి అంతా కొన్ని నియమాలను అనుసరించి నడుస్తున్నది. పరమాణువులో అంతర్గతంగా వున్న విద్యుత్కణం స్థానాన్ని ఇదమిద్ధమని పేర్కొనటానికి సాధ్యపడనంత మాత్రాన నియతివాదాన్ని కాదనటానికి వీలులేదు. ఆ విద్యుత్కణం స్థానాన్ని గమనించటానికి వుపయోగించే విశ్లేషణ యంత్రాలు ప్రసారంచేసే కణాల తాకిడికే ఆ విద్యుత్కణం నియతి మార్గాన్ని తప్పుతున్నది. దాని స్థానాన్ని చెదరగొట్టజాలని పరికరాల నిర్మాణం సాధ్యమైనప్పుడు మాత్రమే దాని యదార్థ స్థానాన్ని మనం ముందుగా పేర్కొనగలం." అందువల్ల స్థూల ప్రపంచంలో ఉన్న నియతి తత్వాన్ని సూక్ష్మ ప్రపంచంలో మనం గుర్తించజాలమన్న ఆలోచనే పొరపాటు. భౌతిక ప్రకృతి అంతా నియమబద్ధమైనదే. ప్రకృతి నియమబద్ధం కాకపోతే అది మానవుడికి అర్థం కావటానికే వీలులేదు. ఇటువంటి ప్రకృతి నుంచి భౌతిక రసాయనిక మార్పుల ఫలితంగా జీవం ఆవిర్భవించింది. అందువల్ల జీవపరిణామక్రమం కూడా నియతమైనదే. అది కూడా ప్రకృతి నియమాలను అనుసరించి జరిగిన పనే. మనిషిలో నాడీమండలం, మెదడు, మానసిక ప్రవృత్తులు – అన్నీ నియతగతిని పరిణామ క్రమంలో ఆవిర్భవించినవే.

**అందువల్ల ప్రకృతిలో భాగమైన మానవుని స్వభావం కూడా ప్రకృతి స్వభావాన్ని అనుసరించే ఉంటుంది. ప్రకృతిలోని క్రమబద్ధత మానవుని అనుభవంలోకి వస్తుంది. ప్రకృతిలోని ఒక వస్తువుకూ, మరొక వస్తువుకూ ఒక సంఘటనకూ, మరొక సంఘటనకూ మధ్య ఉన్న సంబంధాన్ని అతను గ్రహించగల్గుతాడు. అదే హేతుత్వమంటే. మానవుని మనః ఫలకంలో ప్రతిబింబించే ప్రకృతి నియమబద్ధతే హేతుత్వం. అందువల్ల మానవుడు ప్రాయికంగా హేతువాది కాగల్గుతున్నాడు. ప్రకృతిలో నియమబద్ధత లేకపోతే, మానవునిలో హేతుత్వానికి ఆస్కారం లేదు; జ్ఞానానికి అవకాశం లేదు.** మానవునిలోని యీ వివేచనా శక్తికి యే పరాశక్తీ కారణం కాదు నిజానికి క్రింది తరగతి జీవుల్లో సైతం దిగువ మట్టంలో సహజాత హేతుత్వం, విచారణత్వం ఉంది. ఆహార, లింగ, శత్రుమిత్ర భేదాన్ని అవి కూడా

గుర్తించగలవు. కాని, మానవుడు వస్తుతః (essentially) హేతువాది. ఇది నిజమైతే "కొన్ని సందర్భాల్లో మనిషి హేతువిరుద్ధంగా యెలా ప్రవర్తించగల్గుతున్నాడు?" అనే ప్రశ్న తరచుగా వేయటం జరుగుతున్నది. ఈ ప్రమాదాన్ని రాయ్ గుర్తించక పోలేదు. అందువల్లనే ఆయన "ఎంత హేతువిరుద్ధంగా కన్పించినా చివరకు మానవ ప్రవర్తనలోని ప్రతి అంశమూ హేతుయుతమే" అన్నాడు.

మానవుడు వస్తుతః హేతువాది అంటే – మానవుడు తన తత్వరీత్యా హేతువాదిగా ఉండగలడని (capable of being rational) భావం. ఐతే మానవుడు తన హేతుత్వాన్ని ఆచరణలో పెట్టకపోవచ్చు – పెట్టలేకపోవచ్చు. దానికి కారణాలు అనేకంగా మనం చెప్పుకోవచ్చు. హేతువిరుద్ధంగా ఆలోచించేవారి ఆలోచనలు, ప్రవర్తించేవారి ప్రవర్తన సైతం ఒక తర్కానికీ, హేతుక్రమానికీ లోపడే ఉంటై. మనంచేరే గమ్యం (తార్కికంగా) మనం ప్రయాణం చేసే మార్గాన్నిబట్టి ఉంటుంది. మన మార్గం మనం బయలుదేరిన స్థానంలో కోరుకొన్న దిశనుబట్టి ఉంటుంది. ఐనా ఆ హేతవిరుద్ధత కూడా హేతుత్వమే. అది హేతువిరుద్ధ హేతుత్వం (Irrational rationality). వ్యక్తుల్లో హేతువిరుద్ధంగా కన్పించే ఆలోచన, ప్రవర్తన హేతుత్వం యొక్క విపరీత, వికృత లక్షణాలు కావటం వల్ల మానవుడు హేతువాది కాడని కానీ, మూఢుడు, అవివేకి, అని కానీ సిద్ధాంతీకరించటం సమంజసం కాదు. మానవుడు హేతువాది కాకున్నట్లయితే అతని జ్ఞానమంతా పిచ్చివాడి మనసులోని ఆలోచనల్లాగా (?) బహు భిన్నవిచ్ఛిన్న శకలాలయ్యేదే కాని, సమన్వయ సాధ్యమై, నేటి విజ్ఞాన మహాసౌధ నిర్మాణానికి తావీయగలిగేది కాదు. ఒక సంఘటనకూ, మరొక సంఘటనకూ మధ్య నియతమైన, హేతుబద్ధమైన, తర్కబద్ధమైన సంబంధం ఉంటే తప్ప, అది మన జ్ఞాన పరిధిలోనికి రావటంకానీ, మనం ఆర్జించడం కానీ సంభవం కావు. హేతుత్వానికి అంతటి శక్తి ఉన్నది కాబట్టే మానవుని సంకల్పానికీ (Will), ప్రకృతిలోని నియమబద్ధతకూ సామరస్యాన్ని చేకూరుస్తున్నది. మానవుడు హేతువాది కాబట్టే ప్రకృతిని అర్థం చేసుకోగల్గుతున్నాడు. ప్రకృతిని అర్థం చేసుకుంటున్నాడు కాబట్టే హేతువాది కాగల్గుతున్నాడు.

ఐతే మానవుడున్నా, లేకున్నా; అతడర్థం చేసుకొన్నా, చేసుకోకపోయినా; ప్రకృతి, అందులోని నియమబద్ధత పరమ సత్యాలుగా ఉండి పొయ్యేవే. కొలంబస్

కనుగొనకపోయినా అమెరికా ఉండేదన్న విషయం మనం మరువరాదు. కోపర్నికస్ కనుగొనక పోయినా భూమి సూర్యుడి చుట్టూ తిరిగేదన్న సత్యం మనం విస్మరించరాదు. న్యూటన్ భూమ్యాకర్షణ సూత్రాలు కనుగొనక పోయినా చెట్టునుంచి రాలిన పండు క్రిందపడుతుందే కాని, పై కెగిసిపోదన్న నిజాన్ని మనం యేమరరాదు.

అందువల్ల మనం ప్రకృతిని యెలా అర్థం చేసుకొంటే అలా ఉంటుందనీ, అది మన మనోదర్పణంలోని ప్రతిబింబమనీ ఆదిశంకరులవలె, బెర్కలీవలె వాదించి మిథ్యావాదానికో, భావవాదానికో ప్రయాణం కట్టటానికి వీలులేదు. ఈ ప్రపంచం ఉన్నదనుకొన్న వారిలాగ బ్రతుకుతూ – ఈ ప్రపంచం లేదనీ, ఉన్నదని మనం భ్రమ పడుతున్నామనీ వాదించబూనటం ఆత్మవంచన, కేవల కాపట్యం. ఎందుకంటే, ప్రకృతిలోని వస్తుదర్శనం ఒక్క వ్యక్తి యొక్క భ్రమ జనితం కాదు. సర్వజనుల అనుభవాలూ ఒకేవిధంగా ఉన్నై. ప్రకృతి ఉన్న విధంగానే మనం అర్థం చేసుకొంటున్నాం కాని, మనం అర్థం చేసుకోదలచుకొన్న విధంగా అది ఉండటం లేదు. ఏనుగును ఎలుక అనీ, ఎలుకను చీమ అనీ మనం అనుకొంటే అవి అలా మారవు. కాలదులే అనుకొని మనం నిప్పును పట్టుకొంటే అది కాలకుండా ఉండదు. రైలుపైకెగిరి పోతుందిలే అనుకొని పట్టాలమీద పడుకొంటే పచ్చడి అవుతాం. ఉన్న దానికి భిన్నంగా మరేమైనా అనుకోవటానికి మనమిక మిగలం. అందువల్ల "ప్రకృతిలో నియమాలులేవు, ఉన్నవని మనమనుకొంటున్నాం" అనుకొనే వాళ్ళు యీ ప్రయోగాలు చేసి చూడవచ్చు.

"ప్రకృతిలో మనం చూచిన ఒక వస్తువు, దాన్ని చూచిన తర్వాత మనం పునరుత్పత్తి చేసిన వస్తువుతో సమానమైనప్పుడు ఆ వస్తువుల దృశ్య విషయిక వాస్తవికతను సంశయించానికి వీల్లేదు". అలా సంశయించటమే హేతువిరుద్ధత మౌఢ్యం. అందువల్ల భౌతిక ప్రకృతి యొక్క వాస్తవికతను గాని, నియమబద్ధతను గాని సంశయించటంలో అర్థంలేదు. అలాగే మానవుని హేతుత్వాన్ని సంశయించటం అర్థరహితం.

మానవుడు హేతువాది కాబట్టి, మంచిచెడ్డల విచక్షణా జ్ఞానంతో నీతిపరుడు కాగల్గుతున్నాడు. ఐతే మానవుడు అవినీతిపరుడుగా కూడా ప్రవర్తించటానికి మూలాన్ని తిరిగి అతని హేతువైపరీత్యంలోను, జ్ఞానపరిమితిలోను, సాంఘిక వ్యవస్థల వైరుధ్యంలోను, జంతు వారసత్వంలోను,

అపరిపక్వ ఆలోచనా విధానంలోను, పరిసరాల ప్రభావంలోను, ఇతర బహుముఖ అస్తిత్వంలోను, జీవితాంశాల్లోను మనం చూడవచ్చు. అంతేకాని, మానవునిలో యాదృచ్ఛిక ఫలితాలైన అవలక్షణాలను చూచి, మానవుడు అవివేకి, అవినీతిపరుడు, బానిస, దుర్మార్గుడు, కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్య పీడితుడు అని తీర్మానించలేము. మతాలన్నీ ఆ తీర్మానాలు చేసినవే. మార్క్సిజం, ఫాసిజం మొదలైన రాజకీయ సిద్ధాంతాలు కూడా పాక్షికంగా అటువంటి తీర్మానాలు చేసినవే. ఆధునిక శాస్త్రజ్ఞానం ఆ తీర్మానాలను అంగీకరించదు.

మతాలన్నీ మానవుణ్ణి పాపంలో పుట్టిస్తున్నై. అందువల్లనే మానవునిలో మంచినిచూచి, పెంచాలనే ఉద్దేశంతోనే మానవవాదం మానవునిలోని విలక్షణాలైన సులక్షణాలకు మూలం శాస్త్రజ్ఞానంలో ఉన్నట్లు కనుగొన్నది. అనేక రాజకీయ సాంఘిక తత్వాలు మతంవలెనే విశ్వాసం, పరాధీనత, అజ్ఞానం, అవినీతి, స్వార్థం అనేవాటిని ప్రధాన లక్షణాలుగా భావిస్తే హేతుత్వం, స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ, విజ్ఞానం, నీతి, అనేవాటిని మానవుని ప్రధాన లక్షణాలుగా భావించి మానవవాదం బయలుదేరుతుంది.

ఒక్క మానవవాదంతప్ప, మిగతా వాదాలన్నీ కుడియెడమల తేడాతో ఆర్థిక మానవుణ్ని ఊహించినవే. మానవుడు ఆర్థికజీవి అనుకోవటంవల్లనే అతని స్వేచ్ఛను కొంచెపరచటం జరిగింది. "స్వభావసిద్ధంగా మనిషి స్వార్థపరుడూ, అహేతుకవాదీ అయి ఉన్నట్లయితే సమాజ నిర్మాణం నిర్బంధపూరితమై ఉండేది. సమాజమంతా పరలోకంలోని దేవుళ్ళ సహాయంతో ఇహలోకంలో పూజారులు కాపలాకాసే కారాగారమై ఉండేది."

స్వేచ్ఛాపిపాస మానవుని సహజాత లక్షణం. ఇది మానవుణ్ణి సత్యాన్వేషణకూ, జ్ఞానార్జనకూ, పురికొల్పి అభ్యుదయ పథాన నడుపుతుంది. హేతుత్వమెలాగో అలాగే స్వేచ్ఛా పిపాసకూడా జంతు ప్రపంచంలో కూడా దిగువ మట్టంలో ప్రకటితమవుతుంది. మానవునిలో అది అధిక ప్రమాణంలో ప్రస్ఫుటమవుతుంది.

"మానవుడు స్వేచ్ఛాజీవిగా పుట్టలేదు. స్వేచ్ఛగా ఉండడానికి జన్మించాడు. స్వేచ్ఛగా వుండటమే మానవజీవిత సారం. మానవుడు స్వేచ్ఛగా కాక, ప్రకృతి శక్తులన్నీ పైబడి నలిపివేసే పరిస్థితులకు బానిసగా పుట్టాడు. మానవుణ్ని తన తిప్పలకు తనని వదలినంత వరకు ప్రకృతి క్రూరమైనదే -

కానీ తనని తాను విముక్తి చేసుకోగల అంతర్గత శక్తుల్ని కూడా ప్రకృతి మానవుడికిచ్చింది. మనిషి జీవించాలంటే ప్రకృతితో పోరాడాలి. స్వేచ్ఛా పోరాటంలోని నిజమైన భౌతిక విషయమే (physical content) జీవన పోరాటం. (Struggle for existence is the physical content of struggle for freedom) ఐతే ప్రకృతి శక్తులు యెలాపని చేస్తున్నవో తెలుసుకొంటే తప్ప, మనిషి వాటిని అర్థం చేసుకోవటంకాని, అదుపులో పెట్టుకోవటం కాని సంభవంకాదు. వాటిని తెలుసుకొని వివరించటానికి మానవుడు చేసిన తొలియత్నాల్లో యెంతటి చిత్రహింసపడ్డాడో తలచుకొంటే మనకు ఆశ్చర్యం వేస్తుంది. అలా మానవుడు చేసిన హేతుయుతమైన ప్రతి ప్రయత్నం యొక్క ప్రయోజనం అనుక్షణాభివృద్ధిగా స్వేచ్ఛను పొందటమే. **స్వేచ్ఛ అంటే స్వయం సంపూర్ణ మానవులుగా ఉన్న వ్యక్తుల్లోని శక్తులపరిపూర్ణ వికాసానికి అడ్డుతగిలే ప్రతిబంధకాలన్నీ క్రమానుగతంగా అదృశ్యంకావటమే"** వ్యక్తుల్లోని యీ అంతర్గత శక్తులు దైవకల్పితాలేమీకాదు. శరీర నిర్మాణరీత్యా మానవునిలో అంతర్గత శక్తులున్నై. అవి జీవపరిణామ ఫలితంగా మాత్రమే అతనికి ప్రాప్తించినై. ●

# కవిరాజు త్రిపురనేని వంశపూర్వీకులు

**- త్రిపురనేని సుబ్బారావు**

ఆంధ్రదేశంలో త్రిపురనేనివారు పేరుప్రతిష్ఠల నందినవారు. ఈ వంశంలో జన్మించిన కొందరు పండిత ప్రకాండులుగా, కవులుగా, గాయకులుగా, గణితశాస్త్రజ్ఞులుగా, పౌరాణికులుగా, న్యాయవాదులుగా, వైద్యశాస్త్ర నిపుణులుగా, గణుతికెక్కారు. మరి కొందరు శివాలయాలను ప్రతిష్టించారు. అగ్రహారాలను దానం చేశారు. తటాకాలనూ, ఉద్యానాలనూ ఏర్పాటు చేశారు. ఈ వంశీయులు కృష్ణాజిల్లాలోని అంగలూరు, గుంటూరు జిల్లాలోని కూచిపూడి, తాడికొండ గ్రామాలలో ఉన్నారు. కొందరు ఉద్యోగరీత్యా హైదరాబాద్‌లో నివశిస్తున్నారు.

ఈ వంశము యొక్క పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో ఒకసారి సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిని నేను హైదరాబాదులో కలుసుకొన్నారు. కుశలప్రశ్నల అనంతరం శర్మగారితో "ఏమండీ త్రిపురనేని వంశం యొక్క పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసుకోవాలనే కోరిక కలిగింది" అన్నాను.

అడిగినదే తడవుగా వారు **"ఈ వంశానికి మూలపురుషుడు కాకతీయ త్రిపుర నాయకుడు. అతనిపేరు శంభుడు. ఆయన ప్రతాపరుద్రుని కొలువులోని ముఖ్య సేనాపతులలో ఒకరు. అతడు ఆంధ్రదేశ పరిరక్షణకొరకు ఢిల్లీ సుల్తానుల నెదిరించి పోరిన మహావీరుడు. మీది కదనరంగంలో కత్తులు దూసిన సైనికవంశం"** అన్నారు.

'త్రిపురనేని' గృహనామం ఆ నోటా ఈ నోటా పడి అనుశ్రుతంగా వచ్చిందికాదు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన కాకతీయ ప్రతాపరుద్ర ధరణీపతి సైన్యాధక్షుడైన శంభుడు తన పదునైన కత్తిని మలకల రుధిరధారలతో కడిగాడు. **శంభుని పౌరుషానికి, ప్రతాపానికి, ప్రతాపరుద్ర మహీపతి దిగ్భ్రమజెంది, కృష్ణామండల ప్రాంతీయ సేనానిగా శంభుని నియమించాడు. శంభుడు అంగలూరు నివాసం చేసుకొని, నందివాడ, గుడివాడ, కౌతవరమలను ప్రజానురంజకంగా పరిపాలించసాగాడు. ఈ విధంగా త్రిపురనేని గృహనామం**

**ఆనాటి పౌరుష ప్రధాన చిహ్నంగా ఈ వంశీయులను వరించింది.**

అనాటి సంకుల సమరంలో సైన్యాధ్యక్షుడైన శంభుడు చేసిన వీరవిహారాన్ని హరి పురుషోత్తంగారు అష్టావధాని యిలా వర్ణించాడు.

"ఛంగున ఛంగుఛంగునను శంభు తురంగము చౌకళింప గా
ఖంగున ఖంగుఖంగునను కత్తులు ప్రక్కలుడుల్లగా, సమిత్
రంగమునందు నాతని 'తురాయి'ని నాడెదు పువ్వుబట్టి, ర
క్షంగనివారు నాడు మలకల్ మతివిహ్వలురై భ్రమించుచున్."

ఆ వీరాశిఖామణి తలపాగానందలి 'తురాయి'ని బట్టి, 'అదుగో 'పువ్వాడు' వచ్చుచున్నాడు' అని శత్రువులు ఆయన రాకపోకలు తెల్సుకొని ప్రాణాలు దక్కించుకొన్నారట! అందుచేత ఆ శంభుని సంతతివారైన త్రిపురనేనివారు 'పువ్వాడ' గోత్రీకులుగా వర్ధిల్లుతూ ఉన్నారు.

ఇట్టి మహత్తర ప్రాచీన వైభవమూ, ఆధునిక ప్రశస్తీగల ఈ వంశీయులను గురించి కవిశేఖర జి జోసఫ్ కవి యిట్లు ప్రశంసించాడు.

1. "దండున పేరుగొన్న సరదారులు, విక్రమ రాజకీయ మా
ర్తాండులు, సాహితీప్రియు లుదారులు, దుర్ఘటకార్యసాధనో
ద్ధండులు, తత్త్వవేత్తలు, సదా బిరుదంబులనంది కీర్తితో
నిండినవారు, మా త్రిపురనేని కులీనులు తెలుగు ధాత్రిలో."

మహాకవిశేఖర, కవిసింహ, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులు త్రిపురనేని వారి ప్రశస్తి నిట్లుగ్గడించినారు.

2. "ఖ్యాతియందు బరమ నీతియందును స్థిర
భూతియందు సానుభూతియందు
సాతియందు నిత్యప్రీతియందును లేమి
లేనివారు త్రిపురనేనివారు."

**ఈ వంశానికి వన్నెతెచ్చిన ఘనులు త్రిపురనేని గోపాలయ్యగారు. వీరిది అంగలూరు.** ఈ గోపాలయ్యగారికి నలుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ జన్మించారు. **మూడవకొడుకు చలమయ్యగారు. రామమాంబ వీరి భార్య.**

చలమయ్యగారు కోరమీసాల్చు గలిగిన అజానుబాహువు. తలపాగ,

పొన్నుకర్ర, కిర్రు చెప్పులూ ధరించి, ధర్మమూర్తిలా కనిపిస్తుండేవారు. సజ్జనులకు వారెంత ఆప్తులో, దుర్జనులకు అంత దుర్నిరీక్ష్యంగానూ వుండేవారు. ఒకసారి అభయమివ్వడం జరిగితే – మరిదానికి తిరుగంటూ వుండేదికాదు. రౌద్ర కరుణరసాలు సమపాళ్ళలో వారిలో చిప్పిలుతుండేవి. అన్యాయమెదురైనప్పుడు రౌద్రమూర్తులైతే, ఆర్తులు కన్పించినప్పుడు కరుణాసముద్రులయ్యేవారు.

ఇక, రామమాంబగారు శాంతస్వభావానికి ప్రతీక. శత్రువులనైనా కన్నబిడ్డలవలే ఆదరించడం ఆమెకు వెన్నతో బెట్టిన విద్య. విసుగూ విరామం లేకుండ అతిధిసత్కారాలు చేస్తూవుండేవారు. ఈ దంపతులకు ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. **వీరి మొదటి కుమారుడు గోపాలకృష్ణయ్యగారు.** వీరు కమనీయంగా కవిత్వమల్లేవారు. రామశతకం, మానసబోధ శతకం, సంయుక్త ప్రభాకరం, వ్రతకల్పం, కర్ణామృతం అనే గ్రంథాలు రచించారు. అప్పటి ఆంగ్లేయ చక్రవర్తి ఎనిమిదవ ఎడ్వర్డు మద్రాసువచ్చి, ఆంధ్రకవులను సత్కరించాడు. ఆ సందర్భంలో గోపాలకృష్ణయ్యగారిని, ఆంధ్రపండిత (సాహితీ) రత్న బిరుదంతోనూ, స్వర్ణకంకణంతోనూ సత్కరించాడు. రెండవవారు నరసయ్యగారు. గురుకుల వాసంచేసి, సంస్కృతాంధ్ర భాషలలో అద్వితీయమైన పాండిత్యం గడించారు. శివశతకం, దీనచింతామణి వీరి రచనలు. మూడవవారు శ్రీరాములుగారు. సాధుసజ్జన సంఘసాంగత్య శీలురు, మంచివ్యవహర్త. నాల్గవ కుమారుడు సుబ్రహ్మణ్యం. "శాలివాహన విజయము" అనే నాటకం వ్రాశారు. విక్రమ దేవవర్మగారీ నాటకాన్ని ప్రశంసిస్తూ చక్కని పీఠిక వ్రాశారు. కడగొట్టు బిడ్డ రామస్వామిగారు. కుమార్తె సీతారత్నం విదుషీమణి, ఆర్తుల పాలిటి కల్పతరువు.

ఈ విధంగా రామస్వామిగారి వంశం సంగీత, సాహిత్యాలలోనూ, శాస్త్ర, వ్యవహారాదులలోనూ గణుతికెక్కింది. రామస్వామిగారిలో, తమ పూర్వీకుల ప్రతిభలన్నీ పుంజీభవించాయి. ●

# ధూర్తమానవా

- కవిరాజు త్రిపురనేని రామస్వామి

ఏ బదునాల్గులోకముల సృష్టియొనర్చును బెంచి పిమ్మటన్
దూబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియించు చుంటివే!
యేబదిమాట లేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూబలు సాగదీసెదను గూయకు మిట్టివి ధూర్తమానవా!

ఎవ్వరు చూచినారు సృజియింపగ నీ పదునాల్గులోకముల్
సువ్వన సువ్వి సువ్వి యను చొప్పె కదా! యొకడైన జూచెనే
దవ్వులనుండియైన నొకదానిని నైన? వృథా ప్రగల్భముల్!
నవ్వుల పాలుజేసెదవె నన్నిటులాడుచు ధూర్తమానవా!

ప్రతివర్షంబును నా వివాహమను పేరన్ బెక్కుచందాల దు
ర్మతి చందాలు వసూలు చేసి ప్రతియూరన్ గజ్జకట్టింతువే!
గతి యీమాత్రములేద నాకరయ? నేగావించుకోలేనె? యీ
గతి నన్నీవు పరాభవించుటకు సంకల్పింతువే మానవా!

కాపురముండ నిల్లు, నడకత్తెరలో బడియుండ బెండ్లమున్,
మాపులు కున్కగా బడక మంచము, నెక్కగ నెక్కిరింతలున్,
సాపడ బైడికంచమును జక్కగగూర్చి యుపన్యసింతువే?
నీపనిబట్టెదన్ వినుము నీవిది మానవ ధూర్తమానవా!

కొసకేమౌనా యెఱుంగకుండ నుసితో గోణంగివై నీవు నీ
పుసికన్నుల్ మసిముక్కు దేబెమొగమన్ బువ్వాడు పెన్‌బోరెమున్
తొసినోరున్ గలిగించి వంచకుడవై దుర్జాతి, నన్నొక్క మా
నిసినిం జేసెదవే ! మనుష్యునివలెన్ నేనుంటినే మానవా!

కాలుంజేతులు ముక్కు మోములును చంకల్ చన్నులున్ బేర్లు నీ
కేలా యున్నవొ, నాకు నట్లెకలవా? యీ రీతిగా నన్ను నీ
వేలా వర్ణన చేసినాడ వకటా! యెందాక సైరింతు? నిన్
పాలార్తున్ మునుమున్న చెప్పితిని నీ పొట్లన్నియున్ మానవా!

గుడులున్ గోపురముల్ కుశీలవుడవై కూర్పించి చందాలతో
మడిమాన్యంబులు నాదు పేరుననె నిర్మాణంబు గావించుచున్
వడపప్పున్ బెరవారి కిచ్చెదవె? నీ భావంబునం దేమి గీ
ల్పడగా నేర్చెడి? చెప్పు మింతటి దివాలాఖోరువే మానవా!

వేదములెట్లు బ్రహ్మముఖ వీధుల నుండి హరింపగా బడున్!
పాదలి సోమకాసురుడు వచ్చి త్రయిన్ హరియించె నంచు నే
చీదర పొందకుండ చొఱచేపను జేసితివే ననుణ్ - సరే!
నీదయమీద నా బ్రదుకు నిల్చెనె చెప్పుమ ధూర్తమానవా!

బలి యేపాపము జేసినాడతనిపై వైరంబు నాకేల? త
ద్బలి రాజ్యంబు హరింప వంచకుండనై ధర్మంబు బోద్రోసి దు
ర్బల హీనుండగు నింద్రు బ్రోవ నవతారం బెత్తినా నంచు లో
కులు నమ్మన్ వచియింతు వింకయిన బొంకుల్ మానవా? మానవా!

పరులను, ధర్మదూరులను, బంధురపాపనిమగ్న చిత్తులన్
గరుణను గాచి బ్రోచుటకు గా ముఱితో బలిచక్రవర్తినిన్
దిరిపెము నెత్తినాడనని దేబిరిగొట్టుమొగంబ, యెల్లెడన్
నిరతము చాటుచుండెదవె; నీ పని బట్టెద ధూర్తమానవా!

తనువెల్లన్ గులపెట్టి జీర్ణసుఖ రుగ్దద్రువ్యధాపీడచే
త నహోరాత్రులు కామతృప్తి కొఱకై దారాడు స్వర్లోక నా
థుని పక్షంబయి దానశీలుని మహత్పూజ్యున్ బలిన్ సత్యవా
క్యనిరూఢున్ బొరియించినాననుచు బల్కన్ జూతువే మానవా!

ఒక్కడు తండ్రి జంపెనని యోరిమిలేకయె గండ్రగొడ్డటన్
జక్కడగింప ధర్మవగునా కులమంతయు? దీనిజేయ నే
నొక్కడనే కనంబరితినో! యిటువంటివి పూర్వమందు నే
దిక్కులనేని విన్నడెనె? తిక్కవదల్చెద ధూర్తమానవా!

ఉడుగక తొల్లి పెండ్లమును నొక్కతె నామెడ కంటగట్టి యా
బిడ నెవడో హరించె నని వెంగలి మాటలు చెప్పి యామెకై
యెడతెగకుండ బావురని యేడ్చితినంచును నెన్నిరోజులో
బడబడ పెద్దగ్రంథములు వ్రాసితివేమిర? ధూర్తమానవా!

మిడిమేలంబుగదెచ్చి పెట్టితివిగా మేనత్తతో గూటమిన్
బడిముప్వంకల ముండతోడ మధురాపట్నంబులో గూటమిన్
మెడకుంగట్టితి వెంతవాడవుర! నీమిట్టాటలన్ మానవా!
కడికండల్ తెగగోసివైచెదను గాక శ్రేణికిన్ మానవా!

అవతారంబులనెత్తి చేయగల నన్యాయంబు లన్నింటినే
నవతారంబుల నెత్తకుండ మతిచేయన్ శక్తిలే దంచు న
న్నవమానించితి వింతకాలమిటు? నిన్నాపాదమస్తంబుగా
నివురుంజేసెద నెవ్వరడ్డపడగా నీ కుండిరో మానవా!

స్మృతులన్ వ్రాసితి నందు; వాస్మృతులలో జిత్రించి శ్రుత్యర్థముల్
ప్రతిపాదించితినందు; వయ్యది నిజంబా? యెంతకాలంబు దు
ష్కృతి సాగింతువు, లోకవంచనములన్ జేయింతువో, చేతువో
పతితాత్మా, యికనైన యీ వెడగు త్రోవల్ మానవా? మానవా!

కలలో గన్పడుచుండు బట్టబయలన్ గన్పట్ట రాకుండుగ
ద్దలు గ్రంథంబులు జెప్పుగట్టెదుట బ్రత్యక్షంబు జెప్పందు లో
కులు కల్లోలపడంగ నీగతిని టక్కుల్ చెప్పు మాయావికిన్
తలతిక్కన్ వదలింతు నీ పయిని చిత్తభ్రాంతి పో మానవా!

ఈ టకబొంకు లేమిటికి? ఇల్లును వాకిలి గట్టిపెట్టి యే
టేటను బెండ్లి సేయుమనియే నెపుడైె నను గోరియుంటినే!
చీటికి మాటికిన్ బరుల జేబులు గొట్టుట ధర్మమార్గమే?
ఏటికి నీయబద్ధ మరరే! యిక సాగునె? ధూర్తమానవా!

బొక్కెడు కూడు పట్టుమని పొట్టకు తింటినె యొక్కపూటయేన్?
జక్కగ నొంటినిండ నొక జానెడు గుడ్డను గప్పుకొంటినే!
ఒక్కటియేని ముచ్చిలక యుంచితివే? యిక నీదుపాటులే
నక్కయు గుక్కయున్ బడదు; నా పలుకుల్ విను ధూర్తమానవా!

పొక్కిలిగడ్డలేక, తన పొయ్యికి గట్టెలు లేక, మంటకున్
బిక్కిన గుండలోనికిని బియ్యపునూకలు లేక, గంజిలో
లెక్కకు నుప్పుగల్లయిన లేక, కృశించెడి పేదవానికిన్
తెక్కలు దుచ్చి సిల్గుల హరింతువె చెప్పర, ధూర్తమానవా!

మరణపు శయ్యమీద నొక మారయినన్ నను దప్పకుండ సం
స్మరణము చేసినంతటనె స్వర్గము వచ్చునటందు, వేగతిన్
బొరయును? నిట్లె నీ వెపుడు బొంకుచునుందువు దీనికై నినున్
గఱకర గొంతు కోసెదను కానివి చెప్పకు దూర్తమానవా!

ఏ నొక జాతికూడు భుజియించుచు మిక్కిలి తక్కుజాతులన్
హీనముగాగ జూతునని యెవ్వరు సెప్పిరి నీకు వంచకా!
మానవులందఱున్ సరిసమానులు గారొకొనాకు? మాయురే!
మానక నీవ యిట్టి యవమానముజేతువె ధూర్తమానవా!

త్వరపడకుండ సంజపడు దాకను తప్పు పనుల్ పొనర్చి పై
బొరుగున ఉన్న తోటలను బూవులు మ్రుచ్చిలి కోసి తెచ్చి నా
శిరమున బోసినంతటనె చేసిన పాపములొక్కసారిగా
మఱచెడునట్టి వెంగలినె మానక యిట్టివి ధూర్తమానవా!

పసులను, జెట్టు చేమలను, బక్షితతిన్, గ్రిమికీటకాదులన్
బుసుకున దాకినంత దలపోయవు స్నానముమాట; కాని, మా
నిసి నిను దాకినంత దలనిండుగ స్నానము ధర్మమార్గమే!
ముసిముసినవ్వు నవ్వెదవు మోరెగబట్టుక ధూర్తమానవా!

బొచ్చు నొసంగి యెట్లు పరిపూర్ణమనోరథసిద్ధి బొందగా
వచ్చును? బిచ్చివాడనని భావమునం దలపోయు చుంటినా?
పుచ్చును నీదు పాపములు పోరచి మానుమ యిట్టి వానినిన్;
బొచ్చెము లిట్లు చెప్పి ప్రజ మోసము చేయకు ధూర్తమానవా!

ఒక దేవాలయమందు స్త్రీలకు రహస్యోత్సాహివై బోధముల్
నికరాదాయముతోడ జోడు చెవులున్ నిండించుచున్నావటే!
అకటా కొంపల నెన్ని దీసితివొ యత్యాచారముల్ సల్పి, నీ
మొకమున్ రాసెద మానకున్న యెడలన్ ముమ్మాటికిన్ ధూర్తమానవా!

బిడ్డల కోసరమ్ము విలపించెడి యా జవరాండ్ర తోడుతన్
బిడ్డలు తప్పకుండ బ్రభవించెదరంచు సమాదరంబునన్
గడ్డముపట్టి 'గర్భగుడి' గర్భము జేర్చుదువట్టెరేలనో
వెడ్డరి! నాకు మంచి పని వెట్టితి వింతకు ధూర్తమానవా!

వాజను మానకున్న నపవాదులు; తప్పవు శృంగభంగముల్
రోజులు నీకు జాల విసిరో! జులు మింతకు మానకున్నచో
బాజివియౌదు వీవు నగు బాటు ఘటిల్లును! నింక మీద నీ
పోజును జూచి మోసపడిపోవుట గల్లదు ధూర్తమానవా!

తిరిపెము నెత్తియెత్తి యతిదీనత దిర్గుచు జోలి బట్టుచున్
తిరుపతి కొండ మీది కెగదేకుచు నచ్చట చెప్పు దెబ్బ లీ
వొరువుగ దిన్న లేశము ప్రయోజనముండదు ధర్మమార్గమున్
బిటిదికి ద్రోసిపుచ్చి పరపీడకు బూనిన ధూర్తమానవా!

తిరుపతి బుట్టి; రంగపురి తెన్నుల వర్ధిలి; కాశిలోపలన్
మరణము పొందినప్పటికి మారదు కర్మఫలానుభూతి; నీ
వెరిగియు దీని స్వార్థరతి నెల్లవిధంబుల నెంతమందినో
పురపుర నెల్లవేళలను మోసము జేతువె ధూర్తమానవా!

ఇతరులబర్వుతో బ్రదుక నిచ్చుట నెన్నడు నేర్చికొందు వా
యతమగు నీ ప్రపంచసుఖమన్నది యొక్కటె నీ సుఖంబుగా
బ్రతిదినమున్ స్మరించు సమభావము నెన్నడు నేర్చికొందు వు
న్నతి గనుచుండి నీ ప్రజ లనారతమున్ నిను మెచ్చ మానవా!

చేసినవేవొ చేసితివి చెన్నటివై; యని నేను సైరణన్
జేసితి; నింకముందయిన జేసిన తప్పుల దిద్దుబాటుకై
గాసిలియైన యత్నములు గట్టిగ జేయక యూరకున్నచో
వేసరబోక కట్టి కుడిపించెద దప్పదు ధూర్తమానవా!

---

# 40 సంవత్సరాల 'హేతువాది'

**- మేడూరి సత్యనారాయణ**

ది. 07-05-1979లో ఏలూరులో జరిగిన ఆంధ్రప్రదేశ్‌లోని హేతువాదుల ప్రథమ మహాసభలో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం ఆవిర్భవించినపుడు వ్యవస్థాపక అధ్యక్షులుగా రావిపూడి వెంకటాద్రి ఎన్నికయ్యారు. ఆనాటి నుండి ఈనాటి వరకు ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, తదనంతరం అధ్యక్ష బాధ్యత స్వీకరించిన భారత హేతువాద సంఘాలకు సారధ్య బాధ్యతలను **రావిపూడి వెంకటాద్రి** చేపట్టి హేతువాద ఉద్యమానికి మానవవాద మలుపును ఇచ్చి కొనసాగిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షత బాధ్యతలను చేపట్టకముందే రావిపూడి తమ హేతువాద మానవవాద రచనా వ్యాసంగంలో భాగంగా 20 ఉత్తమ గ్రంథాలను రచించి ఉన్నారు.

1943 ఏప్రిల్ 5న తమ స్వగ్రామం నాగండ్లలో **కవిరాజాశ్రమం** స్థాపించిన నాటినుండి హేతువాద భావాలను విద్యార్థులకు, పరిసర గ్రామాల ప్రజలకు అందిస్తూ వచ్చారు. త్రిపురనేని రామస్వామి రచనల ప్రేరణతో హేతువాదిగా మారిన ఆయన 1940వ దశకంలోనే యం.యన్.రాయ్ నిర్వహించిన అధ్యయన తరగతుల్లో డెహ్రాడూన్‌లో, ముస్సోరీల్లో పాల్గొన్నారు. యం.యన్.రాయ్ చూపిన రాడికల్ హ్యూమనిస్ట్ బాటలో తమ రచనలను కొనసాగించారు.

1970 దశకంలో **డా॥ ఎ.టి.కోవూర్** పర్యటనతో ఉత్తేజం పొందిన **తోటకూర వెంకటేశ్వర్లు** విజయవాడ నుండి **"చార్వాక"** తెలుగు మాసపత్రికను ప్రారంభించి, ఆ 'చార్వాక' ఆధ్వర్యంలో విజయవాడలో మూడు హేతువాద మానవవాద అధ్యయన తరగతులను నిర్వహించారు. ఆ అధ్యయన తరగతుల్లో ఇతర ప్రముఖులతోపాటు రావిపూడి వెంకటాద్రి వివిధ అంశాలమీద ప్రసంగించారు. "చార్వాక" మాసపత్రికలో నాస్తికత్వాన్ని, హేతువాదాన్ని, విశ్వతత్వాన్ని వివరిస్తూ వ్యాసాలు రాశారు.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షులయ్యాక ఆ బాధ్యతల నిర్వహణలో రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లో జరిగిన మహాసభల్లో, అధ్యయన

తరగతుల్లో, బహిరంగ సభల్లో పాల్గొంటూ హేతువాద మానవవాద ఉద్యమ స్వభావాన్ని వివరించేందుకు తత్సంబంధిత అనేక అంశాలమీద ప్రసంగించారు.

రావిపూడి వెంకటాద్రి మార్క్సిజాన్ని విమర్శిస్తున్నారన్న నెపంతో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘాన్నుండి చీలి మరొక సంఘాన్ని కొంతమంది పెట్టుకోవడంతో సంఘానికి పత్రికలేని స్థితిలో 1982 సెప్టెంబరు నుండి రావిపూడి యాజమాన్య సంపాదకత్వ బాధ్యతలతో 'హేతువాది' తెలుగు మాసపత్రికను స్థాపించి, ప్రచురించి పంపిణీ చేస్తూ వచ్చారు. ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ లక్ష్యాల సాధనకు, హేతువాద మానవవాద ఉద్యమ అవగాహనను కార్యకర్తల్లో పెంచేందుకు 'హేతువాది' పత్రికను సైన్సు, హేతువాద మానవవాద పత్రికగా తీర్చిదిద్దారు. పత్రిక స్థాపనకు ముందే విస్తారమైన వైజ్ఞానిక స్థాయి, హేతువాద మానవవాద ఉద్యమ అనుభవం, రచనా వ్యాసంగంలో 20 గ్రంథాల రచన, ప్రచురణ అనుభవం, ప్రపంచంలోని భిన్న హేతువాద మానవవాద తాత్విక సిద్ధాంతాలను అధ్యయనం చేసి అవగాహన చేసుకొని ఉన్నందున 'హేతువాది' మాసపత్రిక ప్రారంభం నుండి ఉన్నత స్థాయి హేతువాద మానవవాద పత్రికగా పాఠకుల అభిమానాన్ని పొందింది. జీవిత చందాదారులు, సంవత్సర చందాదారుల చందాలతో, దాతల దాతృత్వంతో, ప్రకటన కర్తల ఔదార్యంతో పత్రిక ముందుకు సాగుతూ వచ్చింది.

హేతువాద మానవవాద ఉద్యమ వ్యతిరేక వ్యాసాలను 'హేతువాది'లో ఏనాడూ ప్రచురించలేదు. పాఠకులు పంపే సందేహాలకు సమాధానాలను పత్రికా ముఖంగానే ఇవ్వడం వలన అలాంటి సందేహాలు ఉండే వారందరికీ సమాధానాలు అందుతూ వచ్చాయి.

హేతువాద మానవవాద ఉద్యమానికి సంబంధించి లేవనెత్తబడే ప్రతి ప్రశ్నకి సమాధానంగా రాసిన ఆయన వ్యాసాలు తదనంతరం గ్రంథాలుగా ప్రచురణ అయ్యేవి. తొలుత తమ ప్రచురణలన్నింటినీ తాము స్థాపించిన "కవిరాజాశ్రమం, నాగండ్ల" పేరుతోనే ప్రచురించారు. హేతువాది ప్రారంభ మయ్యాక కూడా ఈ తీరు కొనసాగింది.

1993 ప్రాంతంలో "హేతువాద మానవవాద ప్రచురణలు" సంస్థను రావిపూడి యాజమాన్యంలో ప్రారంభించాక ఆయన గ్రంథాలను, ఇతర హేతువాద మానవవాద మిత్రుల గ్రంథాలను **"హేమా పబ్లికేషన్స్, చీరాల"** పేరుతో ప్రచురిస్తూ వచ్చారు.

ఎన్ని వడిదుడుకులు ఎదురైనా 'హేతువాది' పత్రికను రాజీలేని ధోరణితో ప్రచురిస్తూ వచ్చారు. చిన్న వయసులోనే రావిపూడి హేతువాద మానవవాద మార్గాన పయనించడం మొదలు కావడంతో గత 8 శతాబ్దాలుగా ఆయన ఆ బాటను వీడకుండా, అచంచలంగా ముందుకు సాగి ఉద్యమానికి సారథ్యం వహించి ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు వారికి, ఇతర రాష్ట్రాల్లో, ఇతర దేశాల్లో ఉన్న తెలుగువారికందరికీ తమ భావవిప్లవవాణిని వినిపించి ఎంతో ప్రభావం చూపించారు.

'హేతువాది' ఆరోగ్యమే నా ఆరోగ్యం అని ప్రకటించిన రావిపూడి 'హేతువాది' ఆరోగ్యాన్నీ, తమ ఆరోగ్యాన్ని పట్టుదలతోకూడిన క్రమశిక్షణతో కాపాడుకుంటూ 2021 ఫిబ్రవరి 9న తమ 100వ పుట్టిన రోజును జరుపుకోవడం హేతువాద మానవవాద యువ ఉద్యమ మిత్రులందరికీ స్ఫూర్తిదాయకం అవుతుందనడంలో సందేహంలేదు.

'హేతువాది' ప్రచురణ ప్రారంభమైన నాటినుంచి ఎంతోమంది హేతువాద మానవవాద ఉద్యమ కార్యకర్తలను 'హేతువాది'లో రచనలు చేయడానికి రావిపూడి ప్రోత్సహించారు. 'హేతువాది'లో వ్యాసాలు వ్రాస్తూ, అధ్యయన తరగతుల్లో పాల్గొంటూ ఎంతోమంది రచయితలుగా, ఉపన్యాసకులుగా ఎదిగి ఉద్యమ బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, దాని అనుబంధ జిల్లా హేతువాద సంఘాలు, భారత హేతువాద సంఘ జాతీయ స్థాయిలో నిర్వహించిన అధ్యయన తరగతులు, మహాసభలు, బహిరంగసభల వివరాలను 'హేతువాది'లో ప్రకటించి ఆ ఉద్యమ కార్యక్రమాలకు శాశ్వతత్వం కల్పించారు.

'హేతువాది'లో ప్రచురితమైన వ్యాసాలతో తమ 23 సంపుటాలను, 'హేతువాది' వ్యాసవాణి సీరిస్‌లో ఇప్పటివరకు 60 గ్రంథాలను, తమ సంపుటాలను ఇంగ్లీషులోకి అనువదించి 8 సంపుటాలుగా హేమా పబ్లికేషన్స్ ద్వారా ప్రచురించారు. ఈ హేతువాద మానవవాద సాహిత్యమంతా 1991లో ప్రారంభించబడిన రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లులో అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. **డా॥ గుమ్మా వీరన్న, మేడూరి సత్యనారాయణ, కుర్రా హనుమంతరావు, షేక్ బాబు, డా॥ తోటకూర ప్రభాకరరావు, డా॥ ఎన్.ఇన్నయ్య, చేగిరెడ్డి, దొప్పలపూడి సత్యనారాయణ, జాస్తి రామస్వామి, ఆలూరి ప్రఫుల్ల చంద్ర** తదితరుల వ్యాసాలు పుస్తకాలుగా ప్రచురితమయ్యాయి.

హేమా పబ్లికేషన్స్, చీరాల ద్వారా ఇప్పటివరకు 100కి పైగా హేతువాద మానవవాద గ్రంథాలను ప్రచురించి పాఠకులకు అందించారు.

'హేతువాది' పత్రిక ప్రారంభం నుంచి ఈనాటి వరకు గత నాలుగు దశాబ్దాల హేతువాద ఉద్యమ చరిత్ర అంతా ఈ పత్రికలో నిక్షిప్తమై ఉంది. ఆంధ్రప్రదేశ్ హేతువాద ఉద్యమ చరిత్రను, భారత హేతువాద సంఘ ఉద్యమ చరిత్రను రూపొందించడానికి 'హేతువాది' ఒక ముఖ్యమైన వనరు అనడంలో అతిశయోక్తి లేదు.

1987 సెప్టెంబరు నెలతో 'హేతువాది' తెలుగుమాస పత్రిక **ఐదు సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకుని ఆరవ సంవత్సరంలోకి విజయవంతంగా** ప్రవేశించింది. ఆ శుభసందర్భాన సంపాదకులు రావిపూడి సహకరించిన వారికందరికీ కృతజ్ఞతలు తెలిపారు. ప్రోత్సాహం మరింత పెరగగలదని ఆశించారు. ఆయన ఆశ నెరవేరింది. గత 40 సంవత్సరాలుగా 'హేతువాది' విజయవంతంగా నడుస్తూనే ఉంది. 'హేతువాది' లాంటి ఉద్యమ పత్రిక ఇన్ని సంవత్సరాలపాటు నడపడమంటేనే అది రావిపూడి లాంటి వారికే సాధ్యం. 101 సంవత్సరాల వయసులోనూ అదే కృషి. అదే పట్టుదల. అదే స్థాయి. పట్టిన పట్టు ఈనాటికీ వదలలేదు.

రావిపూడి వెంకటాద్రి ఈ నూతన సంవత్సర ప్రచురణ ప్రారంభం సందర్భంగా రాసిన **ఎడిటోరియల్‌లో** :

"ప్రతి పాఠకుడూ మరొక్క చందాదారుణ్ణి చేర్పించడమనేది కనీస బాధ్యతగా స్వీకరించాలని కోరుతున్నాము."

"విజ్ఞాన వికాసం కల్గించడమే ప్రధానాశయంగా పెట్టుకున్న పత్రికలు ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ, అన్ని భాషల్లోనూ వున్నాయి. వాటన్నిటి సర్క్యులేషన్ అంతంత మాత్రమేనని వేరుగా చెప్పనవసరంలేదు; తక్కువని భాదపడనవసరం లేదు కూడా."

**"భావోద్యమాల పెరుగుదల కూడా నిదానంగానే ఉంటుంది. ఉండక తప్పదు మనుషుల్లో స్వభావ సిద్ధంగానూ, సంస్కార రీత్యానూ వున్న బలహీనతలను, ఉద్రేకాలను, దురభిమానాలను రెచ్చగొట్టడం ద్వారా సంఖ్యాబలాన్ని పెంచుకోవడం హేతువాదం వంటి భావోద్యమాల స్వరూపంకాదు.** జాతి, కులం, మతం, వర్గం వంటి సమిష్టి నిషాలను ఆధారం చేసుకుని, విద్వేషాలను రెచ్చగొట్టి, మానవ సమాజంలో ఇప్పటికే వున్న

కాలుష్యానికి మరికొంత కల్మషాన్ని కలపడం కష్టమైన పద్ధతి కాదు. జాతి విద్వేషాలు, కుల వైమనస్యాలు, మతదురభిమానాలు, వర్గవైరుధ్యాలు పరమ సిద్ధాంతాల స్థాయికి పెరిగి సమాజానికి చేసిన హాని చరిత్ర పుటల్లో చెక్కు చెదరకుండా వున్నది. దళితులపేర జరిగినా, పీడితులపేర జరిగినా, గోవులపేర జరిగినా, పందులపేర జరిగినా, మరో దాని పేర జరిగినా, ఒంటెత్తు మార్గంలో నడిచే ఉద్యమాలేవీ మానవతను స్పృహలో ఉంచుకోలేవు. అందువల్లనే అవి బరబరా పెరుగుతాయి. పెరిగిన మతాలన్నీ పెరగాలనే తొందరలో ప్రారంభ లక్ష్యాన్ని కాస్తా వైదొలగి భ్రష్టమైనవని మనకు తెలుసు. అందువల్ల, కేవలం పెరుగుదల దృష్టితోకాక, హేతువాద ఉద్యమాన్ని హేతువాద ఉద్యమంగానే కల్తీ లేకుండా పోషించుకోవాలి.”

“మనిషిని మనిషిగా చూచే హేతువాదానికి, మనిషిని జాతిలోనో, మతంలోనో, కులంలోనో, వర్గంలోనో బానిసగా చూసే ఇతర వాదాలకు సంబంధంలేదు. ఏదో ఒకవర్గ (కుల, మత, జాతి, వర్గం) ప్రయోజనకోసం పోరాడేవారిని హేతువాదులనీ, అలాంటి లక్ష్యంకల సంస్థని హేతువాద సంఘమనీ పిలుచుకోవడం, పిలవడం సరైన పద్ధతికాదు. ఎత్తుగడలు, లక్ష్యాలు-ఒకటి కావు. హేతువాదం అహేతుక వాదానికి తలవంచదు. పిడివాదాన్ని ఆమోదించదు. హేతుబద్ధమైన ఆలోచన చేస్తుంది. ఆ ఆలోచనకు అనుగుణంగా ఆచరిస్తుంది. ఇతరుల ఆలోచనలను శాసించదు. తప్పు ఆలోచన చేసేవారి ఇంగితానికి విజ్ఞప్తి చేస్తుంది. పిడివాదాల శాసనాలకు ఎదురు తిరుగుతుంది” అంటూ ‘హేతువాది’ పత్రిక లక్ష్యాలను, హేతువాద ఉద్యమ తీరునూ వివరించారు. ఇతోధిక ప్రోత్సాహం ఇవ్వవలసిందిగా పాఠకులకు విజ్ఞప్తి చేశారు.

1991 మే నెల ‘హేతువాది’ సంచిక నెం.93ను **ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ 7వ ద్వైవార్షిక మహాసభల** సందర్భంగా ప్రత్యేక సంచికగా సంపాదకులు ప్రచురించారు.

ఈ ‘హేతువాది’ ప్రత్యేక సంచికలో :

మహాసభల సందర్భంగా ఎడిటోరియల్ - రావిపూడి వెంకటాద్రి
హేతువాదుల జీవిత విధానం - యం.వి.రామమూర్తి
అంబేద్కర్‌ను అంతం చేస్తున్నారు - డా॥ ఎన్. ఇన్నయ్య
దేవుడు, దెయ్యం అబద్ధం - పసల భీమన్న
స్వామి సదాచారి అరెస్టు - జి.జయన్

ఉపనిషత్తుల కీకారణ్యం - వి.ఆర్.నార్ల, అనువాదం : ప్రఫుల్ల చంద్ర

రాధాకృష్ణన్‌కు తత్వం ఉందా? - యం.యన్.రాయ్

అనువాదం :

దేవుడు అనేది భ్రమ - జిడ్డు కృష్ణమూర్తి

ఈ వ్యాసాలన్నీ ప్రచురణ అయ్యాయి.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, భారత హేతువాద సంఘం, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లులో మహాసభలు, వార్షికోత్సవాలు, ఇతర ముఖ్య సందర్భాలలో ఎక్కువ పేజీలతో ఎక్కువ వ్యాసాలతో ఆకర్షణీయంగా ప్రత్యేక సంచికలను ప్రచురించడం 'హేతువాది' ఆరంభం నుండి చేస్తూనే ఉంది. ఈ సంఘాల లక్ష్యాలు 'హేతువాది' లక్ష్యాలు ఒకటే కావడం వల్ల హేతువాద మానవవాద ఉద్యమ కార్యకలాపాలతో 'హేతువాది' మమేకమైంది. 'హేతువాది'లో ప్రచురితమైన అనేక రచయితల వ్యాసాలతో గ్రంథ ప్రచురణలకు అవకాశం ఇచ్చింది "హేతువాది". 'హేతువాది' తెలుగు మాసపత్రికకు ధీటుగా హేతువాద మానవవాద వ్యాసాలను, వార్తలను ప్రచురించిన పత్రిక ప్రపంచంలోనే ఎక్కడా లేదనడం అతిశయోక్తి కాదు. ఈ ప్రత్యేక సంచిక తర్వాత ది. 04-08-1991న రావిపూడి మార్గదర్శకత్వాన ఇంకొల్లులో రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ ఆవిర్భవించింది. దీనికి ముందు ఇంకొల్లులో ఇంకొల్లు హేతువాద సంఘం నిర్వహించిన హేతువాద మానవవాద ప్రచార ప్రభావం ఇంకొల్లు పరిసర గ్రామాల యువకుల మీద పడింది.

1991 ఆగస్టు నెల 'హేతువాది' మాసపత్రికను **'ఇస్లాం-ఆధునికీకరణ'** ప్రత్యేక సంచికగా తీర్చిదిద్దారు. **రావిపూడి వెంకటాద్రి** తమ ఎడిటోరియల్‌లో:

"ఈ సంచికతో 'హేతువాది' తొమ్మిది సంవత్సరాల పూర్తి చేసుకుంటున్నది. ఇప్పటివరకు సహాయ సహకారాలందించిన పాఠకులకు, రచయితలకు, చందాదారులకు, వదాన్యులకు "హేతువాది" కృతజ్ఞతలు చెప్పుకుంటున్నది."

"చాలమంది మిత్రులు 'ఇస్లాం' పై హేతువాద సాహిత్యం కొరకు 'హేతువాది'కి తరచు ఉత్తరాలు రాస్తున్నారు. "ఇస్లాం-ఒక అంచనా" పేరుతో పది సంవత్సరాల క్రితం వెలువడిన చిన్న పుస్తకం చాలాకాలంగా పునర్ముద్రణ కావలసి ఉంది. అందువల్ల, ఈ సంచికను ఇస్లామిక్ రినైజాన్స్ పట్ల భారత ముస్లింల వైఖరి గురించి ఇద్దరు ప్రసిద్ధ రచయితలు హమీద్ దల్వాయ్,

ఏ.బి.షాలు వ్రాసిన వ్యాసాలతో నింపుతున్నాం. ఇస్లామిక్ రినైజాన్స్‌కు ముస్లిము వర్గాలే పూనుకోవలసి ఉండగా రాజకీయ ప్రలోభాలతో ముస్లిం నాయకులు ఎలా పెడమార్గాలను అవలంబించారో ఈ వ్యాసాల్లో రచయితలు వివరించడానికి ప్రయత్నించారు."

"ఇతరుల సమస్యల్ని తీర్చగలమన్న అహంకార భావం నాయకుల మనుకునే వారిలో ఉండడం శ్రేయస్కరం కాదు. ఇతరులు మన సమస్యలను తీరుస్తారని ఎదురుతెన్నులు కాచే బానిస భావం మానవతకే అవమానం."

"ప్రజాస్వామ్యం అనేది మానవస్వామ్యం. ప్రతి మానవుడూ తనకు తాను స్వామి కావాలి. అలాకాక, ఎవరోచేసి పెడతారని ఎదురు చూడడమంటే, మనపై ఇతరుల స్వామ్యాన్ని, పెత్తందారీతనాన్ని ఆహ్వానించడమే. ఆ స్థితిని మనం కోరుకోవడానికి సిగ్గుపడాలి. స్వతంత్ర యోజనాపరుడు తన కాళ్ళపై తాను నిలదొక్కుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఇది ఏకాకిగా ఉన్న మనిషిని గురించిన విషయం కాదు. సమాజంలో ఎంత ఎక్కువమంది హేతుబద్ధంగా, స్వతంత్రంగా ఆలోచించగలుగుతారో, ఆ ఆలోచనలకు అనుగుణంగా ప్రవర్తించగల చిత్తశుద్ధిని పెంచుకుంటారో, అంత ఎక్కువగా మానవస్వామ్యం అనుభవించడానికి వీలవుతుంది. ఇది సుదీర్ఘకాలంలో తీరే సమస్య అయిన మాట నిజమే. కాని, స్వల్ప కాలంలో ఈ సమస్య తీరదని గ్రహించాలి. చరిత్రలో జరిగిన పరిణామాలను అర్థం చేసుకుంటే పరాధీన భావంవల్ల సమస్యలు తీరతాయనేది భ్రమ అని రుజువవుతుంది."

"వివేకి, వివేచనావంతుడు సమస్యల్ని సరైన పద్ధతిలో అర్థం చేసుకుని, సరైన పద్ధతిలో పరిష్కార మార్గాలను నిర్ణయించుకుంటాడు. సాధిస్తాడు. మన సమస్యలను మనం తీర్చుకోవడమే హేతువాద మార్గం - మానవవాద మార్గం."

1992 'జనవరి' 'హేతువాది' సంచిక నెం. 100 ను ఒక "ప్రత్యేక సంచిక"గా సంపాదకులు తీర్చిదిద్దారు.

ఈ ప్రత్యేక సంచికలో :

| | |
|---|---|
| 1) శుభాకాంక్షలూ - కృతజ్ఞతలూ | రావిపూడి |
| 2) వివేకం - అవివేకం | రావిపూడి |
| 3) న్యాయం-చట్టం-హేతుత్వం | న్యా॥ ఆవుల సాంబశివరావు |
| 4) హేతువాదం-అపోహలు-అపార్థాలు | జి.వీరన్న |
| 5) తప్పుడు విలువుల - సేవ | డి.వి.రామకృష్ణారావు |

| | |
|---|---|
| 6) రత్నాలు-నమ్మకాలు | పొదిలి శంకర పిచ్చయ్య<br>మైనేని కేశవ దుర్గాప్రసాదు |
| 7) మతం-నైతిక విలువలు | కొల్లా సుబ్బారావు |
| 8) రాజకీయాల్లో కులం | డా॥ ఎన్.ఇన్నయ్య |
| 9) మనదేవుళ్ళ బతుకులు | గణేశ్వరం బాబూరావు |
| 10) ఈ దేశం బాగుపడుతుందా? | పి.భీమన్న |
| 11) సమాజం-దైవభావన | సత్యమిత్ర |
| 12) థామస్‌పెయిన్ | జి.అరుణకుమారి<br>జి.ఆర్.ఆర్.బాబు |
| 13) హేతువాదులు ఫెమినిజాన్ని బలపరచాలి | మల్లాది సుబ్బమ్మ |
| 14) బైబిలు సృష్టి కథలు | పి.యస్.ఆర్. |
| 15) జ్యోతిషం-బూటకం | ఇంకొల్లు హేతువాద సంఘం |

ఈ ప్రత్యేక సంచికలోనే **రావిపూడి వెంకటాద్రి** తమ వ్యాసం **"వివేకం-అవివేకం"** ప్రచురించారు. **రావిపూడి** తమ వ్యాసంలో :

"మార్పు కావాలి అంటుంది వివేకం. మార్పును సవాలు చేస్తుంది మతం. హేతుత్వాన్ని నిరంతరాయంగా పనిచేయించడం వల్లనే తత్వశాస్త్రమనేది బయలుదేరింది. మతం విశ్వాసం మీద ఆధారపడి ఉంటుంది. అందువల్ల తత్వశాస్త్ర చరిత్రనంతా వివేకానికి, మతానికి మధ్య జరిగిన పోరాటంగా వర్ణించవచ్చు. కాబట్టి; శాస్త్రానికీ, మతానికీ మధ్య వైరుధ్యం లేదనడం అర్ధరహితం"

"చార్వాకులు ఈ ప్రపంచం భౌతిక వాస్తవికతను గుర్తించారు. అన్ని రకాల అతీత శక్తుల్నీ తిరస్కరించారు. ఆత్మ భావాన్ని ఖండించారు. నిర్జీవ భౌతిక ద్రవ్యంలోని వివిధ మూలకాలు కలియడంవల్ల నిష్పన్నమైన లక్షణంగా జీవాన్ని వివరించారు. మరణించిన వారికి శ్రాద్ధాలు పెట్టడాన్ని తీవ్రంగా విమర్శించారు. స్వర్గనరకాలు ఉన్నవనే భావాన్ని ఘాటుగా విమర్శించారు. పురోహితవర్గ ఆధిక్యతను గట్టిగా ఖండించారు. వేదాధికారాన్ని అంగీకరించలేదు. యజ్ఞయాగాది క్రతువులను విమర్శించారు. ఇంద్రియ జ్ఞానమే జ్ఞానమంతటికీ మూలమని పేర్కొన్నారు. ఒకే ఒక జీవితం ఉన్నది, ఈ జీవితాన్ని సుఖంగా అనుభవించాలి అన్నారు."

"న్యాయ వైశేషిక సాంఖ్య దర్శనాలు మూడూ భారతీయ తత్వశాస్త్ర చరిత్రలో మైలురాళ్ళు. వాటిపరిమితులు వాటికి ఉన్నా హేతువాదరీతి, శాస్త్రీయ దృక్పథం వారి దార్శనిక సాహసయాత్రలో ఉన్నాయి."

1996 ఆగష్టు-సెప్టెంబరు 'హేతువాది' సంచిక నెం. 150కి ఒక ప్రత్యేకం ఉంది. ఈ సంచికలో **"హేతువాద మానవవాద సాహిత్య సమీక్ష"** మొదటిభాగం ఇందులో ప్రధానమైనది. రెండవ భాగాన్ని 150A హేతువాది సంచికలో ప్రచురించారు. అప్పటివరకు రావిపూడి ప్రచురించిన హేతువాద మానవవాద సాహిత్యాన్ని, ఇతరుల రచనలను హేతువాద మానవవాద ఉద్యమ సహచరులు సమీక్షించగా రావిపూడి ప్రచురించారు. 150, 150A హేతువాది సంచికల్లో ఆయన ప్రచురించిన గ్రంథ సమీక్షలు మొత్తం 81. ఆ తర్వాత ఈ గ్రంథ సమీక్షలన్నిటినీ కలిపి "హేమా సాహిత్య సమీక్షలు" పేరున ఒక ప్రత్యేక గ్రంథంగా ప్రచురించారు. యువపాఠకులకు అవన్నీ అందుబాటులోకి రావడంతో హేతువాద మానవవాద ఉద్యమానికి వారే వనరులయ్యారు.

* 'హేతువాది' సంచిక నెం. 150లో **రావిపూడి వెంకటాద్రి 'స్వవిషయం'** పేరుతో ఎడిటోరియల్‌ను రాశారు. ఆ ఎడిటోరియల్ రావిపూడి :

"50 సంవత్సరాల నుంచీ గ్రంథాలు చదువుతున్నాను, విషయాలు తెలుసుకుంటున్నాను, ఆలోచిస్తున్నాను, వింటున్నాను, విన్పిస్తున్నాను, నిర్ణయాలు తీసుకుంటున్నాను, అర్ధశతాబ్ధిగా నా అభిప్రాయాలను వ్రాస్తున్నాను. ఈ ప్రక్రియలింకా కొనసాగుతూనే ఉంటాయి. ఈ ప్రాకులాట అంతా మరింత స్పష్టత కోసం, మరింత సమగ్రత కోసం."

"భావ పరిణామం నిత్యనూతనమవుతుంది. సంఘ గమనానికి ఊతమవుతుంది. భావగమనం, స్వేచ్ఛా సంకల్పం లేకపోతే సృజనలేదు. సృజన లేకపోతే చరిత్రలేదు. మానవుడి స్వేచ్ఛ, సృజన ఎల్లప్పుడూ అతని ప్రయోజనానికి దారితీస్తాయి. లక్ష్యమంతా సామాజిక ప్రయోజనమే."

**"ఎవ్వరూ, ఎన్నడూ సర్వజ్ఞులు కావడానికి వీలులేదు. కాగా, సమకాలీన స్థాయిని అందుకోవలసిన బాధ్యత ప్రతి మానవుడి మీదా ఉంది."**

"సమాజానికి చెడు చేస్తాయని నేననుకొన్న వైఖరుల్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించడం, మంచి చేస్తాయనుకొన్న వైఖరులకు మరింత స్పష్టత చేకూర్చడం – ఇది నా రచనల కోణం. అది నచ్చనివారు ఏడుస్తారు. నచ్చినవారు

ఆనందిస్తారు. ఒకరి మెప్పుకోసమో, దెప్పుకోసమో నేనెప్పుడూ ఏదీ వ్రాయను."

151వ సంచిక నుంచి ముప్పాళ్ళ బసవ పున్నారావు మేనేజింగ్ ఎడిటర్ బాధ్యతలను స్వీకరించారు.

1997 అక్టోబరు 'హేతువాది' సంచిక నుండి **"మనం ఏమిచేయాలి?"** అనే సీరియల్ వ్యాసాన్ని **రావిపూడి వెంకటాద్రి** రచించి ప్రారంభించారు. హేతువాదులు, మానవవాదుల కార్యాచరణ ఎలా ఉండాలనే విషయంపై రావిపూడి తమ అభిప్రాయాలను ఈ వ్యాసావళిలో వ్యక్తంచేశారు. రావిపూడి తమ వ్యాసంలో :

"చార్వాక జైన బౌద్ధ భావవిప్లవోద్యమాలు ఆందోళనోద్యమాల రూపానికి చేరుకోలేదు. హింసా దౌర్జన్యాలకు పూనుకోలేదు. అవి ప్రజాభిమతాలుగా మారిన తర్వాత కూడా ఎన్నడూ ఆందోళనోద్యమాల రూపాన్ని పొందలేదు. ప్రపంచంలో సజీవమైన ఏ భావోద్యమమూ ఆ స్థితికి దిగజారలేదు. భావోద్యమాల తరహాయే అంత".

"పౌరాణిక హైందవం మాత్రమే తాత్విక స్థాయికి దూరమైంది. చార్వాక జైన బౌద్ధాలపై విషప్రచారం చేసింది. హిందూ రాజ్యపాలకుల్ని ఆకట్టుకుంది. ప్రజల్ని రెచ్చగొట్టింది. అభ్యుదయ భావోద్యమాలపై పెంచుకున్న కసిని తీర్చుకుంది. బౌద్ధ స్థూపాల్నీ, జైన మందిరాలనూ విధ్వంసం చేసింది. వాటి స్థానాల్లో హిందూ దేవాలయాలను లేపింది."

"ఆందోళనలు ఎవ్వరిమీద ఎవ్వరైనా చేపట్టగలరు. లౌకికవాదులు మతవాదులమీద, స్వాములవార్లమీద ఆందోళనలు చేపడితే, ఆ వర్గాలకు అది చీమ కుట్టినట్లయినా వుండదు. మతవాదులు లౌకికవాదులకు వ్యతిరేకంగా ఆందోళనలు చేపడితే, వారు లౌకికవాదాన్ని నామరూపాలు లేకుండా నాశనం చేయగలరు."

"సెక్యులర్ భావోద్యమాలు ఆందోళన మార్గం పడితే, అది ఆత్మ వినాశనానికే దారితీస్తుంది. దానివల్ల లాభపడేది మత భావోద్యమకారులే. సంయమనం భావవిప్లవోద్యమాలకు – అందునా, హేతువాద, లౌకికవాద, మానవవాద ఉద్యమాలకు రక్షమాత్రమే."

"బలంతో మతాన్ని అణచడానికి మార్క్సిస్టు జెండా కింద బయలుదేరిన కమ్యూనిస్టు ప్రభుత్వాల కృషి ఫలించలేదు. అవి పడిపోగానే మతం తిరిగి

తలెత్తి తన పూర్వ స్థాయికి పుంజుకుంటోంది. మతం భావోద్యమం కాబట్టి, భావవిప్లవోద్యమం ద్వారానే దాని ఉధృతిని క్రమేణా తగ్గించగలమని దానివల్ల తేలుతుంది."

"మతభావాలను నిరాకరించడమనేది భావవిప్లవంలో తొలిమెట్టు."

"మనుషుల్లో హేతువాద చింతనను, మానవవాద లక్ష్యాన్ని ప్రేరేపిస్తే, వారు నిదానంగానైనా, అవశ్యంగా మూఢనమ్మకాల నుంచి స్వయంగా విడుదల పొందుతారు."

"హేతువాదుల సంఖ్యాబలం తగ్గితే హేతువాదం తగ్గినట్లుకాదు. తాలుతపక ఎప్పుడైనా గాలికి పోవలసిందే. ఎందుకంటే, చర్చీలకు పోయేసరుకు సైన్సు లాబొరేటరీలకు పనికిరాదు."

"మనిషిలో మనిషితనం, మనిషిగా వివేచించడం, మనిషిగా ప్రతీకరించడం మృగ్యమైన తర్వాతనే అతను ఏ బాబాకైనా, స్వామికైనా, అమ్మకైనా బానిస అవుతాడు."

"మన భావాలకు విరుద్ధమైన భావాలు కలవారితో జంగిలి కూటాలకు మనం వ్యతిరేకం. అల్లరి ఆందోళనోద్యమాలకు మనం వ్యతిరేకం – ఎంతకాలం పట్టినా భావవిప్లవం ద్వారా సామాజిక పరివర్తన తేవడమే మన లక్ష్యం. అందుకు సాహిత్యం, పత్రికలు, ప్రసంగాలు, అధ్యయన శిబిరాలు, సభలు–సమావేశాలు మన ముఖ్య కార్యాచరణ పథకాలు."

"అవగాహనలేని ఆచరణ మానవోచితంకాదు. ఆలోచనలేని ఆచరణ జంతు లక్షణం. జంతువుల వర్తనను ఆచరణ అనడం సరైన పద్ధతికాదు. ఎందుకంటే, అది చైతన్యచోదితం కాదు."

"నిజానికి స్వతంత్రాలోచన చేయగలవారిగా ప్రజలను మార్చి వారి తలలను లెక్కబెట్టి, ఆ తలల్లో వున్నదాన్ని పరిగణనలోకి తీసుకునే మానవస్వామ్యమే నిజమైన ప్రజాస్వామ్యం."

"భావ విప్లవోద్యమాల లక్ష్యం భావపరివర్తన, భావపరివర్తన లక్ష్యం సామాజిక పరివర్తన. అందువల్ల, వాటి కార్యాచరణ పథకాలను ఆ లక్ష్యాలే నిర్ణయిస్తాయి."

"అధికారం ద్వారా, చండశాసనాల ద్వారా భావాల్లో మార్పు, సమాజంలో మార్పు తీసుకురావడమనేది పేరాశ. శాసనాలు సామాజిక

మార్పుకు అడ్డంకులు లేకుండా తొలగించవచ్చు. కాని, సామాజిక భావాలకు, నీతులకు, రీతులకు వ్యతిరేకంగా శాసనాలు చేయడానికి రాజకీయులు కూడా జంకుతారు. ఎందుకంటే, అవి వారి రాజకీయ మనుగడకే ఎసరు పెట్టవచ్చు."

"సమ్మెలు, ఊరేగింపులు, నిరసనలు, నిరశనలు వగైరా మాత్రమే ఆచరణలు కావు. నిజానికి, అవి ఆచరణలేకావు. హేతువాదుల ఆచరణలన్నీ వ్యక్తిగత ఆచరణలు, సామాజిక ఆచరణలు, ఆలోచనా పూర్వక ఆచరణలు. అవి డూడూబసవన్నల్లాంటి మూకాచరణలు కావు."

"స్వాములకు, బాబాలకు భక్తులు పెరుగుతూనే ఉన్నారు. కారణం ప్రజల్లో వివేచనాశక్తి సన్నగిల్లడమే. ప్రజల్లో వివేచనా శక్తిని పెంచడానికి చిట్కావైద్యాల్లాంటి ఆందోళనలుకాక, వైజ్ఞానిక విమర్శనాత్మక సాహిత్య ప్రక్రియల్ని అనుసరించాలి. వాటి ప్రభావం దీర్ఘకాలికంగా పనిచేస్తుంది."

"నూతన సమాజసృష్టి హేతువాద, మానవవాదుల ఆకాంక్ష. అది జరగాలంటే నూతన తాత్విక చింతనను వ్యాప్తి చేయాలి."

"భావ విప్లవోద్యమకారుల ప్రథమ కార్యాచరణ ప్రజల్లో భావ విప్లవాన్ని, భావ వికాసాన్ని తేవడం. భావవికాసం పొందిన ప్రజలు మతాలకు లొంగరు. బాబాలకు లొంగరు. దేవాలయాలను దర్శించరు. బాబాల ముఖం చూడరు. ఆ స్థితికి ప్రజల్ని చేర్చడమే హేతువాద, నాస్తిక, స్వేచ్ఛావాద, మానవవాద ఆచరణ".

"ఆచరణ ఎప్పుడూ అవగాహనను అనుసరించాలి. సరైన అవగాహన సరైన ఆచరణకు దారి చూపుతుంది. సిద్ధాంతాలు పుట్టేదే ఆచరణకోసం. ఆచరణ జరిగేదే సిద్ధాంతాలను బట్టి."

"కమ్యూనిస్టు అలవాట్లలో పెరిగినవారు ఏ ఉద్యమాల్లోకి వెళ్ళినా కావలసినంత పనికోసం ఎదురు చూస్తారు. కమ్యూనిస్టులు కానివారిలోను అలాంటి వాలిక లేదని నేనడంలేదు. భావోద్యమాల్లో అలాంటి వారికి సరైన ఆచరణ ఆహారం దొరకదు. అందువల్ల వారు భావోద్యమాలకు దూరమైనా అవుతారు, లేకుంటే వాటిని తమ తరహా ఆచరణోద్యమాలుగా మార్చడానికి ప్రయత్నాలైనా ప్రారంభిస్తారు."

"ప్రజల పని మనం చేసి గొప్పలు చెప్పుకోవడం కుదరదు. దానికి ప్రజాసేవ అని పేరుపెట్టి ధర్మకర్తలుగా మారడం సరికాదు."

"భావోద్యమకారులు ప్రజలకు నాయకత్వం వహించడం కాదు కావలసింది. మార్గదర్శకత్వం మాత్రమే వహించాలి. ప్రజలు తమకు తామే నాయకులు కావాలి. భావనావిధుల్లోను, సామాజిక వ్యవస్థల్లోనూ ఇదే ప్రజాస్వామ్య జీవన విధానం. ఆ స్థాయిలో దీన్ని మనం మానవస్వామ్య మంటాం."

"మతా సంస్కృతికి వీడ్కోలిచ్చి, మానవ సంస్కృతిని ఆహ్వానించ వలసిన వైజ్ఞానిక సాంస్కృతిక నాగరిక దశలో మన వున్నాం. అయినా, తిరిగి మూక ఉద్యమాలు చోటు చేసుకోవడం మానవ వైఫల్యాన్ని చాటుతున్నది. భావ విప్లవకారులూ, మానవవాదులూ మరింత శ్రమ పడాలని ఆ స్థితి గుర్తు చేస్తున్నది. మూకల్లోని మానవాకారులను మనుషులుగా మార్చాలని గుర్తు చేస్తున్నది.

"అభిమాన-దురభిమానాల నుంచి స్వేచ్ఛపొంది, మనిషిని మనిషిగా గౌరవించగల్గిన చైతన్య స్థాయికి ప్రజల్ని పెంచాలి. పెరగనీయాలి. అలా పెరిగినవారు ఇతరుల నియంత్రణతో నిమిత్తం లేకుండా తమకు అనుగుణమైన సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, నైతికాది వ్యవస్థల్ని ఏర్పాటు చేసుకోగలుగుతారు. అదే మానవస్వామ్యం. అదే మానవవాద లక్ష్యం."

"ఎవరిని ఎదుర్కోవాలో అలాంటి వారితోనే ఐక్యసంఘటన కట్టడం ఎలాంటి నీతికి దారి తీస్తుందో ఆలోచించాలి."

"ఉద్వేగాలు మనల్ని తప్పుదారి పట్టించే ప్రమాదముంది. అందువల్ల, వాటిని ఎల్లప్పుడూ హేతుత్వ అదుపులో ఉంచాలి. ఈ వైఖరి ఉద్యమంపట్ల మన లక్ష్య శుద్ధికి, చిత్తశుద్ధికి తార్కాణంగా నిలుస్తుంది. ఇది, హేతువాద-మానవవాదాలపట్ల మరింత నిజం."

"నిరంతరం పెంపొందే విజ్ఞానానికి, ఆ జ్ఞానం వల్ల ఆవిష్కృతమం సత్యానికీ, ఆ సత్యాన్ని అవగాహన చేసుకుని ప్రవర్తించే స్వేచ్ఛకీ, ఆ స్వేచ్ఛావర్తన ద్వారా మానవుల మధ్య సామరస్య సంబంధాలను నెలకొల్పే నైతిక ప్రవృత్తికీ మధ్య వివేచనాయుత సంబంధాన్ని చూచే మానవవాదానికి హేతువాదం దారితీస్తుంది."

"సామాజికుల మనసుల్లో తిష్టవేసిన మతవిశ్వాసం. దాని అనుబంధ జాడ్యాలు ముందుగా నిర్వీర్యం కావాలి. వాటిని నిర్వీర్యం చేయగలిగేది భావవిప్లవమొక్కటే."

"మతమనేది ఒకనాటి భావాల శాశ్వత వ్యవస్థీకరణ. అయినప్పుడు, ఆ భావాల్లో మార్పు తీసుకురావడమే భావవిప్లవం. ....పాతభావాలు వైదొలిగితే, కొత్త మనిషి పుట్టుకొస్తాడు. ఆ మనిషి తనకు కావలసిన సాంస్కృతిక, సామాజిక, నైతిక, రాజకీయ, ఆర్థిక పునర్నిర్మాణాలకు పూనుకుంటాడు."

"భావవిప్లవం సాంస్కృతిక విప్లవానికి దారితీస్తుంది. సాంస్కృతిక విప్లవం సాంఘిక పరివర్తనకు దారితీస్తుంది. అది రాజకీయ, ఆర్థిక విప్లవాలకు దారిచూపుతుంది. రోగం భావాల్లో వున్నప్పుడు, ఆ రోగాన్ని కుదర్చకుండా, భావేతర రంగాల్లో విప్లవాలు తెస్తామనడం, అభ్యుదయం సాధిస్తామనడం వ్యర్ధ ప్రలాపాల క్రింద చేరతాయి."

"భావవిప్లవమూ, సామాజిక పరివర్తనా అనేవి చాల నిదానంగా జరిగే అంశాలు. మరునాటికే ఆ పరివర్తనలను సాధించడానికి మ్యాజిక్ ఫార్ములాలు ఏమీలేవు. అవకాశవాద కూటాలద్వారా అది తంతెలు తంతెలుగా సాధించగలిగింది కాదు."

"కొందరు ప్రచ్ఛన్న మతవాదులు మనలోని ఔత్సాహికుల్ని, సాహసికుల్ని దుస్సాహస మార్గాలకు ఆకర్షించేదికద్దు. కాని, దుస్సాహసం మనమార్గం కాదని భావవిప్లవకారులు గుర్తించాలి."

"మానవవాదిది సమూల భావవిప్లవ మార్గం. సామాజిక విప్లవమార్గం. సాంస్కృతిక విప్లవ మార్గం."

"మనం మానవతావాదాన్ని అధిగమించి" మానవవాదులుగా తేలాము. మానవవాదం. మానవతావాదం కంటే చాల విస్తృతమైనది. అది లౌకికవాదాన్ని మరింత సమగ్ర దృష్టితో మానవజీవితానికి అన్వయిస్తుంది. మతాన్ని నిరాకరిస్తుంది. మానవుడి భవితవ్యానికి మానవుడినే కర్తగా భావిస్తుంది. నాస్తికులు, హేతువాదులు, భౌతికవాదులు మానవవాద పథికులలోనికే వస్తారు. వీరందరినీ ఉద్దేశించి వాడుతున్నదే, 'మనం' అనే పదం.

"ఆచార బానిసత్వం సామాజిక బానిసత్వమే. భావబానిసత్వం తాత్విక బానిసత్వమే. ఆ కట్టుత్రాళ్ళను తెంచుకోవడానికే స్వతంత్రాలోచన కావాలి. స్వతంత్రాలోచన చేయగల ధైర్యం కావాలి. ఆలోచనకు అనుగుణంగా ఆచరించగల చిత్తశుద్ధి కావాలి."

"మతాలు, కులాలు రాజకీయ పార్టీల్లో అంతర్గతంగా ముఠాలను

ప్రేరేపించగా, రాజకీయ పార్టీలు కూడా మతాల్లో, కులాల్లో ముఠాలను ప్రేరేపించాయి. అంతా అరాచకీయమైంది. అయినా రాజకీయాలు మత నమ్మకాలనూ, కుల వ్యత్యాసాలనూ తమ ప్రాచుర్యానికి ఇంథనంగా వాడుకుంటున్నాయి. మతాలు, కులాలు రాజకీయాధికారంలో వాటాలు కోరుకుంటున్నాయి. ఇది కూడా ఈనాటి రాజకీయాచరణలో భాగమే."

"ప్రజలకు దక్కవలసిన అధికారం ప్రతినిధులకు దక్కింది. ప్రతినిధులు రాజులయ్యారు. మంత్రులు రారాజులయ్యారు. స్వామ్యం ప్రజల నుంచి దూరదూరంగా జరిగిపోతున్నది."

"రాజరికం పోయినా పెత్తందారీతనం పోలేదు. అయినా, ఈనాడు రాజకీయం పెత్తందారీ అవశేషంగా కాక, పెత్తందారీ విశేషంగా కొనసాగుతున్నది."

"కనిష్ఠ ప్రభుత్వమే గరిష్ఠ స్వేచ్ఛ యిస్తుందనేది ప్రజాస్వామ్య సూత్రం. కాని, ఇప్పుడు గరిష్ఠ ప్రభుత్వం కనిష్ఠ స్వేచ్ఛను కూడా ఇవ్వని రాజకీయాలు మనవి."

"రాజకీయ నాయకులు కావాలని ప్రజలచేత చేయించేదే ఈనాటి రాజకీయ కార్యాచరణ."

"స్వరాజ్యం రానురాను అల్లర్ల రాజకీయ జీవితానికీ, అల్లర్ల రాజకీయ కార్యాచరణకీ అలవాటు పడిపోతున్నదన్న మాట. మంచిచెడ్డల విచక్షణ ఎక్కడాలేదు. దాన్ని చైతన్యమని రాజకీయులు భ్రమ పెడుతున్నారు."

"రాజకీయ సుడిగుండం సామాజిక జీవితాన్ని మొత్తాన్నీ తనలోకి లాక్కుంటున్నది. ఇదివరకటి "మతం మనిషి" ఇకమీద "రాజకీయం మనిషి" అయిపోతాడన్నమాట."

"గతంలో మతం మనుషుల మెదళ్ళను "మురికి భావాలతో ఉతికి అరవేసింది. ఇప్పుడు రాజకీయం "మురికి ఆచరణ"తో వుతుకుతున్నది. మనిషి తనను తాను మరచిపోవడమే రెండింటి లక్ష్యమైంది."

"అధికారంలో లేనప్పుడు మానవ హక్కుల్నీ, మానవ విలువల్నీ గురించి మాట్లాడడం, అధికారంలోకి వచ్చిన తర్వాత వాటికి భిన్నంగా నడవడమే రాజకీయ నీతిగా తీరికూర్చుంది."

"ఏ ఉద్యమంలో చేరితే జనం వెంటబడతారా అనే ఆలోచనవేరు.

ఉన్న జనంతోనే సరయిన ఉద్యమంలో భాగస్వాములమవదాం అనే ఆలోచన వేరు. భావవిప్లవం, తాత్విక విప్లవమే మానవవాదానికి మార్గంకాగా, ఏ మత సంస్కరణలో, ఏ రాజకీయ సంస్కరణలో దానికి మార్గమని భావించడం కేవలం భ్రమ."

"మనిషి వివేకం మీద, మంచితనంమీద, మారేశక్తిమీద నమ్మకం వుంటే అన్ని తరగతుల మానవవాదులూ తమ సొంత నాయకత్వం కోసం ప్రాకులాడరు. మానవులంతా ఎవరికి వారే నాయకులు కావడానికి మార్గదర్శకులవతారు. మార్గదర్శకత్వం వహించడానికి 'ముద్దర్లు' అక్కరలేదు. మనిషిగా వస్తుత్వం వుంటేచాలు."

"హేతువాదం వంటి భావోద్యమాల పెరుగుదల నిదానంగానే వుంటుంది. వుండకతప్పదు. మనుషులలో స్వభావ సిద్ధంగానూ, సంస్కార రీత్యానూ వున్న బలహీనతలను, ఉద్రేకాలను, దురభిమానాలను రెచ్చగొట్టడం ద్వారా సంఖ్యాబలాన్ని పెంచుకోవడం హేతువాదం వంటి భావోద్యమాల స్వభావం కాదు. అందువల్ల, కేవలం పెరుగుదల దృష్టితోకాక, హేతువాద ఉద్యమాన్ని హేతువాద ఉద్యమంగానే కల్తీలేకుండా పోషించుకోవాలి."

2000 సం॥ జనవరి 'హేతువాది'ని **"కొత్త సహస్రాబ్ది ప్రత్యేక సంచిక"**గా తీర్చిదిద్దారు సంపాదకులు **రావిపూడి వెంకటాద్రి**. ఈ సంచిక నుండి **'హేతువాది'** మేనేజింగ్ ఎడిటర్ బాధ్యతలను భారత హేతువాద సంఘ ప్రధాని కార్యదర్శి, న్యూ హ్యూమనిస్ట్ పత్రిక ఎడిటర్ **అంచా బాపారావు** చేపట్టారు. లెటర్ ప్రెస్‌లో ప్రింటయ్యే హేతువాది'ని డి.టి.పి. చేయించి ఆఫ్‌సెట్ ప్రింటింగుకు తీర్చిదిద్దారు.

ఈ ప్రత్యేక సంచికలో ఈ అంశాలను ఆయా రచయితలు రచించారు.

ఎడిటోరియల్ : రావిపూడి వెంకటాద్రి
నూతన సహస్రాబ్ది : పి యస్సార్
హ్యూమనిస్ట్ మ్యానిఫెస్టో : ప్రఫుల్ల (అనువాదం)
నవ్య పునర్జీవనం : శిబ్‌నారాయణరే

**ఆధునిక విజ్ఞాన యుగ వైతాళికులు**

కోపర్నికస్, బ్రూనో, డార్విన్ : రావిపూడి

**సామాజిక పునర్నిర్మాణ పథకులు :**

మార్క్స్ : కల్లూరి బసవేశ్వరరావు

యం.యన్.రాయ్ : గుమ్మావీరన్న

**నాస్తికోద్యమ నిర్మాతలు :**

డెరోజియో : రావిపూడి

కవిరాజు : మేడూరి సత్యనారాయణ

పెరియార్, గోరా : కుర్రా హనుమంతరావు

**దళితోద్యమ నిర్మాతలు :**

పూలే, అంబేద్కర్ : పియస్సార్

**సంస్కర్తలు :**

రామమోహన్‌రాయ్ : బీరం సుందరరావు

స్వామినేని : పీయస్సార్

గురజాడ, కందుకూరి : బీరం సుందరరావు

ఆల్బరాని : అజీం

బ్రిటీష్ పాలన : చుండూరి వెంకటేశ్వర్లు

నరకంలో హరిశ్చంద్ర : కుర్రా హనుమంతరావు

ఈ ప్రత్యేక సంచిక ఎడిటోరియల్‌లో **రావిపూడి వెంకటాద్రి :**

"శతాబ్దులేకాదు, సహస్రాబ్దులేకాదు, మానవజాతి వైజ్ఞానిక చరిత్రలోనే మలుపులు తిప్పి, శాస్త్రీయ తాత్విక అవగాహనకు, దృక్పధానికి సక్రమగతిని కల్పించిన ఘనులు ఇద్దరే ఉన్నారు. ఒకరు నికోలస్ కోపర్నికస్, రెండవవారు చార్లెస్ డార్విన్."

"మతాలు బోధించే ప్రధానమైన అసత్యాలు రెండు

1) దేవుడు భూమిని సృష్టించి దానిచుట్టూ సూర్యుడిని తిప్పుతున్నాడనేది,

2) మనిషి బొమ్మను తయారుచేసి, దానిలోకి దేవుడు ఊపిరి ఊదాడని,

మొదటి అసత్యాన్ని కోపర్నికస్, రెండవ అసత్యాన్ని డార్విన్ తప్పుపట్టి సత్యమార్గాన్ని చూపారు హేతువాద భౌతికవాద చింతన వారికెంతో రుణపడి ఉంది. అంతటి మౌలిక చింతన చేసేవారు ముమ్ముందు ఏ రంగంలో, ఎప్పుడు పుడతారో మనం వేచి చూడవలసిందే."

**రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ దశమ వార్షికోత్సవం :**

2002 ఫిబ్రవరి 9, 10 తేదీలలో రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు స్థలంలో జరుగుతున్న భవన నిర్మాణం పాక్షికంగా పూర్తవ్వగా ఆ

రాడికల్ హ్యూమనిస్ట్ భవన్‌లో **దశమ వార్షికోత్సవం** ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా హేతువాద మానవవాద అధ్యయన తరగతులు నిర్వహించబడ్డాయి. ఈ అధ్యయన తరగతుల్లో వివిధ అంశాలమీద పి.యస్.ఆర్., డా॥యన్. ఇన్నయ్య, డా॥ విజయబక్ష్, గుమ్మా వీరన్న, యం.బసవ పున్నారావు, కుర్రా హనుమంతరావు, మేడూరి సత్యనారాయణ, ఆలూరి ప్రఫుల్లచంద్ర, రావిపూడి వెంకటాద్రి, కరి హరిబాబు, షేక్ బాబు తదితరులు ప్రసంగాలు చేసి సందేహాలకు సమాధానాలు ఇచ్చారు. 9వ తేదీన APRA కార్యవర్గ సమావేశం సంఘ అధ్యక్షులు పి.యస్.ఆర్. అధ్యక్షతన జరిగింది. ఈ కార్యవర్గ సమావేశంలో **'హేతువాది' మాసపత్రిక మేనేజింగ్ ఎడిటర్‌గా మేడూరి సత్యనారాయణ** వ్యవహరించాలని, **రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రులు** సహకరించాలని తీర్మానించారు.

2002 ఫిబ్రవరి నుంచి రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు మిత్రుల సహకారంతో ప్రచురితమై, పంపిణీ చేయబడుతున్న 'హేతువాది' పత్రిక పలు ప్రత్యేక సంచికలుగా వెలువడింది. రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ వార్షికోత్సవాల సమయంలో, సెంటర్ రజతోత్సవం సమయంలో, భారత హేతువాద సంఘ వార్షిక మహాసభల సమయంలో, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ద్వైవార్షిక మహాసభల సమయంలో, భవన ప్రారంభాల సమయంలో పలు ప్రత్యేక సంచికలుగా 'హేతువాది' వెలవడింది.

2007 ఆగష్టు 'హేతువాది' సంచికను **'హేతువాది' రజతోత్సవ సంచికగా** సంపాదకులు తీర్చిదిద్దారు. 1982 సెప్టెంబరు సంచికతో ప్రారంభమైన 'హేతువాది' 25 సంవత్సరాలు పూర్తి చేసుకొని రజతోత్సవాలు జరుపుకొనే సమయంలో ఈ సంచిక 136 పేజీలతో, అభిమానుల శుభాకాంక్షలతో వెలువడింది.

1982లో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షులుగా ఉన్న **రావిపూడి వెంకటాద్రి** హేతువాద ఉద్యమ లక్ష్యాలను సాధించే క్రమంలో ఉద్యమానికి అద్దం పట్టడానికి, అండగా ఉండడానికి కార్యకర్తల హేతువాద మానవవాద ఉద్యమ అవగాహన స్థాయిని పెంచడానికి 'హేతువాది' ప్రచురణను యాజమాన్యంగా, సంపాదకులుగా, పబ్లిషర్‌గా ప్రారంభించి 25 సంవత్సరాలు కొనసాగడం ఒక మైలురాయి. హేతువాద మానవవాద అంశాలమీద అనేకమంది రచయితలు తమ రచనలను కొరతలేకుండా అందించి

సహకరించాయి. ప్రకటన కర్తలు, దాతలు, పాఠకుల సహకారం అపూర్వం. రావిపూడి సంపాదకత్వంలో ఉద్యమ రథంగా హేతువాది ఆయనసారథ్యంలో ముందుకు సాగింది.

ఈ రజతోత్సవ సంచిక సంపాదకీయంలో పత్రిక దృక్పథాన్ని రావిపూడి వివరిస్తూ :

"మానవుడు ప్రకృతి వాస్తవికతను ఎప్పటికప్పుడు గుర్తించి జ్ఞానం అర్జిస్తున్నాడు. ఆ జ్ఞానం వాస్తవికతను గురించిన సత్యానికి ఎప్పటికప్పుడు కొత్త మదింపు వేస్తుంది. 'అంతా' మనకు ఒకేసారి తెలియదు. జ్ఞానం అంచెలు అంచెలుగా పెరుగుతుంది. జ్ఞానం పెరిగేకొలది సత్యం కూడా దానికి సమాంతరంగా పెరుగుతుంది. అది మనకు అందిన వాస్తవిక సత్యాన్ని (objective truth) గురించి మనకున్న అవగాహనను నిర్దేశిస్తుంది."

"నిన్నటికంటే నేడు. నేటికంటే రేపు మనకు వాస్తవిక సత్యం అదనంగా అంటే అవకాశం ఉంది. కాబట్టి, జ్ఞానమూ, దాన్ని బట్టి సత్యమూ - రెండూ సాపేక్షాలే (relative) కాని, పరమం (absolute) కావు. పారమ్యం (absoluteness) అనేది సత్యదూరం. అందువల్ల, సత్యపరిధిని బట్టి ఎప్పటికప్పుడు సిద్ధాంతాలు, తత్వాలు రూపొందుతాయి. సిద్ధాంతాలూ, తత్వాలూ పరమం కావు. విమర్శకు అతీతమున్నూ కావు."

"మారుతున్న ప్రకృతి వాస్తవికత (objective reality) నుంచే సిద్ధాంతాలూ, తత్వాలూ రూపొందుతున్నాయి. ప్రకృతి నిర్విరామ పరిణామంలో ఉన్నదనేది శాశ్వత వాస్తవికతే కాని, సిద్ధాంతం కాదు. కాగా, వాస్తవికత ఆధారంగా ఏర్పడే సిద్ధాంతాలను పెరిగిన జ్ఞాన పరిధికి అనుగుణంగా మార్చుకోవాలి. అంతేకాని, అసలు సిద్ధాంతాలు, తాత్విక దృక్పథాన్ని ఏర్పరచుకోకుంటే మానవ సామాజిక జీవనం వడిదుడుకులుకు లోనవుతుంది. నిజానికి సిద్ధాంతాలన్నీ, తాత్విక వైఖరులన్నీ ఆయా సమయాలకు మనిషికి లభ్యమైన జ్ఞానం ఆధారంగా రూపుదిద్దుకునేవే. అయితే, ఆ సిద్ధాంతాలు, తత్వాలు-ఏవీ వ్యవస్థీకృతం కారాదు. ఎదుగూ బొదుగూలేని బండ సిద్ధాంతాలుగా, మొండి వైఖరులుగా మారరాదు. అలా మారే వాటన్నిటినీ హేతువాదం తిరస్కరిస్తుంది."

" 'హేతువాది' పత్రిక మొట్టమొదటనే ఈ దృక్పథాన్ని చేపట్టింది. గత 25 సంవత్సరాలుగా అనేక సిద్ధాంత రాద్ధాంతాలను పట్టి చూచింది. ఇకముందు

కూడా అదే దృక్పథాన్ని అనుసరిస్తుంది.”

“హేతువాదులు మానవవాదులేకాని, ఏ జాతీయవాదులూకారు. సంస్కృతి అనేది మానవులకు చెందింది. అది నిత్య సంస్కరణ పొందాలి. కాని, హిందూ సంస్కృతి పేరుతో కులాల కుళ్ళును, మనుషుల మధ్య ఉచ్ఛనీచ తారతమ్యాలను నెలకొల్పి, ముదిబండ ఆచార సంప్రదాయాలను మనుషుల మెదళ్ళలో దోపేది మానవ సంస్కృతి కాదు. కేవలం ప్రాచీనత కారణంగా హేతువాదులు దేన్నీ తిరస్కరించరు.”

“**హేతువాదం** ఒక ఊట బావి. తోడేనీరు తోడి పోస్తుంటే కొత్తనీరు ఊరుతూనే ఉంటుంది. **‘హేతువాది’** పత్రిక కూడా ఊటబావే. వ్రాయగలిగింది వ్రాస్తుంటే, వ్రాయవలసింది ఉబికి వస్తూనే ఉంటుంది. అందువల్ల **‘హేతువాది’** రచయితలు కూడా ఊటబావులుగా, భావజల ధారులుగా మారాలి. అలా చేయగల కార్యకర్తలు, రచయితలు హేతువాద సంఘ జమీనులో చాలామంది ఉన్నారు.”

“ ‘హేతువాది’ ద్వారా ఇప్పటిదాకా జరిగిన కృషికి నేనెంతో సంతోషిస్తున్నాను. ఈ కృషిలో సహకరించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు వెల్లడిస్తున్నారు. ఐనా, ఇంకా నేను అసంతృప్తిగానే ఉన్నాను. అందుకు కారణం ఇంతకంటే ఎక్కువ కృషిచేయలేకపోవడమే.”

“హేతువాదులంతా జ్ఞాన ఊట బావులుగా, నిత్య భావజల ధారలుగా మారాలి.”

**‘హేతువాది’ రజతోత్సవ సంచికలో .....**

1) భావాల వ్యవస్థీకరణను బద్దలు కొట్టేదే హేతువాదం – రావిపూడి
2) సందేశం-1 – బాబు గోగినేని
3) జ్ఞానజ్యోతి – కుర్రా హనుమంతరావు
4) అభినందన – బి. సాంబశివరావు
– టి. శ్రీరామమూర్తి
5) సామాజిక పరివర్తనా ప్రస్థానంలో – ఆలూరి ప్రఫుల్ల చంద్ర
6) రజతోత్సవ హేతువాది – పీఎస్సార్
7) ఔనా! వేదంలో అన్నీ ఉన్నాయా? – రావిపూడి
8) హేతువాదం తొలిమజిలీ నాస్తికత్వం – ఆకేటి సూరన్న
9) మానవవాదం – గుమ్మా వీరన్న

10) కవిరాజు హేతువాదం – రావిపూడి
11) ఐన్‌స్టీన్ భావాలు – రావిపూడి
12) వేదాదుల్లో ఆధునిక విజ్ఞానం ? – రావిపూడి
13) 'హేతువాది' ఓ గొప్ప పత్రిక – పసల భీమన్న
14) వ్యాసోపన్యాస మానవవాది ఎ.జి.కె. – ఎన్. ఇన్నయ్య
15) మినీ కవితలు – కళాప్రియ
16) విజ్ఞానశాస్త్రం – మానవ స్వభావం – కుర్రా హనుమంతరావు
17) జీన్స్–3 – ఆర్.వి. సుబ్బారావు
18) డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం – మేడూరి సత్యనారాయణ
19) గ్రహణాలు ఎలా వస్తాయి? – రావిపూడి
20) పాతికేళ్ళ హేతువాది – డా॥ బీరం సుందరరావు

2010 మే 'హేతువాది' సంచిక నెం. 300ను ప్రత్యేక సంచికగా 136 పేజీలతో తీర్చిదిద్ది ప్రచురించారు సంపాదకులు **రావిపూడి వెంకటాద్రి**. 'హేతువాది' 100వ సంచికను, 200వ సంచికను ప్రత్యేక సంచికలుగా ప్రచురించారు. విలువైన వ్యాసాలను ప్రచురించారు.

ఈ ప్రత్యేక సంచికలో....

1) నిరాటంకంగా సాగుతున్న హేతువాది – రావిపూడి
2) తాత్విక విప్లవం – గుమ్మా వీరన్న
3) భావవిప్లవం – వర్గచైతన్యం – రావిపూడి
4) సోదిచెప్పే జ్యోతిష్కులకు ఏమి తెలుసు? – షేక్ బాబు
5) ఉనికి–జ్ఞానం–ఏది ముందు? – రావిపూడి
6) పరిణామం ఒక వాస్తవం – రిచర్డ్ డాకిన్
అను : – మేడూరి సత్యనారాయణ
7) మతాలు మనుషుల కోసమైతే – రావిపూడి
8) వర్ణవ్యవస్థ – కవిరాజు
9) శ్రీ ఆవుల గోపాల కృష్ణమూర్తి –
10) మానవజాతికి మతమెందుకు? – కె. విల్సన్
అను : గుమ్మా వీరన్న
11) మతానికో సవాల్–5 – చాప్‌మన్ కోహెన్
అను : శ్యాంకుమార్

12) రుగ్వేదం - ప్రథమ మండలం - రావిపూడి
13) లోకాంతం - తుమ్మా భాస్కర్
14) జ్ఞాన సిద్ధాంతం - రావిపూడి
15) LETTER - K.V.B.K. Durga Prasada Rao
16) జ్ఞానం-అజ్ఞానం - జి.సి. హెచ్. వీరాస్వామి
17) నిన్ను నీవు తెలుసుకో - డా॥ ఎన్. ఇన్నయ్య
18) భావ విప్లవం ఎందుకు ? - పసల భీమన్న
19) జ్యోతిరావు ఫూలె - లక్ష్మణశాస్త్రి జోషి
20) డా॥ బి.ఆర్. అంబేద్కర్ దళిత జనోద్ధరణ - రావిపూడి
21) నేనెరిగిన ఆవుల గోపాల కృష్ణమూర్తి - మండవ శ్రీరామమూర్తి

2010 జూన్ 'హేతువాది' సంచిక నెం. 301ను **భారత హేతువాద సంఘ 79వ వార్షిక జాతీయ మహాసభ, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ 16వ ద్వైవార్షిక సభల** సందర్భంగా **'హేతువాది' 'రేషనలిస్ట్'ల ప్రత్యేక సంచికగా** 96 పేజీలతో సంపాదకులు రావిపూడి వెంకటాద్రి తీర్చిదిద్దారు.

ఈ ప్రత్యేక సంచికలో.......

1) ఊకదంపుడు మన పద్ధతికాదు - రావిపూడి
2) రినైజాన్స్ - రావిపూడి
3) బుద్ధుడు తొలి లౌకిక సంస్కర్త - ఎస్.రాంబాబు
4) మతానికో సవాల్-6 - చాప్మన్ కోహెన్ అను : శ్యాంకుమార్
5) కృత్రిమజీవం - మేడూరి సత్యనారాయణ
6) పెండ్లికి ముందే శృంగారం-తప్పా, ఒప్పా? - రావిపూడి
7) నిన్ను నీవు తెలుసుకో - డా॥ ఎన్. ఇన్నయ్య
8) రుగ్వేదం - ప్రథమ మండలం - రావిపూడి
9) అర్థంకాని ఏసు బోధలు - ఎస్.నాగేశ్వరరావు
10) మత విమర్శ-చట్టపరమైన పరిమితులు - పీఎస్సార్

Rationalist

1) 80 years of RAI - Meduri Satyanarayana
2) Why Rationalism ? - Ravipudi Venkatadri

| | | |
|---|---|---|
| 3) | M.N.Roy's New Humanism | - Vinod Jain |
| 4) | Brain Science, God Science | - Michael Moghire |
| 5) | How Religion Resists | - Iikka Physianinen |
| 6) | Hindu Communilism | - V.M. Tarkunde |

2011 ఏప్రియల్ 'హేతువాది' సంచికను **"జ్యోతిషం అశాస్త్రీయతపై ప్రత్యేక సంచిక"**గా రూపొందించారు. సంపాదకులు 48 పేజీలతో వెలువడిన ఈ ప్రత్యేక సంచిక నెం. 310. ఈ సంచికలోని వ్యాసాలు ఇవి :

| | | |
|---|---|---|
| 1) | జ్యోతిషం | – రావిపూడి |
| 2) | జ్యోతిషం శాస్త్రం కాదు | – రావిపూడి |
| 3) | జ్యోతిషం శాస్త్రం కాదు, గారడీ | – లారెన్స్ ఇ-జెరోం |
| 4) | పంచాంగాలు అబద్ధాలు | – రావిపూడి |
| 5) | జ్యోతిషంపై ఎ.టి.కోవూర్ | – డి.ఎ.పి.ఎల్.ఎన్.శర్మ |
| 6) | జ్యోతిషం శాస్త్రం కాదు | – కొల్లా సుబ్బారావు |
| 7) | జ్యోతిషం–ఆధునిక విజ్ఞానం | – మేడూరి సత్యనారాయణ |
| 8) | జ్యోతిషంపై ఆసక్తి ఎందుకు పెరుగుతూంది ? | – ప్రొ॥ బార్ట్ జె.బోక్ |
| 9) | గ్రహకూటాలు | – రావిపూడి |
| 10) | శాస్త్రయుగంలో మౌఢ్య బ్రతుకు | – రాబర్ట్ ఈస్లర్ |
| 11) | ఏమిటయ్యా యుగాంతాం జోస్యాలు | – రావిపూడి |
| 12) | జ్యోతిషం శుష్కశాస్త్రం | – ప్రొ॥ ఎం.యం.ధర్మలింగం |

తమ వ్యాసాల్లో **రావిపూడి** వ్యక్తం చేసిన ముఖ్యమైన భావాలు :

"మనుషుల భవిష్యత్తు అంతా ఎప్పటికప్పుడు అప్పటి గ్రహ నక్షత్రాదుల స్థానాన్ని బట్టి ఉంటుందా, లేక జన్మనక్షత్రాన్ని బట్టి ఉంటుందా అనే విషయాన్ని జ్యోతిష గ్రంథాలేవీ తేల్చిచెప్పలేదు. జన్మనక్షత్రం ప్రకారం దాని ప్రభావం నిజమైతే భవిష్యత్తు అంతా ముందే నిర్ణయమైనట్లే కదా! ఎప్పటికప్పుడు గ్రహనక్షత్రాదులు తమ స్థానాన్ని మార్చుకుంటాయి. భూమి కూడా సూర్యుని చుట్టూ, తన చుట్టూ తాను తిరుగుతూ తన స్థానాన్ని ఎప్పటికప్పుడు తన స్థానాన్ని మార్చుకుంటుందని ఆధునిక ఖగోళ విజ్ఞానశాస్త్రం రుజువు చేసింది. మరి, జ్యోతిషానికి భూమి తన స్థానాన్ని ఎప్పటికప్పుడు మార్చుకుంటుందనే విషయం తెలియదు. అలా అని ఏ జ్యోతిషశాస్త్ర గ్రంథమూ చెప్పలేదు. నక్షత్రాల, గ్రహాల వాస్తవ స్థానాలను

ఎలా గుణిస్తారు?"

"తమ పరిధిలోని న్యాయ చట్టాలతో తీర్పులనిచ్చే న్యాయమూర్తులు చట్టాల పరిధిలో వుండని మూఢనమ్మకాలపైన, విజ్ఞానశాస్త్ర విషయాలమీద తీర్పులనిచ్చే సాహసం చేయరాదు. న్యాయశాస్త్రంలో విజ్ఞానశాస్త్రాన్ని వెదకడం మానవాభివృద్ధికి అంత శ్రేయస్కరం కాదని న్యాయమూర్తులు గుర్తించాలి. జ్యోతిషం శాస్త్రమే కాదు అనే విషయాన్ని విజ్ఞాన శాస్త్రవేత్తలకు, ఖగోళ భౌతిక శాస్త్రవేత్తలకు, ఖగోళ జీవశాస్త్రవేత్తలకు వదలివేయాలి. కోర్టులు తమ తీర్పుల ద్వారా సమాజాన్ని ముందుకు తీసుకుపోవాలేకాని ఇంక్విజిషన్ కాలానికి కాదు."

"మన జ్యోతిష్కులకు భూమి గ్రహమని తెలియదు. సూర్యచంద్రులు గ్రహాలు కావని తెలియదు. గ్రహాలకు ఉపగ్రహాలు ఉంటాయని తెలియదు. రాహు కేతువులనే దుష్ట గ్రహాలు లేవని తెలియదు. తమకు తెలిసిన ఐదు గ్రహాలుకాక, 5000 దాకా లఘుగ్రహాల కూటమి ఉన్నదని తెలియదు. అవికాక, యురేనస్, నెఫ్ట్యూన్, ఫ్లూటో అనే దూర గ్రహాలు ఉన్నవని తెలియదు. సౌరకుటుంబంలోని గ్రహ ఉపగ్రహాల పరిమాణాలెంతెంతో, అవి ఎంతెంత దూరాల్లో ఉన్నవో, సూర్యుడి చుట్టూ ఏఏ గ్రహాలు ఏ వేగాలతో తిరుగుతున్నవో, ఎంతకాలంలో తిరుగుతున్నవో, వాటి సాంద్రతలెంతెంతో వారికి తెలియదు. ఇవేవీ తెలియకుండానే మనుషులమీద, దేశాలమీద వాటి ప్రభావాన్ని చెప్పగలమంటున్న జ్యోతిష్కుల్ని ఏమని పిలవాలి?"

2014 జూన్ 'హేతువాది'ని **భారత హేతువాద సంఘ 83వ వార్షిక మహాసభ, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ 18 ద్వైవార్షిక మహాసభల** సందర్భంగా 104 పేజీలతో ప్రత్యేక సంచికగా వెలువరించారు సంపాదకులు **రావిపూడి వెంకటాద్రి**. ఈ 347 నంబరు హేతువాది సంచికలోని వ్యాసాలు :

1) భావ విప్లవ లక్ష్యంతో హేతువాద ఉద్యమం – మేదూరి సత్యనారాయణ
2) హేతువాదం – రావిపూడి వెంకటాద్రి
3) చార్వాకం : పరిశీలన – కుర్రా హనుమంతరావు
4) విశ్వనియమబద్ధత – మేదూరి సత్యనారాయణ
5) విజ్ఞానశాస్త్ర రచనలు తెలుగులోనే ఎందుకు?– ఆలూరి ప్రఫుల్లచంద్ర
6) హేతువాదం – అజ్ఞేయవాదం – రావిపూడి
7) గ్రీకుల విజ్ఞానాభివృద్ధిలో అరబ్బులపాత్ర – షేక్ బాబు
8) సమకాలీనాలు–సార్వకాలికాలు–సమీక్ష – గుమ్మా వీరన్న

9) క్రైస్తవం-యూదిజం-ఏసు-మహమ్మదు - కుర్రా హనుమంతరావు
10) యేసు శాంతిదూత కాదు - పి.జె.సునీల్
11) Essential Features of Rationalists - Ravipudi

2016 ఫిబ్రవరి 'హేతువాది' సంచికను **రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు రజతోత్సవం సందర్భంగా ప్రత్యేక సంచికగా** తీర్చిదిద్దారు సంపాదకులు **రావిపూడి వెంకటాద్రి.** ఈ ప్రత్యేక సంచిక 104 పేజీలతో, చారిత్రక ఫొటోలతో ఆకర్షణీయంగా వెలువరించారు. 1991లో ప్రారంభించబడిన రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లుకు మార్గదర్శి రావిపూడి వెంకటాద్రి. ప్రతి సంవత్సరం వార్షికోత్సవాలు, హేతువాద మానవవాద అధ్యయన తరగతులు, శిక్షణ శిబిరాలు, విద్యార్థులకు హేతువాద మానవవాద పోటీలతో, భారత హేతువాద సంఘం, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, హేమా పబ్లికేషన్స్, హేతువాది, రేషనలిస్ట్‌లకు కార్యాలయంగా ఉద్యమ కేంద్రంగా క్రియాశీలంగా ఉన్న రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ రజితోత్సవాల సందర్భంగా విలువైన వ్యాసాలతో హేతువాది ఉద్యమ చరిత్రకు సాక్షిగా నిలిచింది.

ఈ ప్రత్యేక సంచికలో :

1) యం.యన్.రాయ్ - రావిపూడి
2) ఏదో వుంది ? ఏదో వుంది? - రావిపూడి
3) నియమబద్ధత - స్వేచ్ఛాసంకల్పం - మేడూరి
4) గోమాంస సమస్య సమస్యా ? - షేక్ బాబు
5) మానవ స్వభావం - మానవతా ఆచరణ - యం.యన్.రాయ్
6) లౌకికవాదం-ఉగ్రవాదం - కుర్రా హనుమంతరావు
7) భగవద్గీత బండారం - చేగిరెడ్డి చంద్రశేఖరరెడ్డి
8) చార్వాక స్వభావవాదం - రావిపూడి
9) యేసుచేసిన అద్భుతాలు మనం చేయలేమా? - పి.జె.సునీల్
10) పరస్వామ్యం, ప్రజాస్వామ్యం - సమీక్ష - గుమ్మా వీరన్న

2016 మే 'హేతువాది' సంచికలో **చిలకపాటి రవీంద్రకుమార్ యం.యన్.రాయ్** రచించిన **"స్వేచ్ఛ సమస్య"** అనే వ్యాసాన్ని అనువదించగా సంపాదకులు ప్రచురించారు. ఆ వ్యాసంలో రాయ్ :

"ఆనందాన్వేషణలో అవరోధాలేవీ లేకపోవడమే స్వేచ్ఛ. ఆనందమంటే వాంఛలను ఈడేర్చుకోవడమే. అందువల్ల, మంచి చెడులను అనుల్లంఘ

నీయమైన ప్రమాణాలను నెలకొల్పే పిడివాదపు నైతికత స్వేచ్ఛకు అత్యంత విరోధి. జాతీయవాదానికి స్వేచ్ఛపట్ల ఏమాత్రం ఆదరణ ఉండి ఉన్నట్లయినా, గాంధీ దాని ప్రవక్త అయి ఉండేవాడు కాదు. భారత రాజకీయ జీవిత కార్యాచరణలో స్వేచ్ఛ భావన ప్రముఖ స్థానాన్ని పొందగలిగే ముందే పునరుజ్జీవన రోజుల నుండీ ఆధునిక మానవులు అనుసరిస్తున్న సైద్ధాంతిక భావాలను భారతస్త్రీ పురుషులు చెప్పుకోదగినంత ఎక్కువమంది అలవరచుకోవలసి ఉండేది. వ్యక్తి యొక్క ఆత్మ సాక్షాత్కారమే దాని ఉద్దేశ్యం."

"స్వేచ్ఛ అంటే ఊహల గాలిలో నిర్మించిన అందమైన భవంతి కాదు. అది మానవవాదం, వ్యక్తి శ్రేయోవాదం, హేతువాదం అనే మూడు స్తంభాలపైన నిలిచి ఉంటుంది."

"జీవితమంటే ముగింపుకు మార్గం కాదు. అదే ఒక ముగింపు. అసలు జీవితపు ప్రయోజనమే బ్రతకడం, బ్రతకడమంటే జీవితాన్ని ఆనందించడం. తన ఉనికికే మూలమైన, తన ఉనికిలోనే భాగమైన ప్రపంచం మీద తన ఆధిపత్యాన్ని స్థాపించడానికీ, తన వాంఛలను తీర్చుకోవడానికీ జ్ఞానం మనిషికి శక్తిని ఇస్తుంది. అందువల్ల, కోర్కెలను ఈడేర్చుకోవడమంటే జీవితపు ఆత్మ సాక్ష్యాత్కారమైన స్వేచ్ఛాజీవి మాత్రమే జీవితపు సంపూర్ణమైన ఆనందాన్ని పొందగలడు కాబట్టి స్వేచ్ఛ అనేది అత్యున్నత ఆదర్శం. జీవితపు ఆత్మ సాక్షాత్కారానికి స్వేచ్ఛ తప్పనిసరి."

"వ్యక్తికి తనకు తానే యజమానిననే భావన కలిగినప్పుడు మాత్రమే, తన భవితవ్యాన్ని తానే రూపొందించుకోగల గొప్ప దార్శనికతను పొందగలడు; అంటే స్వేచ్ఛగల ఇతరుల సహకారంతో జీవితాన్ని ఆనందమయంగా గడిపేందుకు అనువుగా ప్రపంచాన్ని పునర్నిర్మించగలడు."

"నియతివాదం ప్రకృతిలోని హేతువు. దానికి విరుద్ధంగా మానసిక నమూనాలో భౌతిక నియతివాదపు కార్యాచరణే హేతువు. హేతువాదం మనిషి అస్తిత్వాన్ని, యోగ్యతను అనవసరపు అధిభౌతికమైన విషయ ఊహల ప్రమేయం లేకుండా వివరిస్తుంది. అలా, మనిషికి అన్ని అసంబద్ధ శక్తుల నుండి స్వేచ్ఛను కల్పిస్తుంది. హేతువు యొక్క ఆధిపత్యాన్ని ప్రకటించి ఉన్నందున, వ్యక్తి శ్రేయోవాదం తిరిగి హేతువాదంతో బలోపేతం చేయబడింది."

"స్వతంత్రమంటే కేవలం జాతీయ స్వాతంత్ర్యంకంటే మరింత

ఉన్నతమైనదని స్వాతంత్ర్యం పట్ల ఆదరణగల ఆధ్యాత్మికంగా విముక్తులైన, కొద్దిమంది భారతీయులు - భారత పునర్వికాస పురుషులు - ప్రస్తుత సంక్షోభానికి తట్టుకుని నిలిచేందుకు ఆధునిక నాగరికతకు మరింత ప్రాముఖ్యతను ఇస్తారు. జాతీయవాదం పరాజయం పాలైతేకాని భారత్‌కు స్వేచ్ఛరాదు. ఎందువల్లనంటే, స్వేచ్ఛను వద్దనుకునే సంప్రదాయంతో జాతీయవాదం స్ఫూర్తి పొందింది. సమకాలీన భారత్‌లో స్వేచ్ఛ అనేది ఒక ఆదర్శం కూడా కాదు. అందువల్లనే స్వేచ్ఛ సమస్య అంత క్లిష్టమైనది."

2017 సెప్టెంబరు 'హేతువాది' సంచికలో **"సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు, భావోద్యమాల కర్తవ్యం"** అనే ఎడిటోరియల్‌లో **రావిపూడి :**

"వైజ్ఞానిక ప్రగతిని సాధించే దిశగా, మానవ సంక్షేమానికి అనువైన విధంగా మార్పు సాధించేది మాత్రమే సంస్కృతి. సాంస్కృతిక విప్లవమంటే భావ విప్లవమే. సాంస్కృతిక పునరుజ్జీవనమంటే భావ పునర్వికాసమే, రినైజాన్స్ కాని, మత పునరుజ్జీవనంకాదు. హేతువాద మానవవాద ఉద్యమాలు ఊకదంపుడు సంస్కరణలతో సరిపెట్టుకోవు. ప్రగతి విరోధులు, పురోగతి నిరోధకులు రాజకీయ పార్టీల పేరుతో అధికార పీఠాలపై కొలువుదీరి అటు మతాలను, ఇటు భావదాస్యాన్ని పోషిస్తుంటే, దాన్ని నిషేధించండి, దీన్ని నిషేధించండి అంటూ వారిని అభ్యర్థించే ఉద్యమాలు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు ఎలా అవతాయి?"

"శాస్త్ర విజ్ఞానం గత మూడునాలుగు శతాబ్దాలుగా విపరీత వేగంతో పెరుగుతూ వస్తున్నది. దాన్ని అనుసరించి నూతన తాత్విక ధోరణి పాశ్చాత్య దేశాల్లో, ముఖ్యంగా యూరపులో కొత్త పుంతలు తొక్కింది. ఎంతోమంది జిజ్ఞాసువులు నూతన తాత్వికరీతులపై ఎన్నెన్నో గ్రంథాలు వెలయించారు. సెక్యులరిస్టు దృక్పథంతో నాస్తిక, హేతువాద, సోషలిస్టు, హ్యూమనిస్ట్ సాహిత్యం వెలుగు చూచింది. శాస్త్రవిజ్ఞాన ప్రయోజనం కోసం సాంకేతిక విజ్ఞానం (టెక్నాలజి) తోడుపడింది. మానవ జీవితానికి నిత్య ప్రయోజనం కోసం ఆ టెక్నాలజి నిత్యావసర వస్తువుల్ని తయారుచేసి మనుషుల జీవితాలను సుఖవంతం చేసింది."

"పాలనాధికారం నేటివరకు క్రమక్రమంగా ప్రజలకు దూరమవుతోంది. ఇప్పుడు దాన్ని పాలనాధికారుల స్వాధీనం నుంచి తప్పించి ప్రజలే తమ అధికారాన్ని తామే చలాయించుకుంటే తప్ప, ప్రజలు ప్రత్యక్ష నియంతృత్వాన్నో

(నరకాన్నీ), పరోక్ష నియంతృత్వాన్నీ అనుభవించక తప్పదు."

"మనుషుల్లో వివేకం పెరిగే విధంగా మన విద్యా విధానం వున్నప్పుడే మనుషులు మనుషులుగా ప్రవర్తించగలుగుతారు. అందుకు మనుషులకు సరి అయిన విద్యా సంస్కారం ఉండాలి. అందుకే Educate the Educators అని నినదించాడు ఎం.ఎన్.రాయ్."

"మనుషులు సంస్కారవంతులుగా మారాలి. అలా మారనీయని మత నాగరికతలో వారు యిరుక్కున్నారు. చట్టాలు వారిని మార్చలేవు. మనుషులు స్వతంత్రాలోచన పరులు కావాలి. మూఢాచారాల ఊబినుంచి వారు బయటపడగల స్వతంత్ర చింతనాపరులు కావాలి. అలా అయ్యేట్లు వారిని ఎద్యుకేట్ చేయాలి. ఎంతకాలం పట్టినా అదొక్కటే సాంస్కృతికోద్యమకారుల లక్ష్యం కావాలి. కేవలం ఊకదంపుడు ఉపన్యాసాల వల్ల ప్రయోజనం శూన్యం."

**మీటింగు హాలు - నిర్మాణ ప్రారంభం :**

ది. 25-10-2020న ఉదయం 10 గం॥లకు **నాగార్జున విశ్వవిద్యాలయం** విశ్రాంత రిజిస్ట్రార్ **రావెల సాంబశివరావు** రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు భవనంపైన **విశాలమైన మీటింగు హాలు** నిర్మాణాన్ని ప్రారంభించారు. ఉద్యమ మిత్రులను అభినందించి శుభాకాంక్షలు తెలిపారు. **రావిపూడి వెంకటాద్రి 100వ పుట్టినరోజును** ఘనంగా జరుపుతూ ఫిబ్రవరి 9, 2021న ఈ మీటింగు హాలును ప్రారంభిస్తున్నందుకు సంతోషాన్ని వ్యక్తం చేశారు. ఈ ప్రారంభ కార్యక్రమంలో భారత హేతువాద సంఘ అధ్యక్షులు **కుర్రా హనుమంతరావు**, ప్రధాన కార్యదర్శి **మేదూరి సత్యనారాయణ**, ట్రెజరర్ **షేక్ బాబు**, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ ప్రధాన కార్యదర్శి **కరి హరిబాబు**, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి **షేక్ దరియావలి**, అమరావతి హేతువాద సంఘ అధ్యక్షులు **రేజేటి వెంకటేశ్వర్లు**, ట్రెజరర్ **కళ్యాణం చంద్రశేఖర్**, గుంటూరుజిల్లా హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి **కరణం రవీంద్రబాబు**, ప్రకాశంజిల్లా హేతువాద సంఘ అధ్యక్షులు **కాకర్ల వెంకటేశ్వర్లు**, ప్రధాన కార్యదర్శి **కాకి రాజశేఖర్**, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ ట్రెజరర్ **నల్లమోతు రాధాకృష్ణ**, సంయుక్త కార్యదర్శి **తూమాటి హరిబాబు, డా॥ ఉస్మాన్ అలి**, ఇంకొల్లు పూర్వ ZPTC **వీరగంధం ఆంజనేయులు** తదితరులు పాల్గొన్నారు.

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లులోని రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ పైన **రావిపూడి వెంకటాద్రి మీటింగు హాలు** నిర్మాణంలో సెంటర్ సభ్యులు,

బాధ్యులు క్రియాశీలంగా పాల్గొన్నారు. మీటింగు హాలు నిర్మాణానికి దాతలు, ఉద్యమకర్తలు సహాయసహకారాలు అందించినందుకు కృతజ్ఞతలు తెలిపారు. ఈ సందర్భంగా మీటింగుహాలు నిర్మాణానికి ప్రధానదాతలుగా ముందుకువచ్చి సహకరించిన **అంబటి రత్తమ్మ మెమోరియల్ ట్రస్ట్, విశాఖపట్టణం** వారికి ప్రత్యేక అభినందనలు, కృతజ్ఞతలు తెలిపారు.

భారత హేతువాద సంఘం, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్‌ల కార్యాలయాల నిర్వహణకు వసతి, మహాసభలకు, అధ్యయన తరగతుల నిర్వహణకు, బహిరంగసభలకు తగు రీతిలో రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ సకల సౌకర్యాలతో రూపొందడంతో హేతువాద మానవవాద ఉద్యమ అభివృద్ధికి ఒక వనరు సమకూరింది.

2002 ఫిబ్రవరి నుంచి **రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు** నుంచే హేతువాది ప్రచురణ, పంపిణీలు నిర్వహించబడుతున్నాయి. సెంటర్ భవనంలో 'హేతువాది', 'రేషనలిస్ట్' పత్రికలు, పుస్తక ప్రచురణ కార్యకలాపాలు సమర్ధవంతంగా జరుగుతున్నాయి. రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రులు ఒక టీంగా పత్రిక నిర్వహణలో కృషి చేస్తున్నారు.

'హేతువాది' పత్రికకు నాలుగు దశాబ్దాలుగా యాజమాన్య ఎడిటర్ బాధ్యతలను నిర్వహిస్తున్న హేతువాద ఉద్యమ మార్గదర్శి **రావిపూడి వెంకటాద్రి** గారికి, ఉద్యమ మిత్రులకు **హేతువాది** పాఠకులకు, దాతలకు, ప్రకటన కర్తలకు, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రులకు అభినందనలు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం. ●

---

# నాలుగు దశాబ్దాల హేతువాది

- కుర్రా హనుమంతరావు

1982 సెప్టెంబరు సంచికతో ప్రారంభమైన హేతువాదికి అప్పుడే 40 యేండ్లు నిండి 41వ వసంతంలోకి అడుగిడుతోంది. ఈ సందర్భంగా రావిపూడికి, హేతువాది పాఠకులకు, ఉద్యమ అభిమానులకు శుభాకాంక్షలు. ప్రారంభంలో రావిపూడి సారధ్యంలో, కొన్నాళ్ళు తెనాలి కేంద్రంగా ముప్పాళ్ళ బసవ పున్నారావు సారధ్యంలో, కొన్నాళ్ళు చీరాలలోని వివేకా విద్యాలయం అంచా బాపారావు సారధ్యంలో, చివరకు ఇంకొల్లులోని రాడికల్ హ్యూమనిస్ట్ సెంటరుకు చేరింది. పత్రిక ఎక్కడున్నా పర్యవేక్షణ రావిపూడిదే. కాకపోతే మేనేజింగు ఎడిటర్లు మారతారు. నాటి నుండి నేటికి వెంకటాద్రిగారి భావాలకు, ఆయన మనోభావాలకు ప్రతీక హేతువాది. తన చేతిలో పత్రిక లేక 'రాడికల్ హ్యూమనిస్ట్' (తెనాలి) 'వికాసం', 'భారతి', 'చార్వాక పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాశారు. వెంకటాద్రిగారి 'హేతువాది'తో ఆ లోటుతీరి స్వంత పత్రిక, స్వంత రచనలుతోనే నేటికీ నడుస్తోంది. ఆయనే దాని యజమాని కూడా.

1982 సెప్టెంబరులో తన మానసపుత్రిక అరగేట్రం చేసింది. వ్యాసాలు వ్రాయటం, ప్రూపులు చూడటం, సరిచేయటం వంటివన్నీ ఆయన పనే. నేడు 101వ వసంతంలో ఉన్నా ఆయన ఈ పనిని కొనసాగిస్తున్నారు. అదే సమయంలో హేమా పబ్లికేషన్స్ పేరుతో ప్రెస్‌ను నడిపి దాదాపు ఆయన పుస్తకాలన్నీ అచ్చువేశారు. ఆయన వ్రాసిన వ్యాసం 6, 7 సార్లు చదివి, ప్రచురించేవారు. అదే ఆయన జ్ఞాపక శక్తికీ, జ్ఞానానికీ నిదర్శనం.

సృజన ఆయన సొంతం. సొంత పదాలు ఆయన సొంతం. 'హేతువాది' పత్రికను చదవటం కష్టంగా ఉందనీ, భాష చాలా కఠినంగా ఉందనీ, దానిని సులభంగా, అందరికీ అర్థమయ్యే భాషలో వ్రాయాలని చాలామంది కోరారు. భాషా కాఠిన్యాన్ని తగ్గిస్తే భావం పోతుందని, భావం లేని రచనలు ప్రమాదకరమని ఆయన విన్నవించి అదే బాణీలో, అదే ఒరవడిలో కొనసాగించారు. ఎక్కడా రాజీలేదు. తాననుకున్న రూపం వచ్చే వరకూ, తననుకున్న అర్థం మారకుండా వ్రాయటం ఆయన నైజం. ఆయన భావాలు ఎప్పుడూ ఒకే సరళరేఖలో ఉంటాయి. కారణం ఆయన అవగాహన. అవగాహన లేకపోతే వంకర టింకరగా ఉంటాయి. అది ఆయన తీరు.

'హేతువాది' కార్యకర్తల చేతి పుస్తకం. ప్రతి హేతువాదీ చదవాల్సిన విజ్ఞానం. అదొక భావధార. ఆ భావధారే నేటికి 40 యేండ్లు నిండి 41వ వసంతంలోకి అడుగిడుతోంది. రావిపూడి వ్యాసాన్ని చదివితే ఆయన విజ్ఞానమంతా మనకు కనిపిస్తుంది. అది ఆయన సొంతం. కవితా రమణీయత హేతువాది. తాత్విక, మేధోపరమైన భావాలకు నిలయం 'హేతువాది' : కార్యకర్తలను కలిపి, నడిపించి మానవవాద మార్గంలో సాగే భావధార. ఉద్యమానికి ఊపిరి హేతువాది.

హేతువు విశ్వక్రమంలోని లయే. హేతుత్వం విశ్వక్రమం యొక్క ప్రతిధ్వని. భౌతిక ప్రకృతి అంతా నియమబద్ధమైనది. ప్రకృతి నుంచి ఉద్భవించిన మనిషిలో ఆ నియమబద్ధత ప్రతిధ్వనించటం వలన అతడు వస్తుతః హేతుమంతుడవుతున్నాడు. శారీరక నిర్మాణరీత్యా జీవులన్నీ క్రమబద్ధమైన నిర్మాణం కలవే. లయబద్ధమైన శారీరక ప్రవృత్తి కలిగి ఉన్నవే. జీవుల దేహాలలోని ద్రవ్య ప్రవర్తన, ప్రతిక్రియలు, రక్తప్రసరణ, హృదయ స్పందన,. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు, శోషణ విసర్జితాలు, ఉష్ణోగ్రతలు, బాహ్య ప్రేరణకు ప్రతీకలు, ఉపచయ-అపచయ క్రియలు, జనన మరణాలు మొదలైన లక్షణాలన్నింటిలో జీవజాతుల మధ్య భిన్నత్వం ఉన్నప్పటికీ, ఏ జాతి జీవులకు, ఆ జాతి జీవుల్లో ఈ చర్యలన్నీ లయబద్ధంగానే, నియతిబద్ధంగానే జరుగుతుంటాయి.

ఆలోచనలోని క్రమబద్ధతను మనం హేతుత్వం, కారణమంటున్నాం. మనుషులలో హేతుత్వం ఒకటిగాగాక జ్ఞాన ప్రమాణం మీద ఆధారపడుతుంది. దిగువ జాతులలోది సహజాతరూపం. అవయవాల ఏర్పాటును బట్టే, వాటి శక్తి సామర్థ్యాలను బట్టే వాటి ప్రవర్తన ఉంటుంది. విశ్వమంతా క్రమబద్ధంగానే ఉంది, క్రమబద్ధంగానే ప్రవర్తిస్తున్నది, పరిణమిస్తున్నది. విశ్వం గజిబిజిగా ఉండే గందరగోళంకాదు. జీవ ప్రకృతిలోనూ, నిర్జీవ ప్రవృత్తిలోనూ క్రమం ఉంది. మనం భూమిమీద జీవిస్తున్నాం. దాని గురుత్వశక్తికి బద్ధులమై ప్రవర్తిస్తున్నాం.

'అలా' జరుగుతున్న క్రమం యొక్క ముద్ర మనుషులమీద పడటం వలనే వస్తువులకూ, వాటి సంబంధాన్ని ఉన్నది ఉన్నట్లు గ్రహిస్తున్నాం. దానినే 'జ్ఞాన' మంటున్నాం. వస్తువుల రూపేణా జ్ఞానం బయలుదేరుతుంది. కాని మన 'జ్ఞానం' వలన వస్తువులకు అస్థిత్వం ఏర్పడదు. ప్రకృతి నియమబద్ధం

కాకపోతే, కార్యాకారణ నియమాన్ని అనుసరించకపోతే, ఇవి మన జ్ఞాన పరిధిలోకే రావు. ఫలానా కారణం వలన, ఫలానా ఫలితమొస్తుందని తెలుసుకుంటున్నాం. అదే హేతుత్వం ప్రాథమిక దశలో సహజ వివేకం, ఇంగిత జ్ఞానం. జ్ఞానం హేతువికాసానికీ, హేతుత్వం ఇతోధిక జ్ఞానాభివృద్ధికీ పరస్పరం తోడ్పడతాయి. జ్ఞాన సారమే సత్యమంటే. ఎందుకంటే సత్యమంటే జ్ఞాన విషయమే. 'Truth is the content of knowledge' అనేది దీని అవగాహనే. జ్ఞానం లేకుంటే సత్యమే ఉండదు. ఏదో ఒక దానిని సత్యంగా ప్రమాణీకరించాడు అదిమ మానవుడు.

సత్యం స్వేచ్ఛకు దారితీస్తుంది. హేతుత్వం, జ్ఞానం, సత్యం, స్వేచ్ఛ అనేవి ఒక మార్గంలో సాగి 'నీతికి' దారితీస్తాయి. విశ్వం వాస్తవం, విశ్వంలోని మనం వాస్తవం, మన అనుభూతి వాస్తవం, మన జ్ఞానం వాస్తవం. ఇందులో అభౌతిక, అధి భౌతిక అంశాల ప్రస్తావనే ఉండదు. మనిషి జీవించటమంటేనే 'జ్ఞానించటం'. ఒకసారి ఏర్పడిన జ్ఞాన చిత్రాలు, భావ వస్తువులుగా మారిపోతాయి. మన పంచేంద్రియాలు ప్రత్యక్షంగా గ్రహించకపోయినా దానిని మనస్సు కలిగిస్తుంది. దానినే స్మృతి జ్ఞానమంటాం.

అతీంద్రియ జ్ఞానం కాల్పనికం. దాని పేరుతో పిలిచే జ్ఞానమంతా అంతకుముందు ఆర్జించిన వస్తుజ్ఞానం నుండి బయలుదేరుతుంది. జ్ఞానం ఇంద్రియాతీతంగాని, స్వచ్ఛందంగా ఏర్పడే వీలులేదు. ఆలోచనకు సరిపడే జ్ఞానముండాలి. ప్రతి సంఘటనా తన పంచేంద్రియాలకు ప్రత్యక్షంగా గోచరించాలని ఏ హేతువాదీ అనడు. అంగీకృత ప్రయోగం ద్వారా, పునఃపరిశీలన చేసుకొని ధృవపరచుకుంటాడు. విశ్వం దైవంలాగా భావనకాదు. యదార్థం వాస్తవం. విశ్వం యొక్క అనాదిత్వాన్ని ప్రశ్నించటమే తప్పు.

హేతువంతుడు కానివాడు నీతివంతుడు కాలేడు. నీతి సామాజిక ప్రవర్తనకు సంబంధించినది. సమాజంలో, దైవభయం లేకుండా అవినీతికరంగా ప్రవర్తిస్తే దాని ప్రభావం ఆ వ్యక్తి మీద ఎలా బెడిసి కొడుతుందో హేతువాది అర్థం చేసుకోగలడు. నీతి మానవికం. మనుషులతో నిర్మించబడేది. పరాధీన భావాన్ని, న్యూనతా భావాన్ని తొలగించి మనిషిని పరిపూర్ణుని చేస్తుంది. హేతువాదం సాధనమేగాని, లక్ష్యం కాదు. హేతువాదం విధానమేగాని, సిద్ధాంతం కాదు. హేతువాదమంటే హేతుత్వాన్ని అన్వయించే ఆలోచనా పద్ధతి. హేతువుని సాధనంగా చేసుకొని తాత్విక నిర్ణయాలు తీసుకునే విధానాన్నే హేతుబద్ధ

వైఖరి అంటాం. ఆ నిర్ణయాలను హేతుబద్ధంగా అమలు చేసే రీతినే నీతి అంటాం. శాస్త్ర పద్ధతిలో మానవుడు పెంపొందింప చేసుకున్న లక్ష్యాల నిర్ణయంతో, పద్ధతులతో హేతుబద్ధంగా వినియోగించేదే హేతువాద పద్ధతి.

ఏసుకీ-శంకరునికీ సామ్యం ఉంది. ఒకరు అధవకీ వేరొకడు విధవకీ పుట్టారు. శంకరుడు హైందవాన్ని పునరుజ్జీవన బాటలో నడిపాడు. ఆయన సాంఘిక విప్లవ విరోధి మాత్రమే కాదు, తాత్విక విధ్వంసకుడు. యెహోవాకు పెండ్లాం లేదు. ఏసుకు పెండ్లేలేదు. ఎలా సృష్టించారో ఈ విశ్వాన్ని. అల్లాకు పెండ్లామేలేదు. శంకరుని భౌతిక నాస్తివాదం తిరగ త్రిప్పిన భౌతికవాదమే. శంకరుని మాయావాదమంతా 'మాయే'. ఎవ్వరికీ అర్ధంకాదు.

హేతువాద లక్ష్యం మానవవాదం. మానవవాదమంటేనే మనిషికి ప్రాధాన్యత నిచ్చేది. 'దేవుడులేడు' అనేది 'మనిషి ఉన్నాడనేందుకే'. మనిషికి ప్రధమస్థానం కల్పించేది. మనిషిని ప్రధముని చేసి, అతని భవితవ్యానికి అతనినే కర్తగా గుర్తించేది. మానవవాదం మనిషిని ప్రకృతికీ అతీతంగా భావించటం లేదు. మనిషి ప్రకృతికి అన్యమైనవాడు కాదు. మనిషి ప్రకృతిలోనివాడే. అందుకే అతను ప్రాయికంగా హేతువాది-మానవవాది. ప్రకృతిలోని నియతి మనిషిని స్వేచ్ఛాపరుని చేసింది. అతని ప్రతి చేష్టా నియతమై ఉంటుంది కాని ప్రతిచేష్టకూ కార్యకారణముండదు. మనిషి ప్రవర్తన, ఆలోచన, సమాజం, చరిత్ర అంతా నియతమే.

మానవవాదం స్వేచ్ఛావాదం. స్వేచ్ఛ మానవజీవన తత్వసారం. స్వేచ్ఛా సాధన క్రమంలో మనిషి తన చరిత్రను తాను సృష్టించుకున్నాడు. మనిషి సమాజంలో భాగం. వైయక్తిక మనుషులు లేకుండా సమాజం లేదు. సమాజ ఆవిష్కరణ మనిషి హేతుత్వానికి నిదర్శనం. మనిషి జ్ఞాన తృష్ణతో, స్వేచ్ఛాపిపాసతో ఏది చేసినా అదంతా మనిషి కోసమే. మనిషి దేవుని సృష్టించిందీ అందుకే. నేడు ఆ దైవభావాన్ని తొలగిస్తుందీ అందుకే. విశ్వానికి ప్రయోజనంలేదు. మానవుని రాకతో దానికి విలువ ఏర్పడినది. వస్తువులో ఉన్న విలువను మనం ప్రయోజనానికి వినియోగిస్తాం. అందుకే 'విశ్వంలో మానవుని కోసం ఏదీ లేదు, ఉన్న దానిలో ప్రయోజనం లేకపోలేదు'. మనిషికి జ్ఞానం ఆర్జితమే. సంచిత జ్ఞాన పోగే మన జ్ఞానమంతా.

మానవవాదం ఒకనాటిది కాదు. మనిషి ఉద్భవం నుంచీ ఉంది. మనిషి సృజనాత్మక శక్తి కొద్దీ, ప్రయోజనాత్మక సమాజాన్ని సృష్టించి, తరతరాల

తాత్వికుల వద్ద నుండీ, మంచి భవిష్యత్ కోసం కృషి చేసే ఆశావరకు మానవవాదం కనిపిస్తూనే ఉంది. మానవుడికి తన జీవితం పట్ల ఉద్వేగం, అతనిలోని వివేకం తన నడతను హేతుబద్ధం చేస్తుంది. అతడికతడే ప్రమాణం. మనిషి తనమీద తనకు నమ్మకముంచటమే మానవవాదం. అందుకే మానవుడే సమాజానికి నమూనా.

వ్యక్తులు లేకుండా సమాజంలేదు. సహకార, సామాజిక సంబంధాలు వ్యక్తిలోని అంతర్గత శక్తులు వికసించటానికి తోడ్పడతాయి. సమిష్టి సౌష్టవం, వ్యక్తుల సుఖజీవన వ్యాపారమేగాని మతం, కులం, జాతి అనే భావాలతో వ్యక్తులు బలవుతున్నారు. సహకారం వ్యక్తుల సామర్థ్యాన్ని పెంచుతుంది. సమిష్టి అహం సామర్థ్యాన్ని అణచివేస్తుంది. అందుకే సమాజంలో సహకారపూర్వక సంబంధాలతో నిర్మితి కావాలేగాని సమిష్టివాదం తలెత్తటమే మానవ హననానికి దారి తీస్తుంది.

మానవవాదం మూసపోసిన సిద్ధాంతం కాదు. అది వితండవాదం, పిడివాదం కాదు. అదొక జీవన విధానం. మనిషి పుట్టుకతోనే మానవవాదమూ వచ్చింది. మానవవాదం, మానవతా వాదం వేరు. మానవతా వాదమంటే హ్యూమేరిటేరియనిజం. మానవవాదమంటే హ్యూమనిజం. మొదటిది 'హ్యమేన్' రెండవది 'హ్యూమన్'. దయా దాక్షిణ్యాలు, కారుణ్యం ప్రదర్శించే లక్షణాన్ని మానవతా వాదమంటారు. మానవవాదం అక్కడికే పరిమితంకాక చాలా విస్తారమైనది. మనిషి తన భవితవ్యాన్ని తానే నిర్మించుకోగలడనీ, మానవుడే మానవజాతికి మూలమనే, మానవ చరిత్రకు మానవుడే కర్త అనే, ప్రమేయాలతో సాగే ఇది మనిషిని పరాధీనునిగా భావించటం మానవవాద విరుద్ధం. అదొక తాత్విక ధోరణి, నిత్యజీవితంలోని దార్శనిక వైఖరి. నిత్యం పరిణామం చెందుతున్న జ్ఞానంతో విడదీయరాని సంబంధం కలది. జీవితాన్ని శాస్త్ర జ్ఞాన నీడలో తులనాత్మకంగా నడుపుకోగల మానవవాద మార్గం వైజ్ఞానిక కసరత్తు కాదు.

1948లోనే మానవవాద ఉద్యమాన్ని ప్రారంభించి, ప్రపంచ హ్యూమనిస్ట్ సంస్థలను, మేధావులను సమీకరించి, 1952లోనే I.H.E.U.లో భాగం పంచుకున్న యం.యన్.రాయ్ సమకాలీన సమస్యలకు హ్యూమనిజమే పరిష్కారమన్నాడు. మానవుడు లేకున్నా, అతను అర్థం చేసుకోకున్నా ప్రకృతి క్రమం జరిగేదే. ప్రకృతీ, నియమబద్ధత అలాగే కొనసాగేవి. కొలంబస్ కనుగొనకపోయినా భూమి సూర్యుని చుట్టూనే తిరుగుతుంది. న్యూటన్

భూఆకర్షణ సిద్ధాంతాన్ని కనుగొనకపోయినా చెట్టు నుండి రాలిన పండు క్రింద పడుతూనే ఉంటుంది. అంటే మన భావాలతో సంబంధం లేకుండా ప్రకృతి నియతి ప్రకారం జరిగేవే, వాటిని కనుగొనటమే మానవజ్ఞానం.

ప్రకృతిలో భాగమైన మనిషి స్వభావం కూడా ప్రకృతి స్వభావాన్ని అనుసరించే ఉంటుంది. ప్రకృతిలోని క్రమబద్ధత, కార్యకారణ సంబంధం మనిషిలో ప్రతిబింబిస్తుంది. అదే మనిషి హేతుత్వం. అందుకే మానవుడు ప్రాయికంగా హేతువాది. వస్తుతః హేతువాది. వస్తుతః హేతువాది అంటే తత్వరీత్యా హేతువాదిగా ఉండగలని. అందుకే మనిషి అవినీతిపరునిగా ప్రవర్తించటానికి అతని హేతుత్వ వైపరీత్యంలోనూ, అపరిపక్వ ఆలోచనలోనూ, అతని బహుముఖ అస్థిత్వంలోనూ జీవితాంశాలలోనూ చూడవచ్చు.

మనిషి తన స్వేచ్ఛాపిపాసను తీర్చుకోవటం కోసం, హేతువాదాన్ని సాధనంగా తీసుకొని పరిసరాలతో పోరాడతాడు. సాంఘిక వ్యవస్థ కూడా పరిసరాలే. 'స్వయం సంపూర్ణ మానవులైన వ్యక్తులలోని శక్తుల పరిపూర్ణ వికాసానికి, అడ్డుతగిలే ప్రతిబంధకాలన్నీ క్రమంగా అదృశ్యమైపోతాయి. స్వేచ్ఛ అంటే రాజకీయ-ఆర్థిక స్వేచ్ఛ కాదు. వైజ్ఞానిక, నైతిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో మనిషి అనంతశక్తులు వికసించటమే. స్వేచ్ఛ సాధనం కాదు. అదొక పిపాస. ప్రకృతి సహజమైన పిపాస.

మానవవాదం జాతి, మత, వర్గ, సమిష్టి వ్యవస్థల ప్రమాణంగా స్వేచ్ఛకు మదింపు చేయదు. ఏ సమిష్టి భావం కూడా మానవ శ్రేయస్సును, మానవుని ప్రమాణంగా తీసుకోదు. మానవ విలువలకు మానవుడే ప్రమాణం. స్వేచ్ఛ అంటే వైయక్తిక స్వేచ్ఛే. ఇందులో మైనారిటీ, మెజారిటీ భావాలే ఉండవు. రెంటిలో ఉన్నదీ మనుషులే. మానవవాదం చెప్పేది బాధ్యతారహిత విశృంఖల స్వేచ్ఛకాదు. వ్యక్తి స్వేచ్ఛ పైన నిర్బంధాలను సాధ్యమయినంత తక్కువ స్థాయికి కుదించాలి.

సమాజం, రాజ్యం కంటే మనిషి ముందున్నాడు. అది మానవ సృజనే. జీవ పరిణామ దశలో మానవుడు వ్యక్తిగానే పోరాటం ప్రారంభించాడు. నేడు సత్యాన్వేషణ, జ్ఞానాన్వేషణ వ్యక్తిగానే చేస్తున్నాడు. దానికి సామాజిక, సహకార సంబంధాలు దోహదం చేశాయి. వ్యక్తుల కూటమిగా మానవ స్వేచ్ఛా వికాసానికి సమాజం బయలుదేరింది. మానవవాదం అరాజకంకాదు. రాజ్యాన్ని వద్దు అనదు. సమిష్టి పేరుతో వ్యక్తి స్వేచ్ఛను హరించదు. సమాజ నిర్మాణ లక్ష్యం స్వేచ్ఛ కాబట్టి, వ్యక్తులు సామాజిక నిర్బంధం కానక్కరలేదు. సమాజం వ్యక్తి

స్వేచ్ఛ, సామాజిక బాధ్యతలకు విరుద్ధం కాదు. సమాజానికీ, రాజ్యానికీ తేడా లేని విధంగా సమాజం పెరగాలనీ, రాజ్యం సమాజ స్థాయికి దిగి రావాలనేది మానవవాద ఆదర్శం.

మానవవాదం ఈనాటిదికాదు. మానవ తత్వమెంత ప్రాచీనమో మానవవాదం అంత ప్రాచీనం. ప్రొటగోరస్ నుండి యెరాస్మస్, ఎపిక్యూరియన్ల నుండి చార్వాకుల వరకందరూ మానవవాదులే. సోఫిస్టులూ, స్టోయిక్కులూ, బౌద్ధులు, కన్ఫ్యూషియన్లు, మానవవాద ఛాయకలవారే. మనిషి మీద ఏ ఆధిపత్యాన్ని అంగీకరించక, స్వయం సత్తాకతనూ, సర్వాధిపత్యాన్నీ గుర్తించేది మానవవాదం. నవ్యమానవవాదం సమగ్ర తత్వం. అందుకే రాడికల్, న్యూ, ఇంటిగ్రల్, సైంటిఫిక్ అనే పదాలు వాడాడు.

హ్యూమనిజం డైలెక్టికల్, థియోసెంట్రిక్ కాదు. మనిషి తన భవితవ్యాన్ని తానే నిర్మించగలడనే నమ్మకం, మానవ శ్రేయస్సుకు మానవుని కేంద్రంగా తీసుకోవటం, మానవవాదానికి మూలసూత్రం. హిందూ, క్రిష్టియన్, ఇస్లాం, సోషలిస్ట్ మానవవాదాలు మనిషి సర్వ సత్తాకతను, సర్వ సహాధికారాన్ని గుర్తించవు. ఆధునిక శాస్త్రం ప్రకారం భౌతికవాదమొక్కటే సమగ్రతత్వం. వస్తువు, వాస్తవం అనే మాటల అర్థాన్ని స్పష్టం చేయాలి. వస్తు సంబంధమైనవన్నీ వస్తువులో భాగాలే. వస్తువు లేకుండా భావం లేదు. అందుకే భావమూ వస్తువే.

ప్రకృతిలోని వివిధ వస్తువుల ప్రవర్తనా వైవిధ్యం మన గమనికలో ఏవిధంగా రూపం దాల్చుతుందో దానిని నియమం అంటాము. వివిధ వస్తువుల ప్రవర్తనా విధానాలు మన అవగాహనలో నియమాలుగా పరిణమిస్తాయి. విశ్వ అవగాహన అంటే నియమ అవగాహనే. కార్యకారణాలకు మూలం ఒక్కటే. మూలం పరివర్తనలో ఉంది. పరిణతిలేని ఉనికి లేదు. రెండు సంఘటనలను విడగొట్టి మొదటిది కార్యంగానూ, రెండవది కారణంగానూ చెప్పుకొంటున్నాం.

ఇదీ హేతువాది భావధార. సిద్ధాంత పటిష్టత దాని సొంతం. వివేచన అదుపులో ఉగ్వేగభరితం దాని నైజం. హేతువాది అంటే వెంకటాద్రి, వెంకటాద్రి అంటే హేతువాది. ఆయన భావాల క్రియారూపమే హేతువాది. ఆయన రచనలు 90 హేతువాదిలో ముద్రణ, పునఃముద్రణ పొందాయి. ఆయన హేతువాదులను, మానవవాదులను తయారు చేసే కర్మాగారం. 'హేతువాది' 41వ వసంతంలోకి అడుగిడుతున్న సందర్భంగా 'హేతువాది'కీ, ఉద్యమకారులకూ, చందాదారులకు శుభాకాంక్షలతో.

●

# భారతీయ తత్వ దర్శనం
# 7. బౌద్ధం

- డా॥ గుమ్మా వీరన్న

**(గత సంచిక తరువాయి)**

జ్ఞానోదయం అయ్యేనాటికి బుద్ధుడి వయసు ముప్పయి అయిదు సంవత్సరాలు. జ్ఞానోదయానికి పూర్వమే బుద్ధుడు అనేకమంది వేదమత గురువులను, వేదరుషులను కలిసి అనేక విషయాల గురించి చర్చించాడు. వారి భావాలను తెలుసుకున్నాడు.

అదే విధంగా ఉపనిషత్తుల్లోని తాత్విక భావాలను కూడా తెలుసుకున్నాడు. అన్ని సిద్ధాంతాల్లోకి బుద్ధుడిని బాగా ఆకర్షించింది కపిలుని సాంఖ్య సిద్ధాంతం.

ఏ కాలం నాటి తత్వవేత్తగాని, శాస్త్రవేత్తగాని అంతకుముందున్న సిద్ధాంతాలను, తత్వాలను పరిశీలించి, వాటిలో తమకు నచ్చిన వాటిని స్వీకరించడం, నచ్చని వాటిని తిరస్కరించడం సహజమే. అదే విధంగా బుద్ధుడు కూడా తనకు ముందున్న అన్ని రకాల సిద్ధాంతాలను పరిశీలించి అందులో హేతుబద్ధంగా, వున్న వాటిని, సమంజసంగా వున్న వాటిని స్వీకరించాడు. అసంబద్ధమైన వాటిని, అహేతుకమైన వాటిని తిరస్కరించారు.

వేదాలు, బ్రాహ్మణాలు రూపొందిన సామాజిక విధానానికి చాతుర్వర్ణ వ్యవస్థ అని పేరు. ఆ విధానంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్గాల ఏర్పాటు మొదటిది. నాలుగు వర్ణాలమధ్య సాంఘిక సమానత్వం వుండరాదనేది రెండవ నిబంధన. దీని ప్రకారం వర్ణవ్యవస్థ నిచ్చెన మెట్లవలె ఒకదానికంటె మరొకవర్ణం పై స్థాయిలో ఉంటుంది. ఈ చాతుర్వర్ణ వ్యవస్థ వృత్తి విభజన మూడవది. జ్ఞాన సముపార్జన, శాస్త్రబోధన, మత విధులను నిర్వహించడం బ్రాహ్మణుల వృత్తి. యుద్ధాలు చేయడం, పాలించడం క్షత్రియుల వృత్తి. వ్యాపారం వైశ్యుల వృత్తి. పై మూడు వర్ణాల వారికి సేవలు చేయడం శూద్రుల వృత్తి. ఏ వర్ణం వారు ఆ వృత్తినే నిర్వర్తించాలి. ఎలాంటి పరిస్థితులలోనూ ఒక వర్ణం వారు మరో వర్ణవృత్తిని చేపట్టరాదు. శాస్త్ర అధ్యయనానికి సంబంధించినది

నాలుగవది. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మాత్రమే శాస్త్ర అధ్యయనానికి అర్హులు. విద్య నేర్చుకునే హక్కు శూద్రులకు ఎంతమాత్రం లేదు. అయితే ఈ హక్కు శూద్రులకు కాక, పై మూడు కులాలలోని స్త్రీలకు కూడా నిషిద్ధమే.

దైవికంగా ఏర్పాటయింది అని చెప్పబడే వర్ణవ్యవస్థ వాస్తవానికి బ్రాహ్మణులు ఎంతో నేర్పుగా ఏర్పాటు చేసిందే.

వేదాలను ప్రశ్నించడానికి వీలులేదు అనడం అంటే ఆలోచనా స్వేచ్ఛను అరికట్టడమే అవుతుంది. ఆ కారణంగా వేదాలు దోషరహితాలని చెప్పడం చాలా హాస్యాస్పదమవుతుందని బుద్ధుడు భావించాడు. అందుకే బుద్ధుడు వాటన్నిటినీ తిరస్కరించాడు. అదే విధంగా ఉపనిషత్తులు ప్రతిపాదించిన ఆత్మవాదాన్ని, పునర్జన్మ వాదాన్ని, కర్మ సిద్ధాంతాన్ని బుద్ధుడు తిరస్కరించాడు.

ప్రాచీన భారతీయ తత్వవేత్తలాదరిలోకి కపిలుడు సుప్రసిద్ధుడు. ఏదో ఒక అతీతశక్తిచేత సమస్త జగత్తు ఏర్పడిందన్న వాదాన్ని కపిలుడు త్రోసిపుచ్చాడు. కుండ తయారుకాక మునుపే మట్టి వున్నట్లుగా, బట్ట తయారు కాక మునుపే దారం వున్నట్లుగా, జీవరాశులు ఏర్పడక పూర్వమే అందుకు కారణమైన మూల పదార్థం వుండితీరాలి కదా అనేది అతని అభిప్రాయం.

ఆ విధంగా కపిలుడు మొదటిసారిగా సృష్టి గురించి, సృష్టికర్త గురించి తాత్వికమైన, తార్కికమైన ప్రశ్నలను లేవదీశాడు. బుద్ధుడు కపిలుని సాంఖ్య సిద్ధాంతం నుండి మూడు ప్రధానమైన అంశాలను స్వీకరించినట్లు తెలుస్తోంది. దేనినైనా వాస్తవమని నమ్మేందుకు రుజువు వుండాలి అన్నది మొదటి అంశం. హేతుబద్ధమైన ఆలోచన వున్నప్పుడే వాస్తవాన్ని గుర్తించడం సాధ్యమవుతుంది. దేవుడనే వాడు ఒకడున్నాడనడానికి హేతుబద్ధమైన ఆధారం ఏదీలేదు. సమస్త సృష్టికి దేవుడే కారణం అని చెప్పడానికి ఎలాంటి ఆధారం లేదన్న కపిలుని వాదనను బుద్ధుడు అంగీకరించాడు. ఇది రెండవ అంశం. ప్రపంచంలో పీడన అంటే దుఃఖం వుందన్న కపిలుని వాదాన్ని బుద్ధుడు అంగీకరించాడు. ఇది మూడవ అంశం. కపిలుని సిద్ధాంతంలోని ఇతర అంశాలను బుద్ధుడు తిరస్కరించాడు.

బుద్ధుడు సన్యాసం స్వీకరించే నాటికి దేశంలో గొప్ప తాత్విక చింతన కొనసాగుతూ వుండేది. బ్రాహ్మణ సిద్ధాంతాలతో పాటు వాటిని వ్యతిరేకించే అరవై రెండు సిద్ధాంతాలు ప్రచారంలో వున్నట్లు తెలుస్తోంది. అటువంటి బ్రాహ్మణ వ్యతిరేక సిద్ధాంతాలలో ప్రధానమైనవి ఆరు. అవి పూర్ణకాశ్యపుని అక్రియావాదం;

మక్కలి గోశాలుని నియతివాదం, అజితకేశకంబళుని ఉచ్ఛేదవాదం, పకుధ కాత్యాయకుని అన్యోన్యవాదం, సంజయవేలయపుత్తుజం విచ్ఛేదవాదం, వర్ధమాన మహావీరుడి చాతుర్యమ వాదం.

బుద్ధుడు ఈ తత్వాలనన్నిటినీ క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. కానీ దేనినీ ఆమోదించలేదు. ఆ తత్వాలన్నీ అనాలోచితమైనవని, నిరుపయోగమైనవని, బాధలలో కూరుకుపోయిన వారికి ఏ విధంగానూ ఉపయోగడవని బుద్ధుడు భావించాడు. అందుకే వాటన్నిటిని పక్కున పెట్టేశాడు.

జ్ఞానోదయం సందర్భంగా బుద్ధుడు కనిపెట్టిన నాలుగు సత్యాలను చతురార్య సత్యాలని బౌద్ధ సాంప్రదాయం పేర్కొంటుంది. ఆ నాలుగు సత్యాలివి : దుఃఖం, దుఃఖకారణం, దుఃఖనిరోధం, దుఃఖ నిరోధమార్గం.

లోకమంతా దుఃఖమయంగా వుంది. జన్మదుఃఖం, వార్ధక్యం దుఃఖం, రోగం దుఃఖం, మరణం దుఃఖం. అప్రియమైన వాటితో కలవడం దుఃఖం, ప్రియమైన వాటి నుండి విడిపోవడం దుఃఖం, కోరుకున్నవి లభించకపోవడం దుఃఖం, ఇది మొదటి కారణం.

దుఃఖానికి కారణం వుంది. అదే తృష్ణ ఇది రెండవ సత్యం. దుఃఖనిరోధం సాధ్యమవుతుంది. ఇది మూడవ సత్యం. దుఃఖనిరోధానికి మార్గం వుంది. అదే అష్టాంగమార్గం. ఇది నాలుగవ సత్యం.

మానవుని సకల కార్యకలాపాలకు అతని మనస్సే కేంద్రస్థానమనేది బుద్ధుని బోధనలో మొదటిసారిగా స్పష్టం చేయబడింది. బుద్ధుడికి ముందున్న తాత్వికులు చెప్పని నూతన విషయమిది.

మన ఆలోచనలు, సంకల్పాలు, నిర్ణయాలు అన్నీ మనసు నుండే ప్రారంభమవుతాయి. మనం చేసే ప్రతి చర్య మొదట మనసుకు తెలుస్తుంది. మనసే ఆ చర్యలను నిర్ణయించి శాసిస్తుంది.

మన పరిజ్ఞానం మనస్సు యొక్క గ్రహణశక్తిపై ఆధారపడి వుంటుంది. అందుచేత మొదట అందరికీ మానసిక సాధన అవసరమవుతుంది. ఎటువంటి పరిస్థితులలోనూ చెడు ఆలోచనలకు తావివ్వరాదు, చెడు కార్యాలను చేయరాదు అనేది బుద్ధుని ప్రధాన సిద్ధాంతాలలో ఒకటి. వాస్తవమైన ధర్మం ధార్మిక గ్రంథాలలో వుండదని, ధార్మిక జీవనంలో వుంటుందని బుద్ధుడు స్పష్టం చేశాడు.

జ్ఞానోదయమైన పిదప బుద్ధుడికి ఒక సందిగ్ధావస్థ ఏర్పడింది. తాను

అన్వేషించి తెలుసుకున్న నూతన సత్యాన్ని, నూతన ధర్మాన్ని, నూతన మార్గాన్ని ప్రజలకు ప్రబోధించాలా లేక తనవరకే పరిమితం చేసుకోవాలా అన్నదే ఆ ధర్మసందేహం.

సామాన్య ప్రజానీకానికి ఈ ధర్మం అంత సులభంగా అర్థం కాజాలదు. ఎంతో సూక్ష్మ రూపంలో గల ఈ ధర్మం మేధావులకే అర్థం కావడం కష్టం. ఇక దేవుడు, ఆత్మ, పూర్వజన్మ, పునర్జన్మ, కర్మ సిద్ధాంతం వంటి మూఢవిశ్వాసాలలో మునిగిపోయిన ప్రజలకు ఈ నూతన ధర్మాన్ని, నూతన మార్గాన్ని అలవర్చుకోమని చెప్పి ఒప్పించడం చాలా కష్టం. ఈ విధంగా చాలా మథనపడ్డాడు బుద్ధుడు. చివరికి ప్రపంచమంతా దుఃఖంలో మునిగి వుండగా, తాను సన్యసించి చేతులు ముడుచుకొని కూర్చోవడం, పరిస్థితిని యథాతథంగా వదిలివేయడం భావ్యంకాదని భావించాడు. ప్రపంచం మీద ఆధారపడి జీవిస్తూ ప్రపంచాన్ని వదిలివేయడం సరైనది కాదని తీర్మానించుకున్నాడు. ప్రపంచంలో వీలయినంత మేరకు మార్పు తెచ్చి, దాన్ని మునుపటికంటె సుఖవంతమైనదిగా, మెరుగైనదిగా చేయడమే తన కర్తవ్యంగా భావించాడు. సంఘర్షణలతో, విషాదంతో నిండిన ప్రపంచంలో తన నూతన ధర్మం ద్వారా మార్పు తేవడానికై కృషి చేయడమే తన బాధ్యతగా గుర్తించి బయలుదేరాడు.

**బుద్ధుని తాత్విక చింతన**

జ్ఞానోదయానంతరం బుద్ధుడు తన నూతన ధర్మాన్ని ప్రచారం చేయడానికి బయలుదేరాడు. తన నూతన ధర్మాన్ని మొట్టమొదట తాను విద్య నేర్చుకున్న గురువుగారైన ఆలారకాలామునికి తెలియజేద్దామనుకున్నాడు. అయితే అప్పటికే ఆలారకాలముడు మరణించినట్లు తెలుసుకున్నాడు.

తరువాత తాను విద్యనేర్చుకున్న గురువైన ఉద్ధక రామపుత్రుడికి తన నూతన ధర్మాన్ని తెలపాలనుకున్నాడు. అయితే అప్పటికే ఆయన కూడా చనిపోయినట్లు తెలుసుకున్నాడు.

తరువాత తనతోపాటు ధ్యానసాధన చేస్తూ, తాను ఒక దశలో తిరిగి ఆహారం తీసుకోవడం వల్ల ఆగ్రహించి తనను వీడి వెళ్లిపోయినటువంటి ఐదుగురు పరివ్రాజకుల గురించి ఆలోచించాడు. వారు సారనాథ వద్ద గల ఋషి పట్టణంలోని జింకల వనంలో ఉన్నారని తెలుసుకొని, వారిని కలుసుకోడానికి బయలుదేరాడు.

బుద్ధుని ఆగమనాన్ని చూసిన ఐదుగురు పరివ్రాజకులు అతనిని

ఎలాంటి స్వాగతం పలుకరాదని, ఎలాంటి సపరచర్యలు చేయరాదని నిర్ణయించుకున్నారు. తీరా బుద్ధుడు వారిని సమీపించగానే తమ నిర్ణయాన్ని విస్మరించి అందరూ ఒక్కసారిగా లేచి నిలబడ్డారు. బుద్ధుడిని సాదరంగా ఆహ్వానించి సపర్యలు చేశారు. బుద్ధుడు వారికి తన మొదటి ధర్మోపదేశాన్ని చేశాడు. దాన్నే బౌద్ధ సాంప్రదాయంలో 'ధర్మ చక్ర ప్రవర్తన' అంటారు. ఆ రోజు ఆషాడపౌర్ణిమ. అప్పటి నుండి ప్రతి సంవత్సరం ఆషాడపూర్ణిమ దినాన్ని ధర్మచక్ర పరివర్తన దినంగా బౌద్ధులు బుద్ధుని బోధనలను వివరించే కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

బుద్ధుడి మొదటి ధర్మోపదేశాన్ని విన్న ఐదుగురు పరివ్రాజకులు కొండయ, బద్దియ, వప్ప, మహానామ, అస్సాజి. వారికి బుద్ధుడు చతురార్య సత్యాలను, ఆర్య అష్టాంగ మార్గాన్ని వివరించాడు. ఆ ఐదుగురిని పంచవర్గీయులు అంటారు. వారికి బుద్ధుడు విముక్తి కోసం సరైన మధ్యమ మార్గాన్ని, ఇలా బోధించాడు.

"మాంసాహారాన్ని మానెయ్యటం, నగ్నంగా తిరగటం, జడలు పెంచుకోవటం లేదా గుండు గొరిగించుకోవటం, చిరిగిన మాసిన బట్టలు ధరించటం, శరీరం నిండా మురికి పూసుకోవటం లేదా అగ్నికి ఆహుతవటం అనేవి అవిద్యతో నిండిన మనిషి మనసును శుద్ధి చేయలేవు."

"వేదాలు వల్లెవేస్తేనో లేదా దేవతలకు బలులివ్వటం వల్లనో, తరచుగా ఉపవాసాలుండటం వల్లనో లేదా నేలపై పడుకోవటం వల్లనో, నిశరాత్రి జాగరణ వల్లనో, నిరంతరం భజనలు చేయటం వల్లనో దుష్ప్రవర్తన కలిగిన మనిషి పవిత్రుడు కాలేదు.'

'పూజారులకు కానుకలివ్వటం వల్ల లేదా ఆచారాలను పాటించటం వల్ల కోరికలకు బానిసైన వ్యక్తి పునీతుడు కాలేడు. మనిషిని మలినపరిచేది మాంసాహారం కాదు. తాగుడు, కోపం, అసూయ, మోసం, ఆత్మ దంబాచారం, పరులను కించపరచటం, దుష్టబుద్ధి, బహుభార్యాత్వం, మూర్ఖత్వం - ఇవీ మనిషిని మలినం చేసేవి.'

'ఓ భిక్షువులారా! రెండు రకాలైన విపరీతాలకు దూరంగా వుండే మధ్యేమార్గాన్ని నేను బోధిస్తాను. చీక్కిశల్యమై దుర్బలుడైన వ్యక్తి మనసు అయోమయంలో, చౌకబారు ఆలోచనలతో నిండి వుంటుంది. ఆత్మ పీడన ప్రాపంచిక జ్ఞానానికి కూడా తగింది కాదు. మరి జ్ఞానేంద్రియాలను అది ఎలా

జయిస్తుంది?'

'తన దీపాన్ని నీటితో నింపినవాడు చీకటిని పారద్రోలి వెలుగు నింపలేడు. ఊలిపోయిన (తడిసిన) కట్టెల్ని రాపిడి చేసి అగ్ని పుట్టించాలనుకునేవాడు విఫలమవక తప్పదు.'

'కఠోరమైన తపశ్చర్య బాధాకరం, నిరుపయోగం, తృష్ణను అంతమొందించలేని వ్యక్తి, శరీరాన్ని బాధించటం ద్వారా తన నుండి తాను స్వేచ్ఛను ఎలా పొందగలడు?'

'స్వార్థమనేది ఇహ, పరలోక సుఖాలవైపు నడిపిస్తున్నంతకాలం అన్నిరకాల తపశ్చర్యలు వృధా కావలసిందే. కాని ఎవరైతే అహంకారాన్ని అంతమొందిస్తారో వారు కోర్కెల నుండి విముక్తి పొందుతారు. వారు ఇహలోక, పరలోక సుఖాలకోసం అర్రులు చాచరు. ప్రకృతి సహజమైన అవసరాలను తీర్చుకోవటం వారిని అపవిత్రులుగా చెయ్యదు. కాబట్టి జీవిత అవసరాల్ని తీర్చుకోవచ్చు.'

'మరోవైపు కామ సుఖాలు మనిషిని నిర్వీర్యం చేస్తాయి. వాటిలో మునిగిన వ్యక్తి ఉద్రేకాలకు బానిసవుతాడు. ఇది అతడిని అసమర్థుడిగా, నీచుడిగా మారుస్తుంది. కాని జీవితావసరాలను తీర్చుకోవటం పాపం కాదు. శరీరాన్ని వాతావరణం, క్రిమికీటకాలు, ఆకలి దప్పుల నుండి కాపాడటం, అవసరమైన బట్టలు ధరించటం, క్లుప్తంగా చెప్పాలంటే శరీరాన్ని ఆరోగ్యంగా వుంచటం మనిషి బాధ్యత. అలా చెయ్యనట్లయితే మన మనసుల్ని పటిష్టంగా, స్వచ్ఛంగా వుంచుకుని జ్ఞానదీపాన్ని వెలిగించటం సాధ్యం కాదు.'

"భిక్షువులారా! రెండు విధాలైన విపరీత ధోరణులకు దూరంగా వుండే మధ్యమ మార్గం ఇదే!"

ఈ విధంగా తన బోధనను కొనసాగించిన బుద్ధుడు ఆ పంచవర్గీయులకు అష్టాంగమార్గం గురించి కూడా వివరించాడు.

నిర్మలమైన జీవనం, సద్ధర్మ విధానం, సౌశీల్యవంతమైన మార్గంలో ప్రతి ఒక్కరు పయనించగలిగితే దుఃఖం అంతమై పోగలదని బుద్ధుడు చెప్పాడు.

నిర్మలమైన జీవన విధానానికి బుద్ధుడు పంచశీల సూత్రాలను వివరించాడు. పంచశీల సూత్రాలు : 1) ఎవరికీ హాని కలిగించడంగాని, ఎవరినీ చంపడంగాని చేయకూడదు. 2) దొంగిలించడంగాని, ఇతరుల

ఆస్తులను వశం చేసుకోవడంగాని చేయరాదు. 3) అసత్యమాడరాదు. 4) వ్యభిచారం చేయరాదు. 5) మత్తుపదార్థాలను సేవించరాదు.

**అష్టాంగ మార్గం :**

ఎనిమిది సూత్రాలున్నందువల్లనే దాన్ని అష్టాంగమార్గం అన్నాడు. దుఃఖ నివారణకు అష్టాంగ మార్గమే ఉత్తమమన్నాడు. ఆ ఎనిమిది సూత్రాలివి :

1) సమ్యక్ దృష్టి
2) సమ్యక్ సంకల్పం
3) సమ్యక్ వాక్కు
4) సమ్యక్ కర్మ
5) సమ్యక్ జీవనం
6) సమ్యక్ సాధన
7) సమ్యక్ స్మృతి
8) సమ్యక్ సమాధి

అష్టాంగ మార్గంలో సమ్యక్ దృష్టి అంటే సరియైన దృష్టికోణం అన్నిటిలోకి ముఖ్యమైనదని బుద్ధుడు చెప్పాడు.

**1) సమ్యక్ దృష్టి :**

సమ్యక్ దృష్టి అంటే సరియైన దృక్పథం అని అర్థం. సమ్యక్ దృష్టి ఏర్పడాలంటే మూఢనమ్మకాలను, ప్రకృతికతీతమైన వాటిపై నమ్మకాలను విడనాడాలి. అలాగే ఊహాజనితమైన సిద్ధాంతాలను, నిరాధారమైన నమ్మకాలను విడనాడాలి. సమ్యక్ దృష్టి ఏర్పడాలంటే స్వతంత్రంగా, స్వేచ్ఛగా ఆలోచించే శక్తి కలిగి వుండాలి.

**2) సమ్యక్ సంకల్పం :**

ప్రతి మానవుడికి కొన్ని వాంఛలు, ఆకాంక్షలు, ధ్యేయాలు వుంటాయి. సమ్యక్ సంకల్పం ద్వారా మాత్రమే అవి ఉన్నతమైనవిగా, ప్రశంసనీయమైనవిగా మారతాయి. స్థిర సంకల్పం లేనిదే ఎంత గొప్ప ఆశయమైనా నిరుపయోగమవుతుంది. సత్యసంకల్పం అనేది సరైన వాక్కు, సరైన కర్మ, సరైన జీవన విధానంలో వ్యక్తం కావాలి.

**3) సమ్యక్ వాక్కు :**

సమ్యక్ వాక్కు అంటే అబద్ధాలు చెప్పకుండా సత్యాన్నే మాట్లాడటం,

ఒకరిమీద ఒకరికి చాడీలు చెప్పి తగవులు పెట్టకుండా వుండటం, ఇతరులు బాధపడేలా పరుషంగా, అసభ్యంగా మాట్లాడకపోవటం; విషయ శూన్యమైన, వివేకరహితమైన, నిష్ప్రయోజనమైన మాటలు మాట్లాడకపోవటం. కాలక్షేపం కోసం కబుర్లు చెప్పకపోవటం. సూటిగా, స్పష్టంగా, మృదువుగా, ప్రశాంతంగా, నిజాయితీగా మాట్లాడటం.

**4) సమ్యక్ కర్మ :**

సమ్యక్ కర్మంటే సత్ప్రవర్తన. నీ కార్యకలాపాలు ఇతరులకు మనస్తాపం కలిగించని విధంగా వుండాలి. మానవ మనుగడకై సహజసిద్ధంగా, అందరికీ ఆహ్లాదాన్ని కలిగించే విధంగా నడుచుకోవాలనేది మౌలిక సూత్రం. సత్కర్మల లక్ష్యం దాన్నుండి లభించే వ్యక్తిగత సంతోషం కాదు. ఉత్తమమైన జీవితానికి విరుద్ధమైన అన్ని పనులను త్యజించటం. మంచిని పెంపొందించే ఏ పనైనా చెయ్యటానికి వెనుకాడక పోవటం.

**5) సమ్యక్ జీవనం :**

తర్కసహితంగా ఆలోచిస్తే సమ్యక్ కర్మ యొక్క కొనసాగింపే సమ్యక్ జీవనం. ప్రతి ఒక్కరు తమ భుక్తికోసం సంపాదించుకోక తప్పదు. అయితే చెడు మార్గంలోకాక, మంచి మార్గంలో సంపాదించుకోవాలి. ఇతరులకు హాని కలిగించకుండ, అన్యాయం, మోసం చేయకుండా సంపాదించుకోవాలి. ప్రతి ఒక్కరు తమ సామర్ధ్యానికి తగిన పనిని చేస్తూ, తోటివారికి ఉపయోగపడుతూ వుండాలి. జాతకాలు చెప్పటం, అద్భుత శక్తుల ప్రదర్శన, మంత్రతంత్ర విద్యలు చేపట్టకూడదు. అదే విధంగా మత్తుపానీయాలు, ఆయుధ వ్యాపారాలు చేయకూడదు. నీతిగా, నిజాయితీగా జీవించడమే సమ్యక్ జీవనం.

**6) సమ్యక్ సాధన (సమ్యక్ వ్యాయామం) :**

ధర్మబద్ధమైన జీవితాన్ని గడిపేవారు సైతం కేవలం బాహ్య ప్రవర్తనను మార్చుకోవటమేకాక మనోక్లేశాలను (మానసిక మలినాలను) తొలగించుకోవాలి. అంతర్గతమైన ఈ ప్రక్షాళన సరైన కృషి, సరైన మానసిక సమర్థతతోనే సాధ్యమవుతుంది. ఈ సమ్యక్ సాధనకు నాలుగు ఉద్దేశాలున్నాయి. అవి : దురాలోచనలు తలెత్తకుండా అదుపులో వుంచటం, ఇప్పటికే తలెత్తిన వాటిని తొలగించుకోవడం, మంచిపనులు చేయటానికి సంకల్పించటం, ఇప్పటికే వున్న మంచిని ఇంకా పెంపొందించుకోవటం. తనపై తాను అదుపు సాధించగలిగే దృధ సంకల్పాన్ని వృద్ధి చేయటం సమ్యక్సాధన యొక్క అసలు ఉద్దేశం.

**7) సమ్యక్ స్మృతి :**

సమ్యక్ స్మృతి అంటే సరైన జాగరూకత. అప్రమత్తంగా వుండడం. అంటే మనసా, వాచా ఎరుకను అభ్యసించటం. సర్వకాల సర్వావస్థలలోను మనస్సును జాగ్రదావస్థలో వుంచుకోవటం. చెడు భావాలు ప్రవేశించకుండ మనస్సును అప్రమత్తంగా వుంచుకోవటమే సమ్యక్ స్మృతి.

**8) సమ్యక్ సమాధి :**

లోభం, ద్వేషం, సోమరితనం, జడత్వం, అనుమానం - అదే ఈ ఐదు స్మృతిని సాధన చేస్తూ పరిపక్వత సాధించే కృషిలో ప్రతిబంధకాలు. ఈ ఐదు ప్రతిబంధకాలను అధిగమించాలంటే అది సమాధి ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది.

సమాధి అంటే ఏకాగ్రత మాత్రమే. సమాధి సాధన ద్వారా మనస్సును కేంద్రీకరించినపుడు ఈ ఐదు ప్రతిబంధకాలు అణచి వేయబడతాయి. అవి తాత్కాలికంగా అణచివేయబడితే అది సమాధి అవుతుంది. ఈ ఐదు ప్రతిబంధకాలను శాశ్వతంగా అణచివేయబడితే అది సమ్యక్ సమాధి అవుతుంది.

(ఇంకా వుంది)

**హేతువాది పత్రిక 40 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకొని**
**41వ సంవత్సరంలోకి ప్రవేశించిన సందర్భాన**
**పత్రిక ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి శుభాకాంక్షలతో........**



# తెలంగాణ హేతువాద సంఘం

# విశ్వతత్వం - సైన్సు - హేతువాదం

- షేక్ బాబు

విశ్వం ఆవిర్భవించి 1380 కోట్ల సంవత్సరాల కాలం గడచింది. దాన్ని శాస్త్రవేత్తలు బిగ్‌బ్యాంగ్ అన్నారు. మన సౌరకుటుంబంలో మనం నివశిస్తున్న భూమి వరుస క్రమంలో మూడవ స్థానంలో వుంది. భూమిలో 6వ వంతు వున్న చంద్రుడు భూమికి ఉపగ్రహం. సూర్యుని చుట్టూ పరిభ్రమించే గ్రహాలలో కొన్నింటికి 16, 18, 36 ఉపగ్రహాలు కూడా వున్నాయి. అవి అన్నీ మన చంద్రుని లాంటివే. మన గెలాక్సీలో 20 వేల కోట్ల నక్షత్రాలు వున్నాయి. అవి అన్నీ మన సూర్యునిలాంటివి. ఫ్రాగ్మా సెంచూరి లంటి పెద్ద నక్షత్రాలున్నాయి. అందులో మన సూర్యుడు సగటు నక్షత్రం. ఆకాశంలో రాత్రుల్లో మన దిశ నేత్రాలకు కనిపించే తారలన్నీ సూర్యుళ్ళే.

ఇప్పుడు ఆధునికంగా శాస్త్రజ్ఞులు తయారుచేసిన టెలిస్కోపు, హబుల్ టెలిస్కోపు కంటే 100% శాతం దూరాలను చూడగల సామర్థ్యం కలది. లక్షల కోట్ల కాంతి సంవత్సరాలు చూడగలుగుతూ, శాస్త్రవేత్తలు ప్రకృతి రహస్యాలు తెలుసుకోగలుగుతున్నారు.

మానవునికి లక్షల గెలాక్సీలు గల విశ్వం దర్శనమవుతుంది. విశ్వం విస్తరిస్తుంది అని తెలుసుకోవడం 20 శతాబ్దంలో వైజ్ఞానిక విప్లవమంటాడు బ్లాక్ హోల్స్ పై విస్తారంగా అధ్యయనం చేసిన, ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్.

నిరంతర పరిణామంలో ఉన్న విశ్వపదార్థం ద్రవ, ఘన, వాయు, ఎనర్జీ (శక్తి) రూపాలుగా దర్శనమవుతుంది. గ్రహాలు, ఉపగ్రహాలు, నక్షత్రాలు, బ్లాక్‌హోల్స్‌గా అస్తిత్వం గల విశ్వం, అనేక రూపాలుగా దర్శనమవుతుంది. విశ్వం అంతా ఏకత్వమే (మోనిజం). విశ్వ పరిణామం నియమబద్ధంగా, క్రమబద్ధంగా జరుగుతుంది. ఇది పదార్థ స్వభావం.

సూక్ష్మ విశ్వంలో అణువులు, పరమాణువులు, ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రినోలు, క్వార్క్‌లుగా రెండు వందల రకాల శకలాలున్నాయని శాస్త్రవేత్తల పరిశోధనలు తేల్చాయి.

విస్తరిస్తున్న విశ్వంలో గ్రహాలు, నక్షత్రాలు, బ్లాక్‌హోల్స్ రూపాలుగా

వున్న పదార్థం 4% శాతం కాగా, ఎనర్జీ(శక్తి) రూపంలో 96% శాతం పదార్థం వున్నదని స్టీఫెన్ హాకింగ్ మహాశయుడు అంటారు.

ప్రేక్షకుడు లేని రంగస్తలంలా సాగిపోతున్న విశ్వపరిణామంలో జీవమనే కొత్త లక్షణం ఏర్పడింది. అది సహజమే, నియమబద్ధమే. 350 కోట్ల సంవత్సరాలనాడు భూమిపై ఆవిర్భవించిన ఏకకణ జీవి, జీవపరిణామ క్రమంలో బహుకణ జీవులుగా సరీసృపాలుగా, పక్షులుగా, చేపలుగా, కప్పలుగా, జంతువులుగా కోట్ల సంవత్సరాలు జరిగిన జీవపరిణామంలో 2 లక్షల సంవత్సరాలనాడు ఆదిమానవుడు అవతరించాడు.

మానవుడు తన జీవన సంఘర్షణలో క్రూరజంతువుల బారిన పడకుండా తప్పించుకొంటూ, సాదు జంతువులను తన ఉపయోగానికి అనుకూలంగా మలచుకొన్నాడు. నిప్పు, కుండల తయారి, బండి చక్రం అతని జీవితంలో గొప్ప మార్పును తెచ్చాయి. మెదడు పెరగడం వలన శబ్దాలు, సంజ్ఞల ద్వారా భావాలు తెలుపుకొనే దశ నుంచి, స్వరపేటిక వల్ల భాషా, లిపి, వునికిలోకి వచ్చాయి. ఇదంతా మానవుడు తెలుసుకోవడానికి అతనిలో హేతుత్వం, వివేకమే చోదక శక్తిగా పని చేశాయి.

ప్రాచీన మానవుడు నిప్పును జాగర్త చేయడం, కుండను, బండి చక్రాన్ని తయారు చేయడం ఆ కాలం నాటికి సైన్సు. , ఆధునిక కాలంలో ప్రకృతి నియమబద్ధతను అనుసరించి రేడియో, టెలిఫోను, టేప్‌రికార్డరు వగైరా సైన్సు టెక్నాలజీని కనిపెట్టాడు.

రేడియో తరంగాలు భూమి చుట్టు చుట్టి వస్తున్నాయని తెలుసుకోవటం సైన్సు అయితే, పరికరాలతో రేడియోను తయారు చేయడం సైన్సు సాంకేతిక పరిజ్ఞానం. అంటే విశ్వనియమాలను సూత్రబద్ధంగా తెలుసుకోవడమే సైన్సు. ప్రకృతిలోని రహస్యాలను భౌతిక వాస్తవికత ఆధారంగా ఏమిటి, ఎందుకు, ఎలా అని తెలుసుకొనే కార్యకారణ పద్ధతినే సైన్సు పద్ధతి అంటాము.

మనిషిలోని హేతుత్వం (రేషనాలిటి) జ్ఞానార్జనకు సాధనం. మన జ్ఞానం ప్రకృతిలోని వస్తువులు, సంఘటనలను (Events) గురించినదే. అలా తప్ప మరో రకమైన జ్ఞానం లేదు. జ్ఞానం ఆర్జించిన మేర సత్యాన్ని (Truth) తెలుసుకొంటాము. ఒకవేళ మన జ్ఞానం అసమగ్రమూ, తప్పు అయితే వాటి గురించిన సత్యమూ తప్పవుతుంది. అందుచేత, సత్యం జ్ఞానాంశము. పరమజ్ఞానం. పరమ సత్యం అసంబద్దాలు.

మన జ్ఞానేంద్రియాలకు ప్రకృతిలోని వస్తువులు వచ్చి తాకడంవల్ల మనకు ఆ వస్తువులను గురించి స్పృహ కలుగుతుంది. అలా కలిగిన భావన వస్తువుల పరోక్షంలో మన మెదడులో నిక్షిప్తమవుతుంది. మనలో కలిగిన భావాలు వస్తువులను గురించినవే. అలా ఏర్పడిన భావాలు వస్తువులకు కాక, మనలో ఏర్పడియున్న వాటి చిత్రాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

హేతువాదం ఒక ఆలోచనా విధానం. హేతువు అంటే కారణం అని అర్థం. అందువల్ల హేతువాదాన్ని కార్యకారణవాదంగా చెప్పుకొంటాము. కారణకార్యాలు ప్రకృతి సంఘటనల్లో (Events) ఏర్పడేవే. సంఘటనలు జరిగినపుడు మొదట జరిగిన సంఘటన కారణం కాగా, తరువాత సంఘటన కార్యమవుతుంది. "కారణమితి ద్రవ్యే కారణసంవాయ" అంటుంది వైశేషికం. అంటే రెండు వేల సంవత్సరాలనాడే కారణకార్యాలు ద్రవ్యంలోనివే అనే నిర్ణయాలు చేశారు వైశేషకులు.

రాడికల్ హ్యూమనిజంలో, హేతువాదానికి ఆధునిక విజ్ఞానాన్ని జోడిస్తే, శాస్త్రీయ మానవవాదం లేక సమగ్ర మానవవాదం అవుతుందని హ్యూమనిస్టు తత్వవేత్త రావిపూడి వెంకటాద్రిగారు అంటారు.

హేతువాదం లక్ష్యం మానవవాదం. హేతువాదం సాధనంగా మానవవాద శిఖరాగ్రాహాన్ని చేరుతాము. మధ్యలో నాస్తికవాదం, భౌతికవాదం, మార్క్సిజం, లౌకికవాదం, ప్రజాస్వామ్యం మజిలీలు.

హేతువాదం సిద్ధాంతంకాదు, ఆలోచనా విధానం కాగా, మానవవాదం జీవన విధానం. హేతుత్వం (రేషనాలిటీ) జీవలక్షణం. పరిసరాలకు ప్రతీకరణ చెందే స్వభావం జీవప్రకృతిలోనే వుంది. నిర్జీవ ప్రకృతిలో హేతుత్వం లేదు. ఏకకణజీవి ఐన అమీబా తన రిక్త హస్తాల (సూడోపోడియా)ల ద్వారా ఆహారాన్ని సంగ్రహిస్తుంది. విష ఆహారానికి దూరంగా జరుగుతుంది. దాన్ని మనం మొట్టమొదటి హేతుత్వంగా గుర్తిస్తాము. జీవపరిణామ క్రమంలో జీవుల శారీరక నిర్మాణాన్ని బట్టి వాటి, వాటి హేతుత్వ స్థాయి పనిచేస్తుంది. గొర్రెలు, బర్రెలు, కుక్కలు, ఆవులు లాంటి జంతువులు మేతకు వెళ్ళినపుడు వర్షం జోరుగా కురిస్తే, అవికూడా మనుషులతోపాటు దగ్గరలోవున్న చెట్లు క్రిందకు చేరుతాయి. జంతువుల్లో హేతుత్వం చాలా వరకు సహజాతంగా వుంటుంది. ఆ మాత్రం వివేకం పనిచేయకుంటే వాటి మనుగడే కష్టం అవుతుంది.

మనిషిలో హేతుత్వం స్వేచ్ఛా, సంకల్పం స్థాయిలో పనిచేస్తుంది. అవి

కళలైనా, సంగీతమైనా, సాహిత్యమైనా, దేవుళ్ళయినా, మతమైనా, శాస్త్రమైనా అంతా మానవుని సృష్టే. ప్రకృతిలో నియమబద్ధత – మనిషిలో హేతుత్వంగా భాసిల్లింది. విశ్వనియమాలు పనిచేయకుంటే జ్ఞానం పొందటం మనిషికి సాధ్యంకాదు. విశ్వనియమాలు మన మనస్సు కల్పించినవికావు. సారాయి త్రాగితే మత్తు కలుగుతుంది. మంచి నీరు త్రాగితే దప్పిక తీరుతుంది. నీరు త్రాగి మత్తు కలగాలని మనం కోరుకుంటే మత్తు కలగదు. వున్న వాటిల్లో మనకు ఏది కావాలో ఎన్నుకొనే స్వేచ్ఛ వుంటుంది. విషం త్రాగి నేను చనిపోకుండా వుండాలని కోరుకుంటే (సంకల్పిస్తే) అలా జరుగదు. ప్రకృతిలో ఏది ఎలా పనిచేస్తుందో తెలుసుకోవడం వలన మనకు ఏది కావాలో.ఎన్నుకొనే స్వేచ్ఛ వుంటుంది. మన సంకల్పం (will) కూడా మన జ్ఞానం మీద ఆధారపడి వుంటుంది. సత్యం (truth) తెలుసుకోవడానికి సైన్స్ ప్రామాణికం కావాలి. సత్యం సత్తును గురించిందే. మన ఫిలాసఫి సైన్స్‌ను అనుసరించాలి. ఆగిపోయిన ఆలోచనలు మతాలు కాగా, సాగిపోయే ఆలోచనలకు శాస్త్రం ఆధారం కావాలి.

రాడికల్ హ్యూమనిజంలో మనిషి కేంద్రంగా వుంటాడు. మనిషి భవితవ్యానికి మంచి చెడులకు తనే బాధ్యత వహిస్తాడు. మానవ శ్రేయస్సుకు మానవుడే మూలమవుతాడు. మనం పొందే స్వేచ్ఛ మన జ్ఞానస్థాయి పై ఆధారపడి వుంటుంది. మనకు కలిగిన జ్ఞానం అసంబద్ధమైనదైతే, మన జీవన విధానంలో ఆ లోపం కొరత కనిపిస్తుంది.

రాడికల్ హ్యూమనిజంలో హేతుత్వం, జ్ఞానం, సత్యం, స్వేచ్ఛ, నీతి మానవ విలువలుగా వుంటాయి. హేతుత్వం, జ్ఞానం, స్వేచ్ఛ అత్యంత ఉన్నత మానవ విలువలుగా రాడికల్ హ్యూమనిజం పరిగణిస్తుంది. ●

---

# హేతువాది - ఇంకొల్లు

- కరి హరిబాబు

1972 నుంచి విశ్రాంత ప్రధానోపాధ్యాయులు గౌరిబోయిన పోలయ్యగారి ప్రభావంతో నాస్తికుడిగా మారాను. పోలయ్యగారి రచనలు 'పిలకరాయుళ్ళు', 'విమర్శ రామాయణం', 'పురాణాల్లో బూతు' లాంటి పుస్తకాలను చదివాను. టీనేజి వయసులోనే పోలయ్యగారి ప్రభావంతో నాస్తికుడిగా మారడం, అంతకుముందు పురాణ సాహిత్యాన్ని, చదివి ఉన్న నాకు వాటిల్లోని హేతువిరుద్ధ విషయాలు అనేకం గమనించాను.

1976 నుంచి భారత నాస్తిక సమాజంలో కార్యకర్తగా పనిచేయడం ప్రారంభించాను. ఈ క్రమంలో మిత్రులు షేక్ బాబు, రావి సుబ్బారావు తదితర మిత్రుల సహకారంతో విశాఖ పట్టణం నుంచి భారత నాస్తిక సమాజం అధ్యక్షులు జయగోపాల్ గారిని, మంగళగిరి నుంచి చార్వాకాశ్రమం వ్యవస్థాపకులు బి.రామకృష్ణగారిని, నరసరావుపేట నుంచి ఎస్.వి.రావుగారిని తదితరులను ఇంకొల్లుకు ఆహ్వానించి సమావేశాలు నిర్వహిస్తూ మా సందేహాలను తీర్చుకునే ప్రయత్నం చేశాం. నాస్తిక, హేతువాద ప్రముఖులను కలపాలనే ధ్యేయంతో మేం మా కార్యకలాపాలను నిర్వహించినా, వారి మధ్య సిద్ధాంత భేదాలు ఉన్నాయని, అందుకే విడిగా వారి కార్యక్రమాలను నిర్వహించుకుంటున్నారని గ్రహించాం. చార్వాక, అరుణతార, హేతువాది, నాస్తిక మార్గం, నాస్తికయుగం లాంటి ఉద్యమ పత్రికలను, ఉద్యమ సాహిత్యాన్ని చదువుతూ వచ్చాం. మాతో కొడాలి కమలమ్మగారు, వత్సవాయి నారాయణరాజుగారు, ఘంటా రంగారావుగారు, మురకొండ శ్రీరామ ఆర్యగారు, ఇంటూరి రామయ్యగారు తదితర మిత్రులు కలసి కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

ఈ క్రమంలో 1986 వేసవిలో ఒంగోలులో భారత హేతువాద సంఘ సభలు జరుగుతున్నాయని తెలిసి అక్కడి సమావేశాలకు మిత్రులు షేక్ బాబు, రావి సుబ్బారావు, ఘంటా రంగారావు, మురకొండ శ్రీరామ ఆర్య తదితర మిత్రులం హాజరయ్యాం. ఒంగోలులో జరిగిన అధ్యయన తరగతుల్లో పాల్గొన్న తర్వాత సాయంత్రం రావిపూడి వెంకటాద్రిగారితో కలసి మా సందేహాలకు సమాధానాలను పొందాం. అర్ధరాత్రి వరకు రావిపూడి వెంకటాద్రిగారు సమాధానాలిస్తూ ఓపిగ్గా మాట్లాడారు.

ఒంగోలులో జరిగిన సమావేశాల అనంతరం రావిపూడి వెంకటాద్రి తదితరుల హేతువాద మానవవాద సాహిత్యాన్ని చదివాం. రావిపూడి వెంకటాద్రిగారు తమ సాహిత్యంలో వెల్లడించిన రాడికల్ హ్యూమనిస్ట్ భావాలను, విశ్వతత్వం మీద ఆయన భావలను, భావవిప్లవం రావలసిన అవసరం చాలా ఉందని ఆయన చెప్పిన తీరుతో రాడికల్ హ్యూమనిస్టులుగా మారాం. 'హేతువాది' పత్రికను క్రమం తప్పకుండా చదవడం, హేతువాద సాహిత్యంతో గ్రంథాలయాన్ని నడపడం చేస్తూ మా మిత్రులకు హ్యూమనిస్టు భావాలను పరిచయం చేస్తూ వచ్చాం. మా "చైతన్య ఫుట్‌వేర్"లోనూ, షేక్ బాబుగారి 'బాబు వాచ్ కో'లోను మిత్రులందరం కలుస్తూ విస్తృతంగా ఉద్యమ విషయాలను చర్చిస్తూ, మా అవగాహనను ఇతర మిత్రులలోనూ కలిగిస్తూ వచ్చాం.

1988 సంవత్సరం వేసవిలో రావిపూడి వెంకటాద్రి మార్గదర్శకత్వాన ఇంకొల్లు హేతువాద సంఘాన్ని ప్రారంభించాం. షేక్ బాబు అధ్యక్షులుగా, నేను ప్రధాన కార్యదర్శిగా కార్యకలాపాలను సాగించాం.

ఇంకొల్లు హేతువాద సంఘం ఆధ్వర్యంలో 1988లో నాలుగు రోజులపాటు మిత్రుల సహకారంతో హేతువాద అధ్యయన శిబిరాన్ని నిర్వహించాం. అప్పటి ప్రకాశంజిల్లా కలక్టర్ డా॥ జయప్రకాష్ నారాయణగారు అధ్యయన శిబిరాన్ని ప్రారంభించి ప్రసంగించారు. ఈ అధ్యయన శిబిరంలో రావిపూడి వెంకటాద్రి, యం.వి.రామమూర్తి, డా॥ఎన్.ఇన్నయ్య, కొల్లా సుబ్బారావు, పసల భీమన్న, పి.యస్.ఆర్., సి.హెచ్.రాజారెడ్డి తదితరులు ఉపన్యాసకులుగా పాల్గొన్నారు. చీరాల నుంచి అంచా బాపారావు మాకు సహకరించారు.

ఈ అధ్యయన శిబిరంలో చేగిరెడ్డి చంద్రశేఖరరెడ్డి, మేడూరి సత్యనారాయణ, కాకి రాజశేఖర్ తదితరులు పాల్గొని పరిచయమయ్యారు. అధ్యయన శిబిరం అనంతరం మా షాపుల్లో నిత్యమూ వివిధ అంశాల మీద మిత్రుల మధ్య చర్చలు సాగుతుండేవి. చాలామంది మిత్రులు హేతువాద మానవవాద సాహిత్యాన్ని అధ్యయనం చేయడం మొదలుపెట్టారు. ఈ క్రమంలోనే మేడూరి సత్యనారాయణ, కుర్రా హనుమంతరావు, చేగిరెడ్డి చంద్రశేఖరరెడ్డి, కాకి రాజశేఖర్ కార్యకర్తలుగా ఉద్యమంలోకి ప్రవేశించారు.

1991 ఆగష్టులో రావిపూడి వెంకటాద్రి మార్గదర్శకత్వంలో ఇంకొల్లులో జరిగిన సమావేశంలో రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్‌ను స్థాపించాం. ఈ

సందర్భంగా సెంటర్ శాశ్వత సభ్యులైన రావి సుబ్బారావుగారు ఇంకొల్లులోని పర్చూరు రోడ్డులో గల తమ స్వంత ఖర్చులతో ఉచితంగా రిజిష్టరు చేశారు. ఆనాటి నుంచి రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ వార్షికోత్సవాలు, హేతువాద మానవవాద అధ్యయన తరగతులను సెంటర్ స్థలంలోనే నిర్వహిస్తూ వచ్చాం. షేక్ బాబు అధ్యక్షులుగా, రావి సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా, కరి హరిబాబు ట్రెజరర్‌గా సెంటర్ కార్యకలాపాలను ప్రారంభించి కొనసాగించింది.

2001లో ఆరమళ్ళ పూర్ణచంద్రగారు 5 లక్షల రూపాయిల విరాళాన్ని అందించగా, ఉద్యమ మిత్రుల సహకారంతో 10 లక్షల రూపాయిలతో రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ పూర్తి చేశాం. 100 మందికి సరిపడ మీటింగుహాలు, హ్యూమనిస్టు గ్రంథాలయం గది, అతిథి గది, రెసిడెన్సియల్ సౌకర్యాలతో భవనం 2003, జనవరి 17న ప్రారంభమైంది. ఈ ప్రారంభ కార్యక్రమానికి అంతర్జాతీయ హ్యూమనిస్టులు లెవీ ఫ్రాగెల్, దాత ఆరమళ్ళ పూర్ణచంద్ర దంపతులు, బాబు గోగినేని, డా॥ యన్. ఇన్నయ్య తదితరులు హాజరయ్యారు.

2002 మార్చి నుంచి రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రుల సహకారంతో నిర్వహిస్తున్న 'హేతువాది', హేమా పబ్లికేషన్స్‌లకు రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ కార్యాలయమైంది. సెంటర్ మిత్రులందరూ ఒక టీంగా సహకరిస్తూ హేతువాది ప్రచురణ, పంపిణీలను నిర్వహిస్తూ గత 20 సంవత్సరాలుగా 'హేతువాది' హేమా పబ్లికేషన్స్‌ల నిర్వహణలో రావిపూడి వెంకటాద్రిగారికి సెంటర్ మిత్రులందరూ సహకరిస్తున్నారు.

'హేతువాది' మాసపత్రిక, హేమా పబ్లికేషన్స్ సాహిత్య ప్రభావం మామీద పడడంతో మార్క్సిస్టు సానుభూతిపరులుగా ఉన్న మేం క్రమంగా రాడికల్ హ్యూమనిస్టు భావాలను ఆమోదించి, బాధ్యతాయుతంగా, క్రియాశీలంగా ఉద్యమ కార్యక్రమాల్లో పాల్గొంటూ వచ్చాం.

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్‌లో జరిగే హేతువాద మానవవాద అధ్యయన తరగతుల్లో, మహాసభల్లో, బహిరంగ సభల్లో, ఆంధ్రప్రదేశ్‌లో, తెలంగాణలో, కేరళలో జరిగే అధ్యయన తరగతుల్లో, మహాసభల్లో రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మిత్రులు, హేతువాద మానవవాద ఉద్యమ మిత్రులలో కలసి పాల్గొంటున్నారు.

2021 ఫిబ్రవరి 9న రావిపూడి వెంకటాద్రిగారి 100వ జన్మదినోత్సవ సందర్భంగా విశాఖ పట్టణంలోని అంబటి రత్తమ్మ మెమోరియల్ ట్రస్టు ఇతర

మిత్రుల సహకారంతో రాడికల్ హ్యూమనిస్ట్ భవన్ పైన రావిపూడి వెంకటాద్రి మీటింగ్ హాలును నిర్మించి, ప్రారంభించడంలో హేతువాద మానవవాద ఉద్యమ కేంద్రంగా రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ మరింత క్రియాశీలంగా మారింది. సెంటర్ మిత్రులు కుర్రా హనుమంతరావు, డా॥ గుమ్మా వీరన్న, మేడూరి సత్యనారాయణ, కరి హరిబాబు షేక్ బాబు, ఆలూరి ప్రుల్లచంద్ర, చేగిరెడ్డి చంద్రశేఖరరెడ్డి, షేక్ దరియావలి, కాకి రాజశేఖర్ తదితరులు రచయితలుగా, ఉపన్యాసకులుగా, ఆర్గనైజర్లుగా ఎదిగి క్రియాశీలతను ప్రదర్శిస్తున్నారు.

'హేతువాది' పత్రిక, హేతువాద మానవవాద సాహిత్యం యువమిత్రుల్లో హేతువాద మానవవాద ఉద్యమ అవగాహనను పెంచేందుకు చాలా ఉపకరిస్తున్నాయి. యం.యన్.రాయ్, రావిపూడి వెంకటాద్రి హ్యూమనిస్టు భావాలతో ప్రేరేపితులైన మిత్రులు హేతువాద మానవవాద ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయేందుకు మరింత క్రియాశీలతను ప్రదర్శిస్తారని, ఉద్యమాభివృద్ధికి సహకరిస్తారని ఆశిస్తూ ముందుకు సాగుతున్నాం.

మతతత్వశక్తులు విజృంభిస్తున్న నేటి తరుణంలో హేతువాద, మానవవాద కార్యకర్తలు ఇతోధికంగా కృషి చేయవలసిన అవసరం చాలా ఉంది. అంతర్జాతీయ మానవవాద సంస్థల సహాయ సహకారాలతో మత తత్వ, ప్రజాస్వామిక వ్యతిరేక చర్యలపై భావవిప్లవ సాహిత్యంతో ఉద్యమించాల్సిన ఆవశ్యకత ఉందని భావిస్తున్నాను. ప్రజల్లో భావవిప్లవాన్ని తీసుకురావడం ద్వారా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే ప్రయత్నం మరింత ఉత్సాహంతో చేస్తారని ఆశిస్తున్నాను.

మూడు దశాబ్దాలపాటు రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, నాలుగు దశాబ్దాలపాటు 'హేతువాది' పత్రిక తమ కృషిని కొనసాగించడం, 1979 నుంచి ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం, 1930 నుంచి భారత హేతువాద సంఘం తమ కృషిని కొనసాగిస్తూ నేడు రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ కేంద్రంగా క్రియాశీలంగా ఉండడం ఉద్యమమిత్రులందరూ సంతోషించదగ్గ సమయం.

హేతువాది 40 సంవత్సరాల ఉత్సవాన్ని 2022 సెప్టెంబరు 10, 11 తేదీలలో భారత హేతువాద సంఘ 91వ వార్షిక మహాసభ, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ 22వ ద్వైవార్షిక మహాసభలతోపాటు జరుపుకోవడం ఉద్యమ భవిష్యత్తుకు ఉపకరిస్తుందని ఆశిస్తూ రావిపూడి వెంకటాద్రిగారికి ఉద్యమ మిత్రులకు అభినందనలు, శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ●

# హేతువాదం (ప్రసంగ పత్రం)

- రావిపూడి

మానవుడికి ప్రాయికంగా సంక్రమించిన హేతుత్వం (Rationality) జీవలక్షణాల్లో అత్యంత ముఖ్యమైనది. అది ప్రకృతిలో నియమబద్ధత (Low-Governedness) రూపంలోనూ, దాని పరిణామంలో అవతరించిన జీవజాలంలో సహజాతవాసన (Instinct) రూపంలోనూ, మరింత పరిణామం చెందిన మానవుడిలో వివేకం (Reason) రూపంలోనూ వ్యక్తమవుతున్నది. తనలో వ్యక్తమవుతున్న వివేకాన్ని, హేతుత్వాన్ని, విచక్షణాశక్తిని వినియోగించుకొని సత్యాసత్యాలను, యుక్తాయుక్తాలను విడమరచి జీవనతత్వాన్ని ఏర్పరచుకోవడానికి మానవుడు అనుసరించే విధానాన్నే హేతువాదమంటాం. నిజానికి, హేతువాదం వాదంకాదు. సిద్ధాంతంకాదు. తత్వం కూడా కాదు. నిత్యాభివృద్ధి చెందే విజ్ఞానానికి వాస్తవిక మదింపు వేసే పద్ధతిని హేతువాదమంటాం. అందువల్ల అదొక మెథడాలజీ.

హేతువాదాన్ని, కార్యకారణవాదమని కూడా అనేది కద్దు. కార్యాలకు కారణాలుంటాయి కాన, ఒకకార్యాన్ని సాధించాలంటే ఏ కారణాన్ని ఆశ్రయించాలో, లేక ఏ కారణం వల్ల ఏ కార్యం జరగబోతున్నదో ముందుగా అంచనా వేసుకోవచ్చు. కారణం లేని కార్యం ఉండదు. దీన్నే 'కారణాభావాత్ కార్యాభావః' అన్నది వైశేషికం (1-2-1). అలానే కార్యం ఉన్నప్పుడు కారణం ఉండక తప్పదు. కార్యకారణాల్లో ఏదీ ఒంటరిగా ఉండడం సంభవం కాదు. ఈ కార్యకారణాల సంబంధాన్ని అర్థం చేసుకొని నిర్ణయాలు తీసుకొనే పద్ధతినే హేతువాదమంటాం. కారణం లేకుండా కార్యం జరగదు. అలా జరిగినట్లు కనపడి, మహత్యాలుగా పిలవబడే వాటిని హేతువాదం మూఢనమ్మకాలుగా పరిగణిస్తుంది.

నీరు, నీటిఆవిరి, మేఘం, మంచుగడ్డ - ఇవి ఒకే వస్తువు యొక్కనాల్గుదశలు. కాబట్టి, వీటిని ఒకదానికొకటి కారణంగానూ, కార్యంగానూ, చెప్పుకోవచ్చు. వర్షానికి కారణం మేఘాలు. మేఘాలు లేకుండా వర్షం కురిసిందని ఎవరైనా అంటే, అది అబద్ధమంటాం. ఎందువల్ల? మేఘాలకు, వర్షానికి మధ్య ఉండే కార్యకారణ సంబంధం మనకు తెలుసు కనుక. సాయిబాబా వేలుపెడితే నీరు పెట్రోలుగా మారిందని ప్రచారం చేసే మేధావులున్నప్పుడు,

ఆ మోసాన్ని, గారడీని మహత్యంగా విశ్వసించే సామాన్యులుండడంలో విశేషమేమున్నది? ఎవడువేలు పెట్టినా నీరు పెట్రోలుగా మారడం జరగదు. అది పదార్థ ధర్మాలకు, కార్యకారణ సంబంధానికి విరుద్ధమైనది. అలా జరగడానికి వీలులేదని మనం నిర్ణయించుకోవడం కూడా హేతువాద అవగాహన క్రిందకే వస్తుంది. ఎందుకంటే, ఏది జరగడానికి వీలుందో, ఏది జరగడానికి వీలులేదో సంభావ్యతా నియమాలను బట్టి మనం అర్థం చేసుకోవచ్చు.

కారణ కార్యాలనేవి పూర్వోత్తర సంఘటనలకు మనం పెట్టుకొన్న పేర్లు. అంటే, సంఘటనల పరోక్షంలో కార్యకారణాలకు అర్థంలేదు. సంఘటనలు లేకపోతే, కారణకార్యాలుండవు. నిత్య పరిణామి అయిన ఈ ప్రకృతి అవిరత సంఘటనల మయం (Continuum of Events). మనజ్ఞానమంతా ఈ సంఘటనలను గురించినదే. ఆ సంఘటనలన్నీ క్రమబద్ధంగా ఉన్నాయి. ఒక సంఘటనను మరో సంఘటన అవశ్యంగా నిర్ణయించడంగానీ, ఒక సంఘటనకు ముందు మరోసంఘటన అవశ్యంగా ఉండడంగానీ జరుగుతుంది. దీన్నే మనం నియతివాదం (Determinism) అంటాం. ఇది కర్మవాదమూ కాదు, ప్రారబ్ధవాదమూ కాదు. నియతివాదం ప్రకృతి సూత్రాలకు సంబంధించినదే తప్ప, ప్రకృతి వెలుపలి శక్తులతో దీనికి సంబంధంలేదు. సంఘటనలక్రమాన్ని గురించిన జ్ఞానం ద్వారా మనం కోరుకున్న సంఘటనను సాధించే స్వేచ్ఛ మనకుంటుందికాన, నియతివాదం స్వేచ్ఛకు విరుద్ధం కాదు; పైగా ఏది ఎలా జరుగుతుందో మనకు అవగాహన లేకపోతే, సంఘటనలన్నీ అనియత పద్ధతిలో, చిందరవందరగా జరుగుతూ ఉంటే, మనం దేనినైనా స్వేచ్ఛతో ఎంపికచేసుకొనే అవకాశంలేదు. మనస్వేచ్ఛకూ, కర్మణ్యత్వానికీ, దేన్నయినా లక్ష్యించడానికి కూడా అవకాశంలేదు. అంటే, నియతివాదం హేతువాద స్వేచ్ఛావాద సూత్రమే. నియతిని గురించిన జ్ఞానం మనకు ఉండడంవల్లనే, సంభావ్యతా (Probability) భావం కూడా మన ముంగిట్లో ఉంటుంది.

మనం వివేకాన్ని వినియోగించుకున్నప్పుడు ఒక ప్రతిపాదనను అంగీకరించే హక్కుకానీ, తిరస్కరించగల తాహతు కానీ మనకుంటుంది. దాన్ని చలాయించుకోగల హక్కు ఉండడమంటే, స్వతః ప్రమాణాలని చెప్పబడుతున్న మతగ్రంథాలను నిరాకరించే హక్కు ఉండడమే. వేదాలు, బైబిలు, ఖురాను వగైరా మతగ్రంథాలు చెప్పిన వాక్యాలనో, యోగులు, స్వాములు, బాబాలు చెప్పిన అభూత కల్పనలనో - వివేకానికీ, హేతుత్వ పరీక్షకూ నిలబడకపోతే,

సత్యాలని నిర్ధారణకాకపోతే – అవి ప్రమాణాలు కావని త్రోసివేయడం కూడా హేతువాదమే. అంటే, మతాన్ని ఆమోదించే పని హేతువాద విధానానికి లేదు. మతాన్ని ఆమోదించడమంటే హేతువాదాన్ని తిరస్కరించడమే. అందువల్ల, మతాన్ని సమర్ధించడానికి కొందరు చేసే కుతర్కం కేవలం యుక్తీకరణం (Rationalisation) అవుతుంది తప్ప, హేతువాదం కాదు. అసలు తర్కమూ, హేతువాదమూ ఒకటి కావు. తప్పొప్పులతో నిమిత్తం లేకుండా, ఏదైనా సిద్ధాంత ప్రాతిపదికల మీదనుంచి బయలుదేరి వివాదం కొనసాగించే కార్యకారణ పద్ధతిని తర్కం అంటాం. కాని, హేతువాదం కేవలం తర్కం కాదు. అది ప్రాతిపదికల నిర్ణయానికి కూడా కార్యకారణ భావాన్ని అనుసంధిస్తుంది. అందుకు బాసటగా ఆధునిక విజ్ఞానాన్ని తీసుకొంటుంది. విజ్ఞానానికి లొంగని, విజ్ఞానం ఆమోదించని సత్యాన్ని హేతువాదం తిరస్కరిస్తుంది. కేవల తర్కానికి అలాంటి నైతిక నియమం ఉండదు.

మతమూ విజ్ఞానమే. కాని, అది ఒకప్పటి విజ్ఞానం. ఈనాటి విజ్ఞాన ప్రమాణాల ప్రకారం అది అజ్ఞానం. నిజానికి, ఏ విజ్ఞానమైనా వ్యవస్థీకరణ చెందితే, అది మతం క్రిందనే లెక్క. అది పరమ ప్రమాణమై కూర్చుంటుంది. అందువల్లనే, గతంలో ఒకమతం మీద తిరుగుబాటు జరిపిన ఉద్యమాలు తమవంతు వచ్చేసరికి తిరిగి వ్యవస్థీకృతమై మతాలుగా తీరి కూర్చున్నాయి. ఏ మతమూ, ఏనాడూ భిన్నభావాలను సహించలేదు. ప్రతి మతమూ ప్రవక్తనో, ప్రవచనాన్నో (మత గ్రంథాన్నో) పరమ ప్రమాణంగా పరిగణిస్తుంది. వివేకాన్ని వినియోగించుకొనే హక్కు, మత గ్రంథాలు నిర్దేశించిన మార్గానికి భిన్నంగా ఆలోచించే హక్కు, ప్రవర్తించే హక్కు ఏమతమూ, ఎవ్వరికీ ఎన్నడూ అంగీకరించలేదు. సాహసించి చలాయించుకోజూచిన ప్రతివారినీ మతం పాషండులుగా చిత్రించి శిక్షించింది. అది చరిత్ర. కాబట్టి, మత ప్రమాణాన్ని తృణీకరించడం హేతువాదంలో ప్రాథమిక దశ. ఇలా ఎందుకు అంటున్నామంటే, మతబోధలన్నీ అసంబద్ధాలతో, అసత్యాలతో కూడి ఉన్నాయి. వాటిలోని తప్పుల్ని గమనించలేని వారికి మరి దేనిలోనూ తప్పుల్ని గుర్తించగల వివేకం ఉండదు. అందుకే, కారల్ మార్క్సు సైతం విమర్శ అనేది మతవిమర్శతోనే ప్రారంభమవుతుందంటాడు. విమర్శనాత్మక మేధ (Critical Intelligence) పని చేయనినాడు, తప్పొప్పుల్ని వేరుచేయడం సాధ్యం కాదు. అందువల్ల, విమర్శనాత్మక మేధను వినియోగించడం హేతువాదంలో ముఖ్యాంశం. అది

హేతువాదానికి ఆయుధం.

మతాలను ఎదుర్కోవడం కష్టతరమైన విషయం. ఎందుకంటే, ఆయా మతాలకు రక్షణగా (ప్రవక్తలు) దేవుళ్ళను సృష్టించారు. ఆ దేవుళ్ళు సర్వశక్తిమంతులని నమ్మించారు. అంటే, 'ఆస్తికత్వం' మతానికి ఆయుధమన్నమాట. మతాలను నిరాయుధం చేయాలంటే, ఆస్తికత్వం యొక్క అసంబద్ధతను వివరించాలి. నిరీశ్వరత యొక్క వాస్తవికతను చాటాలి. దైవభావం కార్యకారణవాదంముందు చెల్లదు. ఆది కారణవాదం అనవస్థాదోషానికి (Regresso ad infinitum) దారితీస్తుంది. ఇలా అంటున్నంతమాత్రాన హేతువాదం నాస్తికత్వం కాదు . నిరీశ్వరవాదం కాదు. హేతువాదం హేతువాదమే. హేతుబద్ధంగా ఆలోచించినపుడు దైవభావం అసంగతమని తేలుతుందన్నంతవరకే హేతువాదం నాస్తికవైఖరిని అవలంబిస్తుంది. అయితే, హేతువాదం అంతటితో ముడుచుకోదు. మానవ జీవితంలో అన్ని రంగాల్లోనూ ఎదురయ్యే అన్ని రకాల సమస్యలకూ విచక్షణాజ్ఞానాన్ని జోడించి పరిశీలిస్తుంది. నిర్ణయాలు చేసుకొంటుంది. అధికంగా లభించే విజ్ఞానాన్ని అనుసరించి మార్చుకోవలసివస్తే, ఆ నిర్ణయాలను మార్చుకొంటుంది. కొత్త నిర్ణయాలు చేసుకొంటుంది.

ఒకప్పుడు మతగ్రంథాలను శాస్త్రాలనేవారు. మత గ్రంథాలూ, విజ్ఞానశాస్త్రాలూ పరస్పర విరుద్ధ ధోరణులు కలవి. అలానే మతమూ, తత్వశాస్త్రమూ ఒకటికావు. అంటే, తత్వశాస్త్రం ఆస్తికత్వంలో ఇమిడేదికాదు. ఆస్తికత్వం ప్రకృతి కారణాన్ని ప్రకృతికి వెలుపల వెదకుతుంది. కారణమెప్పుడూ వస్తువుకు అంతర్గతంగానే ఉంటుంది కాని, బాహ్యంగా ఉండదు. ప్రకృతికి కారణం బాహ్యంగా లేదు కాన, దొరకదు. అయినా, **లేనిదాన్ని ముందుగా నమ్మి, ఆ తర్వాత దాని కొరకు వెదకమంటుంది మతం. తత్వశాస్త్రం అలాచేయదు. ప్రకృతి కారణాన్ని ప్రకృతిలోనే చూస్తుంది. దీన్నే వైశేషికులు "కారణమితిద్రవ్యే కార్యసమవాయాత్ (10-2-1) అంటూ కార్యకారణ సమవాయ (Instrinsic) సంబంధాన్ని ద్రవ్యంలోనే ఉన్నట్లు సరిగానే చెప్పారు.** హేతువాదం ఈ ప్రపంచంలో కనుగొన్న కారణాల ద్వారాఈ ప్రపంచాన్ని తాత్వికంగా వివరిస్తుంది. ఈ ప్రపంచం భౌతికమైనది కాబట్టి, భౌతికేతరమైనదేమీ **(Non-Physical)** లేదు కాబట్టి, హేతువాదం భౌతికవాదానికి దారితీస్తుంది. అంటే, హేతువాద విధానంలో నాస్తికత్వం తర్వాత చేరే మజిలీ భౌతికవాదం.

ప్రకృతి పరిణామం (Becoming) లోని పూర్వోత్తర సంఘనలనే కారణకార్యాలుగా భావిస్తున్నామంటే, కారణకార్యాలు ప్రకృతికి సంబంధించినవనీ, దానికి మరో కారణం ఉండనవసరంలేదనీ భావం. అంటే, ప్రకృతికి కారణంలేదు, అది నిత్యమైనది. ఈ అంశాన్నే వైశేషికం "సదకారణవత్ నిత్యం" (4-1-1) అన్నది. దాని వ్యక్తీకరణం కారణంగా భిన్నత్వం ప్రదర్శితమవుతున్నది. (తస్యకార్యం లింగం : 4-1-2). ఆ భిన్నత్వాన్ని కార్యకారణ రూపంలో మనం గుర్తిస్తున్నాం. (కారణభావాత్ కార్యభావః : 4-1-3). ఇదంతా సత్తా (Being) కల ప్రకృతి గురించీ, ప్రకృతి పరిణామం (Becoming) గురించీ చెప్పుకొన్న మాటలు, చెప్పుకోవలసిన మాటలు. ప్రకృతి యొక్క ఉనికీ, పరిణతీ (Being and Becoming) విడదీయరానివి. కాని, వాటి రెంటినీ విడదీసి, కేవల ఉనికిని చూడడానికి ప్రయత్నించారు. అది వారికి దర్శనమీయలేదు. అందువల్ల ప్రకృతినే, ప్రపంచాన్నే వారులేదన్నారు. ఇదంతా ఏమిటి అని ప్రశ్నిస్తే,

స్వప్నమాయే యథాదృష్టే గంధర్వ నగరం యథా
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణై

(గౌడపాద కారికలు : 2-31)

అన్నారు. మన అనుభవంలో ఉన్న విశ్వాన్ని ఇలా మిధ్యగా త్రోసిపారవేయడాన్ని హేతువాదం అంగీకరించదు. ఉన్నది, కన్నది హేతుబద్ధం కావడమే హేతువాదానికి ప్రాతిపదిక.

ఇది జ్ఞాన సిద్ధాంతానికి (Epistemology) సంబంధించిన సమస్య. ఇంద్రియాలను స్పృశించే వస్తువుల గురించితప్ప, మరిదేన్ని గురించీ మనకు జ్ఞానం లభ్యం కావడానికి వీలులేదు. అందుకే "ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞానం" (1-1-4) అన్నారు నైయాయికులు. దాన్ని వారు ప్రత్యక్ష జ్ఞానంగా వర్గీకరించారు. కాని, ప్రత్యక్షంకాని, ప్రత్యక్ష జ్ఞానం మీద ఆధారపడని జ్ఞానమేమీ ఉండదు. అంటే, పరోక్ష జ్ఞానాలుగా చెప్పబడే అనుమాన, ఉపమాన, శబ్దాది ప్రమాణాల ద్వారా లభించే జ్ఞానానికి కూడా మూలం ప్రత్యక్ష జ్ఞానమే. జ్ఞానమంతా ఇంద్రియార్ధ సన్నికర్షోత్పన్నమే. అనింద్రియ జ్ఞానం అనేది కానీ, అతీంద్రియ జ్ఞానం అనేది కానీ లేదు. జ్ఞానమంతా ఇంద్రియ జ్ఞానమే. మనకు కనపడని, వినపడని, ఇతరత్రా ఇంద్రియాలకు స్ఫురించని వస్తువుల గురించి శాస్త్రీయ సాంకేతిక పరికరాలు అందించే సమాచారం కూడా ప్రత్యక్ష

జ్ఞానమూలం నుంచి బయలుదేరినదే. అతీంద్రియ జ్ఞానమనేది అపనామం. అరుదుగా కనిపించే విశేష భావుకతను, ప్రదర్శించే ప్రజ్ఞను కూడా అతీంద్రియ జ్ఞానచిహ్నంగా భ్రమపడేది కద్దు. అన్ని తరహాల, స్థాయిల భావుకతకు, ప్రజ్ఞకు ఇంద్రియ జ్ఞానమే పునాది. అది వస్తువులతో భౌతిక సంబంధం వల్ల ఏర్పడుతుంది. ఒకానొకప్పుడు మెరుపుల్లాగా (Flashes) కొత్తఅభిప్రాయాలు, అన్వయాలు మనకు తోచేది కద్దు. అవి గుప్త హేతుత్వ (Concealed reason) హఠాత్ ప్రవృత్తివల్ల అలా లభిస్తాయి. **అందుకే అతీంద్రియ జ్ఞానమంటే గుప్త హేతుత్వమంటాడు ఎం.ఎన్.రాయ్.**

వస్తువులు కానీ, వస్తువుల నుంచి బయలుదేరే వివిధశక్తి ప్రసారాలు కానీ మన ఇంద్రియాలవద్దకు వచ్చి వాటిని తాకినపుడే వాటిని గురించిన జ్ఞానం మనకు లభ్యమవుతుంది. కానీ, మన ఇంద్రియాలు వెళ్ళి ఆయావస్తువుల్ని తాకి వాటిని గురించిన జ్ఞానాన్ని గ్రహించవు. అంటే, వస్తువులు మన ఇంద్రియాలపై ప్రభావాన్ని చూపుతాయి కాని, ఆ వస్తువులపై మన ఇంద్రియాలు ప్రభావాన్ని చూపవన్నమాట. అంటే, మన పురాణాల్లో పేర్కొన్న దివ్యదృష్టి, శాపాలు, వరాలు వగైరాలు కేవలం కట్టుకథలు. వాటిని నమ్మి, అటువంటి వాటికి శాస్త్రప్రతిపత్తి చేకూర్చడానికి బయలుదేరినవే టెలిపతీ, క్లైయిర్ వాయెన్స్, ఎక్స్ట్రాసెన్సరీ పెర్సెప్షన్, సైకోకెనెసిస్ వంటి వ్యర్థ ప్రక్రియలు. వాటిని రుజువుచేయడానికి విశ్వవిద్యాలయాల్లో శాఖలు నెలకొల్పవచ్చు. ఆధునిక విజ్ఞాన శాస్త్రపరికరాలను అవి వినియోగించుకోవచ్చు. అంతమాత్రాన, ఆ శాఖలకు విజ్ఞాన శాస్త్రహోదా రాదు. ఎందుకంటే, ఆ ధోరణిలో సైకికల్ రిసర్చి ప్రారంభమై 100 సంవత్సరాలు దాటినా, ఈనాటి వరకు పునఃపరిశీలన (Verification) ద్వారా అది నిజమని నిర్ధారణ చేయగల ఒక్క ప్రయోగాన్నంటే ఒక్క ప్రయోగాన్నయినా, వారుచేసి చూపించలేకపోయారు. ఆ మాటే అంటాడు అమెరికన్ భౌతిక విజ్ఞానశాస్త్ర అకాడమీ "మాజీ" అధ్యక్షుడు ఎ.డబ్ల్యు.వీలర్.

కాబట్టి, ఉన్న జ్ఞానమంతా ప్రకృతిని గురించినదే. అంటే, ప్రకృతి పరిణామాన్ని గురించినదే. ఈ పరిణామంలోనే వస్తువైవిధ్యం గోచరిస్తున్నది. ఈ పరిణామ క్రమాన్ని అర్థం చేసుకొని, ఏ సంఘటన ఏమరో సంఘటనకు దారి తీస్తున్నదో గ్రహించి, ఆ సంఘటనల సాధనకు మార్గాన్ని ఎన్నుకొనే పద్ధతినే హేతువాదమంటాం.

బ్రహ్మవాదులు, భావవాదులు చెపుతున్నట్లు ఈ ప్రపంచం మన మానసిక

స్థితి కాదు. ఇది వాస్తవం, నిత్యం. నిత్యమూ మారుతున్నంత మాత్రాన ఇది అనిత్యం కాదు. నిత్యం మారడమే ప్రకృతి నిత్యత్వ లక్షణం. భూతాలు (Elements) ఎన్ని అనే చర్చను అలా ఉంచితే, పంచభూతాలు నిత్యం కాబట్టి, వాస్తవిక ప్రకృతి అంతా నిత్యమేనని న్యాయదర్శనం కూడా ఉటంకించింది. **(సర్వం నిత్యం పంచభూత నిత్యత్వాత్ : 4-1-3). అలానే సాంఖ్యం కూడా జగత్తు సత్యం కాదనడానికి కారణమేమీ లేదన్నది (జగత్ సత్యత్వ మదుష్ట కారణ జన్యత్వాత్ బాధత్ : 6-52). ఈ జగత్తుకు కారణం వేరేలేదని న్యాయదర్శనం అన్నట్లే, అన్నిటికీ మూలం ఈ ప్రకృతియేననీ, దీనికి మరో మూలకారనం లేదనీ సాంఖ్య కూడా అన్నది. (మూలే మూలా భావదమూలం మూలమ్ 1-67). అంతేకాక, జగత్తులో ప్రతి వస్తువూ మరో వస్తువు నుంచి సిద్ధించేదేతప్ప, శూన్యం నుంచి వస్తూత్పత్తి సాధ్యం కాదని కూడా సాంఖ్యం అన్నది. (నా వస్తునో వస్తు సిద్ధి : 1-78). దీన్నే గ్రీకు దార్శనికుడు ఎంపిడోకిల్స్ Something cannot come out of nothing అన్నాడు. ఆ విషయాన్ని ఆధునిక విజ్ఞానం రుజువులతో సూత్రీకరించిన Law of conservation of mass ధృవపరుస్తుంది. దేన్నీ సృష్టించడం కానీ, నాశనం చేయడం కానీ ఏ ప్రక్రియవల్లనూ సాధ్యంకాదు.** మనం సాధించగలిగేదంతా ప్రకృతి నియమాలను అనుసరించి ఒక వస్తువునుంచి మరో వస్తువును తయారుచేయడం. శూన్యం నుంచి సృష్టి చేయవచ్చుననే సూత్రం వాస్తవ విరుద్ధం. కాబట్టి, ఈ ప్రపంచాన్ని దేవుడనే వాడొకడుశూన్యం నుంచి సృష్టి చేశాడని ప్రతి మతమూ చెపుతున్న ప్రారంభ వాక్యం అసత్యాన్ని చెపుతున్నదన్నమాట. ఈ అబద్ధాన్ని నిరాకరించడమంటే. అన్ని మతాలనూ నిరాకరించడమే. అందుకే హేతువాదం అన్ని మతాలనూ నిరాకరిస్తుంది. దైవం, బ్రహ్మం, ఆత్మ వగైరాలు వస్తుతః లేనివి కాబట్టే, వాటిని గురించిన జ్ఞానం ఎవ్వరికీ లభ్యం కావడంలేదు. అందువల్లనే, వాటికోసం వేలాది సంవత్సరాలుగా వెదకడం జరుగుతున్నది తప్ప, అవి దొరకడమనేది జరగడంలేదు. ఒకసారి దొరికితే మరి వెదకనవసరం లేదు. ఒకసారి ఒకరికి దొరికినదాన్ని గురించిన జ్ఞానం లభ్యమయితే, ఆజ్ఞానాన్ని ఇతరులకు పంపిణీ చేయడం కష్టంకాదు. ఇది హేతువాదం గుర్తించిన సత్యం.

హేతుత్వశక్తి ప్రతి మానవుడికీ ఉంది. కొందరిలో లేనిదల్లా దాన్ని సక్రమమైన విజ్ఞానంతో సమన్వయం చేసే మెలకువ. ఇందుకు కారణం

అలసత్వం కావచ్చు. అశ్రద్ధ కావచ్చు. సోమరితనం కావచ్చు. పజ్ఞాలోపం కావచ్చు. కాని, అన్నిటికంటె ముఖ్యకారణం వైమనస్యత. మానసిక పరాధీనత (Alienation). సమాజంలోని అధిక శాతం ప్రజలు మానసిక పరాయీకరణంతో బాధ పడుతున్నారు. వారి మనస్సులు వారి వద్ద ఉండవు. ఏ మతానికో, సిద్ధాంతానికో, ప్రవక్తకో, బాబాకో, నాయకుడికో, తాకట్టు పెట్టబడి ఉంటాయి. వారు చెప్పిన అంశాలు ప్రాతిపదికగా తర్కించడం కొనసాగిస్తారు తప్ప, స్వతంత్రాలోచన చేయరు. భావస్వాతంత్ర్యం చెలాయించుకోరు. విబంధం (Free)గా ఆలోచించరు. వారి హేతుత్వం నివురు కప్పిన నిప్పులా ఉంటుంది. అందువల్ల, వారి ఆలోచనా శక్తికి పట్టిన గ్రహణాన్ని వదలించాలంటుంది హేతువాదం.

మన హేతుత్వశక్తిని సక్రమమైన జ్ఞానంతో సమన్వయం చేయడం మనం అలవరచుకోవాలి. సక్రమమైన జ్ఞానం ఎక్కడ ఉంది? మత గ్రంథాల్లో కాదు, ఆధునిక విజ్ఞానశాస్త్రంలో ఉంది. మత గ్రంథాల్లోని అజ్ఞానానికి విరుద్ధంగానే ఆధునిక విజ్ఞానశాస్త్రం బయలుదేరింది. సత్యానికి దగ్గర మదింపువేసి ఆవిష్కరించగలిగేది ఆధునిక విజ్ఞానశాస్త్రం మాత్రమే. ఆధునిక విజ్ఞాన శాస్త్ర చరిత్రను అర్థంచేసుకొంటే, అది క్రమాభివృద్ధిగా తప్పుల్ని సవరించుకొంటూ ఒప్పువైపు చేరుతున్నట్లు తెలుతుంది. ఇందుకు అనేక ఉదాహరణలు చెప్పుకోవచ్చు. ఖగోళ విజ్ఞానంలో తనకు ముందటివారు చేసిన తప్పుల్ని కోపర్నికస్ సవరించాడు. అతని తప్పుల్ని కెప్లర్, ఇంకా ఇతరులు సవరించారు. తనకు ముందటివారి తప్పుల్ని భౌతిక విజ్ఞానంలో న్యూటన్ సవరించాడు. అతని తప్పుల్ని ఐన్‌స్టీన్, ఇంకా ఇతరులు సవరించారు. అలానే జీవశాస్త్రంలో తనకు ముందటివారి తప్పుల్ని లామార్కు సవరించాడు. అ[illegible] తప్పుల్ని దార్విన్, ఇంకా ఇతరులు సవరించారు. అన్ని విజ్ఞానశాస్త్ర శాఖల్లోన[illegible] నిత్యమూ సవరణలు జరుగుతూనే ఉన్నాయి. ఒకరిని మించి మరొకరు అధికమైన, ఇంకా స్పష్టమైన వివరణ లీయదానికి వీలుగా, ఎప్పటికప్పుడు సత్యానికి దగ్గరి మదింపుగా విజ్ఞానాన్ని వెలువరిస్తున్నారు. అది శాస్త్రపద్ధతి. అదే హేతువాద పద్ధతి. ఒకే అంశంపై విభిన్న వివరణలిచ్చిన శాస్త్రజ్ఞుల మధ్యనైనా, ఏనాడూ తగాదా జరగలేదు. శాస్త్రజ్ఞుడికి సత్యం వెలువడాలన్న తపన తప్ప, తాను ప్రతిపాదించిన సిద్ధాంతమే నెగ్గాలనే మొండి పట్టుదల ఉండదు. సత్యం పట్ల మక్కువ కలవారి రీతి అది. అందువల్ల, హేతువాదం

**శాస్త్రీయ సత్యాన్ని ఆలంబన చేసుకొంటుంది.**

ఇప్పుడు మతాన్ని శాస్త్రంతో పోల్చి చూడండి. ప్రతి మతమూ తాను చెప్పినవి పరమ సత్యాలంటుంది. అవి అసత్యాలని నిర్ధారించబడినప్పటికీ, అవే సత్యాలని పట్టుకు వేలాడుతుంది. వాటి రక్షణ కోసం ఆ మత విశ్వాసుల్లో ఆవేశోద్వేగాలను రెచ్చగొడుతుంది. ఫలితంగా భిన్న మతాలమధ్య, భిన్న శాఖీయుల మధ్య పోరాటాలు పెచ్చరిల్లుతాయి. అలా హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు పరస్పరం యుద్ధాలకు దిగడమే కాక, ఆ మతాల్లోని భిన్న శాఖలవారు సైతం పరస్పరం పాశవికంగా పోరాడుకున్న సందర్భాలున్నాయి. హిందువుల్లో కులాలమధ్య కూడా అలాంటి రగడలున్నాయి. అసలేమి జరుగుతుందంటే, మతస్థుల్లో మనిషి మృగ్యమవుతాడు. అలానే కులస్థుల్లోనూ మనిషి ఉండడు. అతనికి జైవిక వారసత్వంగా వచ్చిన హేతుత్వాన్ని తర్కంగా మార్చి, తన మతాన్నీ, ఆ మతం చేసే తప్పుల్నీ, ఆ మతస్థుడిగా తాను చేసే అత్యాచారాల్నీ సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తాడు. అతనికి సత్యంతో పనిలేదు. మానవతతో పనిలేదు. మతంతో అతను తాదాత్మ్యం చెందుతాడు. అందువల్ల, ఆ మతస్థుణ్ణి భావబానిసత్వం నుంచి విముక్తి చేసి మనిషిగా మార్చాలి. అందుకు అతని వివేకానికి పదును పెట్టమంటుంది హేతువాదం.

'ఆధునిక విజ్ఞానం గురించీ, దాని తాత్విక ఫలితాల గురించీ తగాదా లేవదీయడం మతవాదులకొక సంప్రదాయంగా మారింది. వివిధ శాఖల్లో మనం ఆర్జించే విజ్ఞానాన్ని విజ్ఞానశాస్త్రం క్రమబద్ధం చేసి సూత్రీకరిస్తుంది. తద్వారా ప్రకృతిలో ఉన్న సర్వాన్నీ, మానవుడితో సహా సరైన పద్ధతిలో అవగాహన చేసుకోడానికి, ఆ అవగాహనను మనజీవన తత్వనిర్ణయంలో వినియోగించుకోడానికి వీలవుతుంది. అయితే, శాస్త్రీయ విజ్ఞానాన్ని అన్వయించి మన భౌతిక జీవన పరిస్థితుల్ని మెరుగు పరచడానికి సాంకేతిక విజ్ఞానం బయటికి వచ్చింది. నిజానికి, శాస్త్రవిజ్ఞానంలో నుంచి సాంకేతిక విజ్ఞానం వచ్చినప్పటికీ, అవి రెండూ ఒకటికావు. ఇందులో మొదటిది సత్యాన్ని వెలువరించేది. కాగా, రెండవది వినియోగాత్మకమైనది. ఈ శతాబ్ది ప్రథమార్ధం చివరి భాగంలో అణుబాంబులు, విషబాంబులు తయారు చేసే ప్రక్రియను దేశాల రాజకీయ నాయకులు, వారి సైనిక నిపుణుల ద్వారా అమలుచేసి ప్రపంచాన్ని భీతిగొల్పారు. వాటి ప్రయోగం వల్ల మానవాళికి, జీవకోటికి చాల హాని జరిగే మాట నిజమే. కాని, అందుకు శాస్త్రాన్ని నిందించడం సరైన పద్ధతి

కాదు. మానవ సంక్షేమం కోసం ఉద్దేశించిన రాజకీయ సిద్ధాంతాలను సైతం వ్యవస్థీకరించి, మతాలుగా మార్చి, జాతి మత వర్గ విద్వేషాలను రెచ్చగొట్టి, మానవజాతిని వినాశనపుటంచులకు లాగుతున్న రాజకీయ నేతలపై అనింద మోపాలి.

**సత్యం నిష్ఠురమైనది. అయినా, విజ్ఞానశాస్త్రం సత్యదర్శనం చేయడం మానదు. హేతువాదం సత్యదర్శనంతో ఆగదు. మానవజీవన దర్శనం చేయడానికి మానవవాదం వైపు సాగుతుంది. ఈ లోగా మజిలీలు చాలా ఉన్నాయి. మజిలీలనే హేతువాదంగా చిత్రించడం సరైన పద్ధతి కాదు.**

ఈ ప్రసంగ పత్రంలో ప్రాచీన దర్శనాల నుంచి కొన్ని వాక్యాలు కావాలని కోట్ చేశాను. అవి ప్రమాణాలని కాదు. ముందే చెప్పినట్లు, హేతువాదం ఏ పరమప్రమాణాలనూ అంగీకరించదు. పెరుగుతున్న విజ్ఞానాన్ని ఆలంబనం చేసుకొని పరిణామం చెందుతుంది. ఆ లక్షణం దేశకాలాలకు పరిమితంకాదని చూపడానికే నేను ప్రాచీన దార్శనికుల్ని కోట్ చేయడం జరిగింది. భారతీయ తత్వశాస్త్రం ఎవరి నుండి వారసత్వాన్ని స్వీకరించవలసివుందో వారినే కోట్ చేశాను. వారింకా చాలా చేసి ఉండవచ్చు. లేక, వారి గ్రంథాల్లో ఎవరైనా తమ సొంత భావాలను ప్రతిక్షేపించి ఉండవచ్చు. వాటితో మనకు నిమిత్తం లేదు. ఆధునిక హేతువాదులు, లౌకికవాదులు ఆలోచించే తరహాలో రెండు సహస్రాబ్దాలకు పూర్వం కణాద, కపిల, గౌతమాదులు ఆలోచించారంటే, వారి భావాల ఔచిత్యాన్ని హేతువాదులు మదింపు వేయక తప్పదు. కాని, వారి ఆలోచనల్ని భూపాతం చేసి, వేదాంతాన్ని పెనం మీదకు తెచ్చి, పురాణేతిహాసాలను తెరకెక్కించి, మానవ మస్తిష్కాన్ని భావదాస్య శృంఖలాలలో బంధించి, జ్ఞాన పునర్వికాసాన్ని అడ్డుకొని, మత పునరుజ్జీవన ధోరణిని పెంచిన వారిని హేతువాదం ఉపేక్షించదు. వారినీ, వారి వాదాలనూ, ఆ వాదాలకు మూలమైన సాహిత్యాన్నీ క్షోదక్షమంగా పరిశీలించి, వాటిపై విమర్శలను గుప్పించి, ప్రజల ముందు ప్రదర్శించడం హేతువాదుల ప్రథమ కర్తవ్యం. ప్రజల్లో విమర్శక ప్రజ్ఞ క్షీణించి ద్వంద్వ వ్యక్తిత్వం ప్రదర్శితమవుతున్నది. వారు తమ తప్పును గుర్తించజాలని స్థితికి చేరుకున్నారు. అందువల్ల, హేతువాదం కేవలం శాస్త్రీయ దృక్పథాన్ని వెల్లడించడంలో మిన్నకుండదు. నెగెటివ్‌గా మత మౌఢ్యాన్ని విమర్శిస్తుంది. పాజిటివ్‌గా శాస్త్రీయ వైఖరిని వివరిస్తుంది. ప్రాచీన దార్శనికుల నుంచి గ్రహించే మంచిని మానవ వారసత్వంగా పరిగణిస్తుంది.

అది మతాల సొత్తు అని అంగీకరించదు. ఒక దార్శనికుడు చెప్పిన ఒక సూత్రాన్ని అంగీకరించినంత మాత్రాన, ఆ దార్శనికుడు చెప్పిన చెత్తాచెదారాన్నంతా అంగీకరించాలని లేదు. వాటిలో ఏవి ఎంతవరకు హేతుబద్ధమో వాటిని అంతవరకే మనం ఆమోదిస్తాం. ఎందుకంటే, వారు చెప్పిన వాటిలో అశాస్త్రీయమైనవీ, స్వయంవిరుద్ధమైనవీ కూడా చాలా ఉన్నాయి. అయినా, కొన్ని మౌలిక విషయాల్లో వారు స్వతంత్రంగానూ, హేతుబద్ధంగానూ ఆలోచించారనే విషయాన్ని ఆధునిక హేతువాదరీతి పరిగణలోకి తీసుకొంటుంది. అది చారిత్రక రీతి.

(1997 నవంబరు 4 ఉ.గం. 10-30లకు హైదరాబాదు తెలుగు అకాడమీలో రావిపూడి వెంకటాద్రి సమర్పించిన ప్రసంగ పత్రం).

---

# అమెరికా నుండి

- డా॥ నరిశెట్టి ఇన్నయ్య

రావిపూడి వెంకటాద్రి, ఆవుల గోపాలకృష్ణమూర్తి పాత్ర తెలుగు వారిలో చాలా స్ఫూర్తిదాయకమైనది. 1940 నుండీ మొదలైన యీ విషయం అర్ధశతాబ్దం పైగా కొనసాగి, ఎదురులేని సంప్రదాయాల్ని నెలకొల్పింది.

ఆవుల గోపాలకృష్ణమూర్తి మానవవాద పాత్రను గుర్తించి గౌరవించి, ఆయన్ను ఆదర్శప్రాయుడుగా స్వీకరించిన వ్యక్తి రావిపూడి వెంకటాద్రి.

తెలుగు ప్రాంతంలో ఎక్కడ అధ్యయన శిబిరాలు జరిగినా, రాజకీయ తరగతులు సాగినా ఆవుల గోపాల కృష్ణమూర్తి ఆచార్యత్వం వహించారు. వాటిల్లో తప్పనిసరిగా పాల్గొన్న మానవవాది వెంకటాద్రి. ఇది 1940 నుండీ నిరంతరం కొనసాగింది.

శిక్షణ తరగతులు, పురోహితులు లేని పెళ్ళిళ్ళు, ప్రజలకు శిక్షణ గోపాలకృష్ణమూర్తి ప్రిన్సిపాల్‌గా జరగడం 1940 నుండీ గమనార్హం. వాటిలో ప్రధమ స్థానంలో వెంకటాద్రి వుండడం చరిత్ర. తెనాలిలో గోపాలకృష్ణమూర్తి ఇల్లు ఒక చిన్న కొలువుగా వుండేది. అక్కడికి తరచు వచ్చి పాల్గొన్న వ్యక్తి వెంకటాద్రి.

ఆవుల గోపాలకృష్ణమూర్తి కుమారుడు గౌతం పెళ్ళిని కూడా వెంకటాద్రి జరిపించారు. మంత్ర తంత్రాలు లేని, మానవవాద పెళ్ళి వెంకటాద్రి జరిపి, చక్కగా మాట్లాడారు. ఇది గోపాలకృష్ణమూర్తి ఒరవడి.

ఇలా వారిరువురి మానవవాద గురుశిష్య సంబంధం వెలుగు వారిని ఎందరినో ప్రభావితం చేసింది.

తెనాలిలో సాయంత్రం 5 గంటల తరువాత ఆవుల గోపాల కృష్ణమూర్తి ఇల్లు చిన్న సమావేశ మండపం వలె కొనసాగేది. తీరిక అయినప్పుడల్లా వెంకటాద్రి అక్కడ ప్రత్యక్షమయ్యారు. రేపల్లె, తెనాలి, మొదలైన ప్రాంతాలలో జరిగిన రాజకీయ పాఠశాలల్లో గోపాలకృష్ణమూర్తి ఆచార్యత్వం వహిస్తే, వెంకటాద్రి వుండేవారు.

అవనిగడ్డలో జరిగిన 5 రోజుల అపూర్వ స్టడీ క్యాంప్‌లో (1965లో)

ఎ.బి.షా., ఆవుల ఆచార్యత్వం వహించగా వెంకటాద్రి హాజరై శ్రద్ధగా పాల్గొనడం నేను గమనించాను. ఇదే సంప్రదాయాన్ని, వెంకటాద్రి, అఖిల భారత స్టడీ కాంపులలోనూ పాటించారు. 1940 నుండీ 1965 వరకూ ఆవుల రావిపూడి సంబంధం ఎంతో బాగా సాగింది. అందులో కొన్నిటికి నేను ప్రత్యక్ష సాక్ష్యం.

చీరాలలో జగదీశ్వరరావు నిర్వహించిన ఒక కార్యక్రమంలో వల్లభ జోస్యం సుబ్బారావు (ప్రిన్సిపాల్ 'హిందూ కాలేజి, గుంటూరు) పాల్గొని, ఠాగోర్‌పై ప్రసంగించిన ఆయన మార్మిక ధోరణి సమర్థిస్తూ మాట్లాడారు. ఇది సాయంకాలం మిద్దెపై జరిగింది. సుబ్బారావు ధోరణిని వెంకటాద్రి అతి తీవ్రంగా ఖండించారు. గోపాల కృష్ణమూర్తి సర్ది చెబుతూ వెంకటాద్రి వాదనను జాగ్రత్తగా సమర్థించి, సుబ్బారావు నొచ్చుకోకుండా మాట్లాడారు. అది పెద్ద విశేషం.

ఆవుల-రావిపూడి పాత్ర ఆ విధంగా జీవితమంతా కొనసాగింది.

అమెరికా ఆహ్వానంపై ఆవుల పర్యటించడం, ఆరమళ్ళ వంటి వారి ఆహ్వానంపై రావిపూడి అమెరికాలో పర్యటించడం కూడా ఉద్యమంలో మలుపులే.

ఆవుల చనిపోవడం ఉద్యమానికి పెద్ద లోపంగా రావిపూడి భావించారు.

---

# అతీంద్రియ జ్ఞానం - హేతువాద దృక్పథం

- అడియాల శంకర్

అతీంద్రియ జ్ఞానం అనగా జ్ఞానేంద్రియాలకు చిక్కనటువంటి, ఆధారం దొరకనటువంటి జ్ఞానమును అతీంద్రియ జ్ఞానం అంటారు. అంటే కేవలం ఊహల్లో మాత్రమే ఇది ఉంటుంది తప్ప నిజంగా అలాంటి జ్ఞానం ఉండదు. కానీ మత గ్రంథాల్లో విరివిగా ఈ జ్ఞానం కొందరికి ఉందని రాశారు. వరాలు, శాపాలు, మాయమవడం, గాల్లో తేలిపోవడం, మనుషలను, జంతువులుగా మార్చడం, జంతువులను మనుషులుగా మార్చడం, మనుషలను శిలలుగా మార్చడం, శిలలను మనుషులుగా మార్చడం లాంటివి అద్భుత శక్తులుగా మన పురాణాల్లో, ఇతిహాస కథలలో రాయబడినవి. వీటన్నింటినీ నెరవేర్చుకోవటానికి అతీంద్రియ జ్ఞానం కూడా ఉంటుందని రాశారు. కానీ హేతువాద దృక్పథంలో ఆలోచిస్తే కారణం లేనిదే కార్యం ఉండదు. ప్రతి సంఘటన వెనుక కార్యకారణ సంబంధం ఉంటుంది. శూన్యంలో ఏ పదార్థాన్ని మనం సృష్టించలేము. ఏ పదార్థాన్ని ధ్వంసం చేయలేం. ఏ పదార్థం అయినా ఒక పదార్థం నుండి పరిణామం చెందుతుంది తప్ప కొత్తగా ఏ పదార్థం పుట్టదు. శూన్యంలో ఏ పదార్థాన్ని సృష్టించలేము అనేవి హేతువాదంలోని మూలసూత్రాలు.

అతీంద్రియ జ్ఞానం కలవారు ఎవరైనా ఉన్నారా? ఇంతవరకు ఎవరూ ఎప్పుడూ రుజువుపరచిన సందర్భాలు లేవు. ఇలాంటి ఊహాజ్ఞానం కల్పనలతో, కట్టుకథలతో, కూడుకున్న మత గ్రంథాల్లోనే తప్ప వాస్తవంగా ఉండదు. మత గ్రంథాలన్నీ ఊహించి రాసినవే తప్ప, వాటికి ప్రామాణికత లేదు. అవి చరిత్రలు కావు. గతంలో జరిగిన దాఖలాలు లేవు. మత గ్రంథాల్లో కథలన్నీ జరిగినవని కొందరు ఏవేవో కల్లబొల్లి, కట్టుకథలు అల్లి చెప్పడానికి ప్రయత్నించారు కానీ అవి వట్టివే అని తేలిపోయింది. గతంలో జరిగినట్టు ఎవరు ఇంతవరకు సరియైన ఆధారాలు చూపించలేకపోయారు.

కాబట్టి అందులో రాసిన కథలన్నీ కల్పనలే. కట్టుకథలే. ఊహలే. వాటిని మనం నిజాలని భ్రమించడం మన అవివేకం, అజ్ఞానం. ఆలోచనా రాహిత్యం. హేతువాద దృక్పథంతో ఆలోచిస్తే, అతీంద్రియ జ్ఞానం ఎవరికి

ఉండదు. ఏ జ్ఞానమైనా మన జ్ఞానేంద్రియముల ద్వారానే మనకు లభిస్తుంది ఇతరత్రా లభించడానికి వీలులేదు. ఇంద్రియాతీత జ్ఞానం ఉండడానికి అవకాశం లేదు. ఇంద్రియాతీత జ్ఞానం ఉందని ఎవరైనా అంటే నమ్మడానికి వీల్లేదు. మన జ్ఞానేంద్రియాలకు చిక్కిన జ్ఞానమే ఉన్నది అనడానికి వీలవుతుంది.

ఆనాటి ప్రకృతి సంఘటనలకు విశ్లేషణ చేయదగిన జ్ఞానం మన ప్రాచీనులకు లేనందున తమకు అసాధ్యమైన వాటిని ఏవో అతీంద్రియశక్తులు నడిపిస్తున్నాయని, అతీంద్రియ జ్ఞానం వలననే సాధ్యమవుతుందని నమ్మేవారు. మన జ్ఞానేంద్రియాలకు చిక్కనిది జ్ఞానం కానేరదు. మన జ్ఞానేంద్రియాలకు రుజువు కానిది ఏది జ్ఞానం అనిపించుకోదు. అన్ని మత గ్రంథాలలో మహాత్ములు ఉండేవారని, ఋషులు, యోగులు, సన్యాసులు తమ యోగ సాధనతో ఎన్నో లోకాలు చుట్టి వచ్చేవారని, భూలోకము యమలోకము స్వర్గలోకము లాంటివన్నీ క్షణములో, ఇక్కడ మాయమై అక్కడ కనబడేవారని, వారికి దివ్యజ్ఞానం ఉండేదని భిన్న రూపధారులని అదంతా వారియోగసాధన వల్ల లభించిందని ఎన్నెన్నో ఊహకు అందని, ఊహాతీతమైన వాటిని సృష్టించి రాయబడి ఉన్నాయి. మత గ్రంథాలలో కొన్ని పాత్రలను సృష్టించి, వారికి అనంతమైన శక్తులు, దివ్యజ్ఞానం, మహిమలు, మాయలు వారికి అంటగట్టి, వారు దైవ స్వరూపులని, మానవతీతులని ఈ ప్రపంచమంతా వారిచే సృష్టించబడినదని, మనం వారి యొక్క అనుగ్రహ కటాక్ష వీక్షణముల వలన జన్మించామని, జీవిస్తున్నామని మతిలేని మాటలు, పిచ్చి ప్రేలాపనలు అన్ని మత గ్రంథాల నిండా కనిపిస్తాయి. ప్రాచీన కాలాన కొందరు పుట్టుకతోనే జ్ఞానం కలిగి ఉంటారని వారిని సిద్ధులని, సిద్ధ జ్ఞానం కలవారని కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. మత గ్రంథాలలో చెప్పినట్టు సిద్ధజ్ఞానం ఎవరికీ ఉండదు. అలనాటి రుషులకు మునులకు పుట్టుకతోనే జ్ఞానం సిద్ధించేదని, వారు అతీంద్రియ శక్తులు కలిగి ఉండేవారని, భూత, భవిష్యత్, వర్తమానాలు వారికి తెలిసి ఉండేవని చాలా గ్రంథాలలోని కథలలో రాయబడింది.

కానీ అది పూర్తిగా అబద్ధం. ఒక్కసారిగా ఎవరో ఒకరు జ్ఞానాన్ని మొత్తం మనిషిలో నింపుతారని, కలుగుతుందని అనుకోవడం వెర్రితనం, అజ్ఞానం. పుట్టుకతో ఎవరు జ్ఞానవంతులు కారు. వారి యొక్క పరిసరాలు వారు పెరిగే క్రమంలో పరిశీలనా దృక్పథం, ప్రశ్నించే తత్వం వలననే జ్ఞానం లభిస్తుంది. మన జ్ఞానేంద్రియాలతో చూసిన, విన్న, స్పర్శించిన, అనుభవించిన

వాటి ద్వారానే జ్ఞానం కలుగుతుందని మనమీనాడు గ్రహించగలిగాం. పుట్టినప్పుడు మనిషి యొక్క మనసులో ఎలాంటి జ్ఞానం ఉండదు. పెరుగుతున్న క్రమంలోనే అన్ని పరిచయాలు కలుగుతాయి. అట్టి అనుభవంతోనే జ్ఞానం సంపాదించగలుగుతాడు. మనకు ఒకేసారిగా, ఒక్కరోజులోనే జ్ఞానం కలగదు. నిరంతరాయంగా మన జీవన ప్రయాణంలో చూస్తున్నది, వింటున్నది, పరిశీలించిన దానినిబట్టి, అనుభవించిన దాన్నిబట్టి జ్ఞానం లభిస్తుంది. కుటుంబ సభ్యుల నుండి, తల్లిదండ్రుల నుండి స్నేహితుల నుండి, విద్యసభ్యసించే చోట తద్వారా కొంత జ్ఞానం వస్తుంది. వారు చెప్పిందంతా జ్ఞానం కానేరదు. అందులో అజ్ఞానం కూడా ఉండి ఉండవచ్చు కాబట్టి మనిషి పెరిగి పెద్దయిన తర్వాత, తన స్వీయ పరిశీలనతో స్వీయ జ్ఞానంతో విశ్లేషించి, వాస్తవ జ్ఞానం ఏదో అవాస్తవం ఏదో తెలుసుకోవాల్సిన అవసరం ఉంది.

పుస్తక పఠనం ద్వారా కూడా ఎంతో జ్ఞానం లభిస్తుంది. అంటే అన్ని పుస్తకాలు జ్ఞానాన్ని ఇచ్చేవిగా ఉండవు. కొన్ని పుస్తకాలు తప్పుదోవ పట్టించే విధంగా ఉంటాయి. మానవత్వం, మానవవాద, వైజ్ఞానిక, నైతిక విషయాల జ్ఞానం నిచ్చే పుస్తకాలను ఎన్నుకోవాలి. మన పుస్తక ఎన్నికలోనే మన విచక్షణ, వివేకం బయటపడుతుంది. వివిధరకాల ద్వారా భిన్న కోణాల ద్వారా లభించిన జ్ఞానాన్ని బట్టి అతని ప్రవర్తనలో మార్పు వస్తుంది. చిన్నప్పటినుండి అతని పరిసరాలు, స్నేహితులు, పాఠశాల ద్వారా, కుటుంబ సభ్యుల ద్వారా, పుస్తకాల ద్వారా లభించిన జ్ఞానం బట్టి అతనిలో అలాంటి భావాలే కలుగుతుంటాయి కొందరు సమాజంలో దొంగలుగా, హంతకులుగా దుర్మార్గులుగా మారడానికి కారణం వారిలో చిన్నప్పటి నుండి అలాంటి పరిసరాల పరిస్థితిలే ఉండడం వలన పెరిగి పెద్దయిన తర్వాత కూడా అలాగే తయారవుతాడు. అయి కొందరు అలాంటి వాతావరణం నుండి వచ్చినా స్వీయ ఆలోచన విష విశ్లేషణ శక్తి ఉంటే మరల సన్మార్గులుగా మారడానికి అవకాశం ఉంది.

సంచిత జ్ఞానం వలన మనిషి పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం కలవాడుగా అవుతాడు. పరిస్థితులను అవగాహన చేసుకుని మనుషుల తత్వాన్ని గ్రహించి, పరిస్థితులను, సమస్యలను ఎదుర్కొని తన జీవనాన్ని సుఖమయం చేసుకుంటాడు. తన యొక్క ప్రవర్తనతో తన మానసిక వికాసంతో సమాజాభివృద్ధికి, దేశాభివృద్ధికి, చేయాల్సిన కార్యాలను సమర్థవంతంగా నిర్వహించి, అందరికీ ఆదర్శ ప్రాయుడవుతాడు.

# హేతువాదం - పరిచయం - ఆవశ్యకత

- కిషోర్ బాచిన

హేతువాదం అంటే మనిషి తన జీవితానికి సంబంధించిన అన్ని విషయాలలో చేసుకునే నిర్ణయాలు మరియు ఆచరణ, హేతుత్వ ప్రధానంగా ఉండాలి, అని చెప్పే తాత్విక లేదా ఆలోచనా విధానం. నేటి మనిషి జీవితాంశాలైన రాజకీయ, ఆర్థిక, న్యాయ మరియు సామాజిక వగైరా విషయాలకు సరైన సిద్ధాంత రూపకల్పనలో ఉపయోగపడే సాధనమే హేతువాదం తప్ప అదే ఒక సిద్ధాంతం కాదు. అలా హేతువాద దృక్పథంతో మనిషి నిర్ణయాలు, ఆచరణ ఉంటే మనిషి ప్రయాణం మానవవాద సమాజం వైపు ఉంటుంది. మనిషి పుట్టుకతో (ప్రాయికంగా) హేతువాది అనేది హేతువాదం యొక్క మూలసూత్రం లేదా భావన. ప్రతి హేతువాద ఉద్యమ కార్యకర్త. ఈ భావనని అర్థం చేసుకోవడమో లేదా అది ఎంత మేర సత్యమో తెలుసుకోవడం తన హేతువాద జీవనంలో వేయవలసిన మొదటి మెట్టు లేదా మొదటి అడుగు.

భావోద్వేగాలవలే హేతుత్వం కూడా ఒక జీవలక్షణం. అది పరిణామక్రమంలో మనిషి ముందటి జీవజాతుల్లో కూడా కనిపించడం గమనార్హం. మానవ శరీర నిర్మాణరీత్యా ఇతర జీవులకంటే మనిషిలో హేతుత్వం అధిక స్థాయిలో ప్రతిబింబిస్తుంటుంది అంతే తప్ప కేవలం మనిషికి మాత్రమే అకస్మాత్తుగా వచ్చిన లక్షణం కాదు. మరి మనిషి పుట్టుకతో హేతువాది అయినప్పుడు, మానవ చరిత్ర ఒక క్రమపద్ధతిలో లేకుండా అనేక ఒడిదుడుకులతో ఎందుకు ఉంది?

మనిషి ప్రయాణం తన సహజ లక్షణమైన హేతువాదంవైపు కాకుండా అందుకు భిన్నమైన మతవాదంవైపు ఎందుకు మళ్లింది? అనే ప్రధాన సందేహాలు. మానవ చరిత్రని అసమగ్రంగా మరియు అతి కొద్దికాలం గ్రంథస్థం చేయబడిన విషయాలని అధ్యయనం చేయడం వలన కలిగే సందేహాలు ఇవి. గ్రంథస్థం కాని మానవ చరిత్ర చాలా ఉంది. మనిషి పరిణామ చరిత్రని, మానవ స్వభావాన్ని జతచేసి సమగ్రంగా, శాస్త్రీయంగా అవగాహన చేసుకుంటే, ఈ సందేహాలకు తావులేదు. నమ్మడం, మారకపోవడం అనేవి మనిషి లక్షణాలు అని మతనానుడి. కానీ వాస్తవం అందుకు విరుద్ధంగా ఉంది. నేటి నాగరిక మానవ జీవనశైలిని,

వీటికి దూరంగా ఇప్పటికీ అక్కడక్కడ మనకి కనిపిస్తున్న ప్రాథమిక మానవజాతుల జీవనశైలిని పరిశీలిస్తే, మనిషి భావాల్లో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే మనిషి సహజ స్వభావం జ్ఞానతృష్ణ, స్వేచ్ఛా పిపాసగా కనిపిస్తుంది. ఇందుకు మూలకారణం పరిణామ క్రమంలో మనిషికి పుట్టుకతో ఉన్న హేతుత్వమనే జీవలక్షణమే. మనిషి, ఈ విశ్వంలో ఒక అంతర్భాగమనీ, తన ఆవిర్భావం జీవపరిణామ క్రమంలో విశ్వ నియమానుసారం జరిగింది అనే విషయంలో శాస్త్రీయంగా నేడు ఎటువంటి సందేహాలు లేవు. సూక్ష్మస్థాయిలో విశ్వ అవగాహనకు సంభావ్యతా సూత్రాలు అవసరం అవుతున్నాయి. ఈ క్రమంలో విశ్వ నియమాలని అర్థం చేసుకునే పద్ధతిలో లేదా మనం చెప్పుకునే భాష్యాలలో, శాస్త్రజ్ఞులలో కొన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. అంతేతప్ప నియమబద్ధ విశ్వ అవగాహనకు అవి వ్యతిరేకం కాదు. సంభావ్యతా సూత్రాలూ నియమబద్ధాలే తప్ప అవి వేరు కావు. కాబట్టి నియమబద్ధ ప్రకృతిలో భాగమైన మనిషి ఆతని ప్రవర్తన కూడా నియమబద్ధమే. సంఘటనల అవిరతమే విశ్వం Continuum of Events) ఆ ఘటనలని కార్యకారణాలుగా అర్థం చేసుకోగల జీవలక్షణమే హేతుత్వం. కాబట్టి సరైన కార్యకారణ సంబంధమే సహేతుకం అని, సరికాని కార్యకారణ సంబంధం అహేతుకం అని అర్థం చేసుకోవచ్చు. కాబట్టి పుట్టుకతోనే మనిషి హేతుమంతుడు ఐనప్పటికీ ఎంత మేర కార్యకారణ సంబంధాలని సరిగా అవగాహన చేసుకుంటాడో అంతమేర తన ప్రవర్తన సహేతుకంగా ఉంటుంది. అంటే సహేతుక మరియు అహేతుక విధానాలని హేతుత్వ మట్టంలో ఎక్కువ, తక్కువ స్థాయిలుగా చూడాలి తప్ప వాటిని విభిన్న విషయాలుగా చూడకూడదు. ఉష్ణోగ్రత యొక్క ఎక్కువ తక్కువ స్థాయిలనే మనం, వెచ్చదనం మరియు చల్లదనం అంటాం కదా. ఇది కూడా అలాంటిదే.

మనం ఒక వస్తువుని లేదా ఘటనని పరిశీలించినపుడు దానికి సంబంధించిన సమాచారం మన జ్ఞానేంద్రియాల సంవేదనల ద్వారా విద్యుత్రసాయనిక చర్యల రూపంలో (electro-chemical reactions) మన మెదడుకి చేరుతుంది. అదే ఆ వస్తువులకు సంబంధించిన జ్ఞానం. జ్ఞానం ద్వారా మనకు భావాలు ఏర్పడతాయి. అలా ఏర్పడిన భావాలు క్రొత్త జ్ఞానానికి, క్రొత్త భావాలకు దోహదం చేస్తాయి. ఇక్కడ వస్తువు, జ్ఞానం, భావం ఒక దానితో మరొకటి నియమబద్ధంగా పరస్పర సంబంధం కలిగి ఉన్నప్పటికీ అవి ఒకటికావు. అవి వేరు వేరు అంశాలు. కేవలం ఒకదానికి మరొకటి ప్రాతినిధ్యాలు

మాత్రమే. (They represent one another). విశ్వ నియమానుసారం ఎంత మేర వస్తువుకి సంబంధించిన సమాచారం లభిస్తుందో అంతమేర జ్ఞానం ఏర్పడుతుంది. జ్ఞాన ఫలితాలైన భావాలు కూడా ఆ మేర సత్యాలు అవుతాయి. అంటే జ్ఞానం, సత్యం సాపేక్షాలే తప్ప పరమం కావు.

మనిషి లక్ష్యం తన సుఖజీవనమే. అది కేవలం విశ్వ అవగాహనతోనే సాధ్యం కాబట్టి, మానవ జీవన పోరాటం అంటే విశ్వ అవగాహనా పోరాటమే. ఇది తోటి మానవులతోనో, ఇతర జంతువులతోనో పోరాటం కాదు. ఆ స్థాయిని మనిషి దాటాడు. విశ్వ నియమాలను అర్థం చేసుకున్న మనిషి, జ్ఞానార్జన ద్వారా భావోత్పత్తి చేస్తూ తన ముందటి జీవజాతులకంటే ఎక్కువ స్వేచ్ఛని పొందాడు. ఆ క్రమంలో భాషోత్పత్తి చేసిన భావాల్ని తోటిమానవులతో పంచుకుంటూ, వాటిని పెంచుకుంటూ సంఘజీవిగా మారాడు. వ్యక్తి కంటే సంఘ జీవిగా ఎక్కువ శక్తి సామర్థ్యాలని ప్రదర్శించగల విషయాన్ని గమనించి, ఆ సంఘ జీవనాన్ని నైతిక, ఆర్థిక, మానవ సంబంధాలతో బలపరుచుకున్నాడు. అంటే సహజంగా హేతుబద్ధంగా మనిషి సంఘ జీవిగా మారగలిగాడు. తన శక్తియుక్తులని తోటి వారితో పంచుకోగలిగాడు. తను స్వేచ్ఛని పొందుతూ ఇతరుల స్వేచ్ఛని గౌరవించగలిగాడు. తన సుఖజీవనానికి మంచి ఆయుధంగా ఉపయోగపడిన సంఘ భావన మీద మనిషి మోజుపడ్డాడు.

వ్యక్తి శ్రేయస్సు, సంఘ శ్రేయస్సు అనే భావాల్ని అవగాహన చేసుకునే క్రమంలో పొరపాటు వలన, వాటి మధ్య ఘర్షణ జరిగినప్పుడు, తన శ్రేయస్సు కంటే సంఘ శ్రేయస్సు లేదా సమిష్టి శ్రేయస్సు ముఖ్యమని భ్రమపడి తన శక్తి సామర్థ్యాలని, సమిష్టి శ్రేయస్సు అనే ఊహకి బంధీ చేయడంతో మానవ సమగ్రాభివృద్ధి దారితప్పింది. తన అభివృద్ధికి ఆలంబనగా ఏర్పరచుకున్న సమాజాన్ని రక్షించుకోవాలనే తపన వలన లేక విశ్వాన్వేషణలో తనకి ఎదురైన సవాళ్లని అధిగమించే ప్రయత్నంలో ఆనాటి జ్ఞాన పరిమితులరీత్యా అనేక అభూతకల్పనలతో, అసత్యాలతో, అహేతుక చింతనలతో దైవభావనని, దానిని కాపాడుకోవడం కోసం మతభావనల్ని సృజించుకుని వాటికి బానిసగా మారాడు. ఈ ప్రయాణంలో కొంతమంది వ్యక్తుల స్వార్థచింతన ఉపయోగపడినప్పటికీ మానవ చరిత్రని మొత్తం కుట్రకోణంలో చూడటం సహేతుకం కాదు. సమిష్టి భావన, దైవభావన, మత భావన మనిషి ప్రయోజనం కోసం మనిషి ఆనాటి జ్ఞానపరిమితులరీత్యా హేతుబద్ధంగా సృజించుకున్న భావాలే. కాబట్టి అహేతుక

చింతన పలితంగా, భావబానిసత్వానికి లోనుకావడంతో మానవ సమగ్రాభివృద్ధి దారితప్పింది అనే చారిత్రక సత్యాన్ని గమనించడం ప్రధానం.

మరలా మనిషి సహేతుక చింతనతో, శాస్త్రీయ దృక్పథం ఆలంబనగా, సమగ్ర పరిశీలన ద్వారా నేటి పరిస్థితులకు అనుగుణంగా, అసత్యాలతో అర్ధసత్యాలతో ఏర్పరచుకున్న పాత భావాలస్థానంలో క్రొత్తభావాల్ని ఏర్పరచుకోవడమే మనిషి భావబానిసత్వానికి విరుగుడు. జ్ఞానం, సత్యం సాపేక్షాలు కాబట్టి, వాటిని అణిచిపెట్టే మత దృక్పథం స్థానంలో, వాటిని నిరంతరం పెంచే శాస్త్రీయ దృక్పథంతో మనిషి సహజీవనం సాగించాలి. అపుడు మాత్రమే మనిషి కేంద్రంగా, మరింత శక్తివంతమైన, అర్ధవంతమైన, నీతివంతమైన సమాజ స్థాపన సాధ్యం. అలా జరగాలని అందుకు హేతువాదుల ప్రయత్నం తోడు అవుతుంది అని ఆశిస్తూ, ఈ అభిప్రాయాలపై విమర్శలను ఆహ్వానిస్తూ ముగిస్తున్నాను. ●

---

**హేతువాది పత్రిక 40 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకొని**
**41వ సంవత్సరంలోకి ప్రవేశించిన సందర్భాన**
**పత్రిక ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి శుభాకాంక్షలతో........**



# అమరావతి హేతువాద సంఘం

# కులమే దైవం

**- తమ్ములూరి శ్యాంకుమార్**

దేవుడు పుట్టకముందే మనిషి పుట్టాడు. జీవపరిణామ క్రమంలో జంతు దశ నుండి ఆలోచనాపరుడుగా మనిషి పరిణమించాడు. మనిషి ఆలోచనాపరుడుగా మారిన తర్వాతనే ప్రకృతికి మూలాన్ని అన్వేషించాడు. అన్వేషణలో దైవభావాన్ని సృజించాడు. ఆ దైవభావం చుట్టూ అల్లబడిన సామాజిక నియమాల అల్లికనే మతమంటాం. క్రమేపీ మతం పగడ్బందీగా వ్యవస్థీకరణ చెందింది. ఒక్క హిందూమతం తప్ప, ప్రపంచ మతాలన్నీ స్వమతస్థులపట్ల సోదర భావాన్ని ప్రకటించాయి.

హిందూ మతంలో స్వమతస్థులపట్ల సమతాభావం లేదు. ఉచ్ఛ, నీచ, తారతమ్యాలున్నాయి. కులాల గుంపు కలయికతో హిందూమతం సంకట స్థితిలో పడిపోయింది. నిచ్చెనమెట్ల కులవ్యవస్థ హిందువులను 6000 ముక్కలుగా చీల్చింది. అగ్రకులాలకు క్రింది కులాలపట్ల జన్మతః ద్వేషభావం ఏర్పడింది.

కారణం, కులానికి మూలం బ్రహ్మ దేవుడే కాబట్టి. బ్రహ్మదేవుడి నోరు బ్రాహ్మణుడు, భుజాలు క్షత్రియుడు, తొడలు వైశ్యులు, పాదాలు శూద్రులు అని ఋగ్వేదం చెప్పింది. కాబట్టి, కులమంటే దైవమేకదా! బ్రాహ్మణుడంటే బ్రహ్మదేవుడే కదా!

కులానికి దేవునితో సమాన హెూదా వున్నపుడు, కులాన్ని వదలడమంటే దేవుడ్ని వదలడమే. కులాన్ని వదలడం ఎంతో కష్టభరితం. అయినాసరే మనం కులాన్ని వదలవలసిందే. కులాన్ని వదిలివేస్తే దేవుడ్ని వదలివేసినట్లే. అందుకు భావవిప్లవమే మార్గం. ●

---

# ఔనా, కాదా?

- డా॥ సి. హెచ్. కోటేశ్వరరావు

గోవుమాతయె కొలవండి గొడవలేదు
ఎద్దు పితగాకపోవుటయెట్లు సబబు?
మాత పితలిద్దరు మనకు మాన్యులేను
గోవు ఎద్దులురెండును జీవులేను
పాలనిచ్చెడి ఆవులు పావనములు
దుక్కిదున్నెడు ఎద్దులు తక్కువెట్లు
ఆవు ఎద్దులకెందుకు అంతరంబు
పాపమవిరెండు మనయింటి పశువులేగ

శివుడి ఆజ్ఞతో కదులును చీమయైన
అతడి ఆజ్ఞతో కార్యములన్ని జరుగు
పాపకార్యము చేయించు పాపియతడె
నామమాత్రమెగద యిందు నరులపాత్ర
బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ పాతబడియె
మధ్య వెంకన్న అప్పన్న పాపులర్లు
ఇప్పుడయ్యప్ప షిర్డీలు ఏలుచుండె
రేపు ఎవ్వడువచ్చునో రేసులోకి

నీదుపూర్వకర్మ ఫలమె నేటిజన్మ
కర్మ సిద్ధాంత మిదియేగ కర్మయోగి!
ఎట్టికర్మ జేసిన ఫలమట్టిదగును
దేవుడొక వేస్టు ఫెలొకదా దేబెలార!
బ్రహ్మనుదుటరాసి నరులపంపెనిటకు
నలువరాసినట్లె నరులు నడచుచుండ్రి
నరుల తప్పొప్పులకు కర్త నలువయౌను
కర్మ సిద్ధాంతమెటుబోయె ఖర్మగాలి!

కర్మవాదన దేవుడు కానరాడు
దైవవాదాన కర్మకు తావులేదు
హేతువాదాన పై రెండు బూతులేను
ఆస్తికాగ్రజుల్ చెప్పండి ఔనొ!కాదొ!

స్వర్గదేవతలుందురు స్వర్గమందు
నరకదేవతలుందురు నరకమందు
గగనదేవతలుందురు గగనమందు
కొండదేవతలుందురు కొండలందు
కోయదేవతలుందురు కోనలందు
గ్రామదేవతలుందురు గ్రామమందు
ఇంటి దేవతలుందురు ఇంటికొకరు
ఏరియా వైజు దేవుళ్ళు ఎందరోను
అధిపత్యముకోసమే అల్లరంత
రాజ్యపీఠము కోసమే వ్యాజ్యమంత
వర్గరక్షణ కోసమే వైరమంత
ఫ్యాక్షనిస్టుల యాక్షన్లె భారతమ్ము
మంత్ర మొకటి కరోనాకు మందుయనుట
భవ్యశాస్త్రవేత్తల కించపరచుటేను
మతజపము చేసివారలమతులు చెడియె
పిచ్చి ముదిరెను బీజేపి పెద్దలకును
లక్ష లేళ్ళు మనిషి పుట్టి అక్షరాల
వేల ఏళ్ళ క్రితమె క్రీస్తు నేలకొచ్చె
ప్రభువు పుట్టకముందె ఈ ప్రజలుపుట్టె
దేవుడే చిన్న మానవ జీవికన్న
ఉన్నదాన్ని లేనిదనుట ఓటిమాట
లేనిదాన్ని వున్నదనుట లేకిమాట
జగము మిధ్యయనుట మూఢజనులమాట
జగము సత్యమనుట హేతుజనులమాట
మతము ఏదైన అదియొక మత్తుమందె
కులము ఏదైన అదియొక కుళ్ళుకంపె
జాతి ఏదైన అదియొక జాడ్యమేను
వాదమేలేదు మానవవాదమేను
దేవుడనుమాట వినమాకు ఏవగింపు
కర్మ సిద్ధాంతమన మాకు కంటగింపు
ఇంద్రియాతీత మన మాకు ఈసడింపు
మనిషి మహనీయుడన్నమా మనసుకింపు

వార్తలు

# ఉమ్మడి తూర్పు గోదావరి జిల్లా ప్రాంతీయ హేతువాద సంఘ మహాసభలు విజయవంతం

**ఉమ్మడి తూర్పు గోదావరి జిల్లా ప్రాంతీయ హేతువాద సంఘ** ప్రథమ మహాసభలు ది. 10-08-2022న ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 5 గంటల వరకు **జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, అమలాపురంలో** విజయవంతంగా జరిగాయి. **తూర్పు గోదావరి, కాకినాడ, డా॥బి.ఆర్.అంబేద్కర్ కోనసీమ** జిల్లాల నుంచి ప్రతినిధులు హాజరయ్యారు. ఈ సందర్భంగా హేతువాద మానవవాద అధ్యయన తరగతులు స్ఫూర్తిదాయకంగా జరిగాయి.

ఉదయం సమావేశానికి **డి.రాజశేఖర్** అధ్యక్షత వహించి హేతువాద ఉద్యమ ఆవశ్యకతను వివరించారు.

**"మత ఛాందసవాదం-హేతుబద్ధ ఆలోచన"** అంశం మీద భారత హేతువాద సంఘ ట్రెజరర్ **షేక్ బాబు** ప్రసంగించి మతాలు మనుషుల్ని వెనుక్కు నడిపించే పనిలో ఉన్నాయనీ, హేతుబద్ధంగా ప్రజలను ఆలోచింపచేయాలన్నారు. ఆధునిక విజ్ఞానం ఇందుకు ఉపకరిస్తుందన్నారు.

**"భౌతిక వాస్తవికవాదం-హేతువాదం-విశ్వ పరిణామం- జీవ పరిణామం"** అంశం మీద భారత హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి **మేడూరి సత్యనారాయణ** ప్రసంగించి ఈనాటి మన తత్వం భౌతిక వాస్తవికవాదమనీ, హేతుబద్ధంగా ఆలోచిస్తే మానవాభివృద్ధి సాధ్యమనీ, విశ్వం నియమబద్ధంగా నిత్యపరిణామంలో ఉందనీ, విశ్వ పదార్థమే జీవంగా రూపొంది జీవ పరిణామ ఫలితంగా మానవుడు ఆవిర్భవించాడన్నారు.

సాయంత్రం జరిగిన సమావేశానికి **కె.వి.వి.సత్యనారాయణ** అధ్యక్షత వహించి హేతువాద ఉద్యమాన్ని ప్రజల దగ్గరకు చేర్చాలన్నారు.

**"సెక్యులరిజం-హేతువాదం-మానవవాదం"** అంశం మీద భారత హేతువాద సంఘ అధ్యక్షులు **కుర్రా హనుమంతరావు** ప్రసంగించి మతాలతో పని లేకుండా పాలన సాగాలనీ, హేతువాదం ఒక ఆలోచనా పద్ధతి అనీ, హేతుబద్ధంగా ఆలోచిస్తే మానవవాద జీవన విధానం అలవడుతుందన్నారు. సామాజిక మార్పులకు మూలం ప్రజల్లో వచ్చే భావవిప్లవమేనన్నారు.

సాయంత్రం జరిగిన సంఘ మహాసభలో ఉమ్మడి తూర్పుగోదావరి జిల్లా ప్రాంతీయ హేతువాద సంఘ అధ్యక్షులుగా కె.వి.వి. సత్యనారాయణ, ప్రధాన కార్యదర్శిగా **డి.రాజశేఖర్**, ఆర్థిక కార్యదర్శిగా **టి. బాలకృష్ణ**, ఉపాధ్యక్షులుగా **టి.శ్రీగోపాల్** సహాయ కార్యదర్శిగా **యం.సత్యనారాయణ** కార్యవర్గ సభ్యులుగా **గంటా గోపీ, సి.హెచ్.శ్రీరాములు, వి.నాగేశ్వరరావు, డి.ప్రకాశరావు, కె.సిద్ధార్థ ప్రసాద్, కె.బాలకృష్ణ, కె.సత్యనారాయణ, నూకల** బాబ్జిగార్లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. **డి.రాజశేఖర్** వందన సమర్పణ చేశారు.

– రిపోర్టు : **డి.రాజశేఖర్**

---

***With Best Compliments on the occasion of 40th Year of Publication of HETUVADI to Ravipudi Venkatadri***



**Bharatheeya Yukthivada Sangham, Kerala**

**Mumbai, Gujarat Rationalist Association**

**Telangana Rationalist Association**

**Andhra Pradesh Rationalist Association**

ఆహ్వానం

**భారత హేతువాద సంఘ 91వ మహాసభ**
**ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ 22వ ద్వైవార్షిక మహాసభ**
**'హేతువాది' మాసపత్రిక 40 సంవత్సరాల ఉత్సవం**
**హేతువాద మానవవాద అధ్యయన తరగతులు**
**హేతువాద మానవవాద గ్రంథావిష్కరణలు**

**తేదీ : 2022**
**సెప్టెంబరు 10, 11**
**శని, ఆదివారాలు**

**వేదిక :**
**రావిపూడి వెంకటాద్రి మీటింగ్ హాల్,**
**రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు**

**కార్యక్రమాలు**

**ది. 10-09-2022 ఉదయం 10 గంటల నుంచి**

సభాధ్యక్షులు : **కుర్రా హనుమంతరావు,**
అధ్యక్షులు, భారత హేతువాదం సంఘం

అంశం : **మతం - మత ఫండమెంటలిజం**

ఉపన్యాసకులు : **షేక్ బాబు,** ట్రెజరర్, భారత హేతువాద సంఘం
**శ్రీనిపట్టతానం,** వైస్ ఛైర్మన్, భారత హేతువాద సంఘం
**డా॥ గుమ్మా వీరన్న,** అధ్యక్షులు, ఏ.పి. హేతువాద సంఘం
**డా॥ పి.రాఘువన్,** ఉపాధ్యక్షులు, భారత హేతువాద సంఘం
**డి. మంజుల,** కన్నడ కవి, కర్నాటక
**యం.సి. జయమాల,** రచయిత, కర్నాటక

అంశం : **"హేతువాదం - సైన్సు"**

ఉపన్యాసకులు : **మేడూరి సత్యనారాయణ,**
ప్రధాన కార్యదర్శి, భారత హేతువాద సంఘం
**చెప్పడ్ రాజేంద్రన్,** కేరళ

**శ్రీమతి రేష్మి పెరుంబదవన్**, కేరళ

**సుర్ భాస్కర్**, కోల్‌కత

**కరి హరిబాబు**, ప్రధాన కార్యదర్శి,

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు

## 40 సంవత్సరాల "హేతువాది"

ఉపన్యాసకులు : **రావిపూడి వెంకటాద్రి**,

ఛైర్మన్, భారత హేతువాద సంఘం

**మేడూరి సత్యనారాయణ**

**డా॥ గుమ్మా వీరన్న**

**ఆలూరి ప్రఫుల్ల చంద్ర**

**'హేతువాది' సావనీర్ విడుదల : రావిపూడి వెంకటాద్రి**

**గ్రంథావిష్కరణలు :**

**గ్రంథావిష్కరణ-1**

రావిపూడి ఆంగ్ల రచన, **"రేషనలిస్ట్ ఔట్‌లుక్"**

ఆవిష్కర్త : శ్రీనిపట్టతానం

**గ్రంథావిష్కరణ-2**

మేడూరి సత్యనారాయణ ఆంగ్ల రచన, **"రేషనలిజం & హ్యూమనిజం"**

ఆవిష్కర్త : శివరామ్, కేరళ

**గ్రంథావిష్కరణ-3**

డా॥ గుమ్మా వీరన్న రచన, **"చార్వాకం"**

ఆవిష్కర్త : మేడూరి సత్యనారాయణ

1.00 గం॥ నుండి 2.00 గం॥ల వరకు

**భోజన విరామం**

మధ్యాహ్నం 2.00 గం॥ల నుండి

సభాధ్యక్షులు : **డా॥ గుమ్మా వీరన్న**

అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ హేతువాదం సంఘం

అంశం : **విశ్వతత్వం - పరిణామం**

ఉపన్యాసకులు : **మేడూరి సత్యనారాయణ**
**ఆలూరి ప్రఫుల్ల చంద్ర**
**డా॥ విజయకుమార్ హెచ్.,**
విశ్వమానవ సెంట్రల్ యూనివర్శిటీ, గుల్బర్గా
**ప్రొ॥ శశికుమార్, పురమెరి,** విద్యావేత్త, కేరళ
**డా॥ చంద్రశేఖర్,** కర్నాటక
**డా॥ ఐచనహాళ్ళ క్రిష్ణప్ప,** కర్నాటక

**గ్రంథావిష్కరణ-4**

రావిపూడి రచన, ప్రొ॥ లక్కూరు ఆనంద్ కన్నడ అనువాద గ్రంథం
**"మనుధర్మశాస్త్రం మానవ ధర్మశాస్త్రమా?"**
ఆవిష్కర్త : **గుమ్మా వీరన్న**

**గ్రంథావిష్కరణ-5**

రావిపూడి వెంకటాద్రి ఆంగ్ల రచన
**"రేషనలిస్ట్ థాట్ ప్రాసెస్"**
ఆవిష్కర్త : **డా॥ పి.రాఘవన్,** కేరళ

**గ్రంథావిష్కరణ-6**

మేడూరి రచన
**"40 సంవత్సరాల హేతువాది"**
ఆవిష్కర్త : **రావిపూడి వెంకటాద్రి**

మధ్యాహ్నం 4.00 గం॥ల నుండి

## భారత హేతువాద సంఘ 91వ వార్షిక మహాసభ

సభాధ్యక్షులు : **కుర్రా హనుమంతరావు**

ఉపన్యాసకులు : **శ్రీనిపట్టతానం,** **మేడూరి సత్యనారాయణ**
**డా॥ గుమ్మా వీరన్న,** **షేక్ బాబు**
**కన్నన్ శివరాం,** సహాయ కార్యదర్శి, ఆర్.ఏ.ఐ.
**అడియాల శంకర్,** అధ్యక్షులు, తెలంగాణ హేతువాద సంఘం
**కె. శ్రీనివాసాచారి,**
ఉపాధ్యక్షులు, తెలంగాణ హేతువాద సంఘం
**ఏ.ఎన్.కరియా,**
అధ్యక్షులు, ముంబాయి గుజరాత్ హేతువాద సంఘం

ది. 11-09-2022 ఉదయం 10 గంటల నుంచి

సభాధ్యక్షులు : **మేడూరి సత్యనారాయణ**

అంశం : **సెక్యులరిజం - ప్రజాస్వామ్యం**

ఉపన్యాసకులు : **కుర్రా హనుమంతరావు**
**డా॥ గుమ్మా వీరన్న**
**చుంచు శేషయ్య**
**తెస్లీ పాల్**, కేరళ
**సునీల్ నాగొండ హళ్లి**, కర్నాటక
**అడియాల శంకర్**
**జయంతి సునీల్**, కర్నాటక
**ముదల్ విజయ్**, కర్నాటక
**ప్రొ॥ లక్కూరు ఆనంద్**, కన్నడ రచయిత

అంశం : **"భౌతిక వాస్తవిక వాదం"**

ఉపన్యాసకులు : **కిషోర్ బాచిన**
**కె. శ్రీనివాసాచారి**
**మోహన వర్మ**, కేరళ
**డా॥ బాదరహళ్ళి శివరాజు**, కేరళ

**గ్రంథావిష్కరణ-7**

మేడూరి రచన **"లాక్‌డౌన్‌లో నా భావాలు"**

ఆవిష్కర్త : డా॥ బాలనాయుని, బెంగుళూరు

**గ్రంథావిష్కరణ-8**

మేడూరి రచన **"నియంతృత్వం - స్వేచ్ఛ"**

ఆవిష్కర్త : డా॥ గుమ్మా వీరన్న

**గ్రంథావిష్కరణ-9**

మేడూరి రచన **"సెక్యులరిజం-ప్రజాస్వామ్యం"**

ఆవిష్కర్త : కుర్రా హనుమంతరావు

గ్రంథావిష్కరణ-9

**మేడూరి రచన "రావిపూడి రచనల సమీక్షలు"**

ఆవిష్కర్త : కరి హరిబాబు

1.00 గం॥ నుండి 2.00 గం॥ల వరకు

**భోజన విరామం**

మధ్యాహ్నం 2.00 గం॥ల నుండి

సభాధ్యక్షులు : **షేక్ బాబు**

అంశం : **హేతువాద మానవవాద జీవన విధానం-సమాజం**

ఉపన్యాసకులు : **షేక్ దరియావలి,**

ప్రధాన కార్యదర్శి, ఏ.పి. హేతువాద సంఘం

**కన్నన్ శివరాం,** కేరళ

**గవిసిద్ధ హోసమని,** కర్నాటక

**కె.యం. సదానందం,** కేరళ

**సింహాద్రి యల్లమందారెడ్డి,**

అధ్యక్షులు, చీరాల హేతువాద సంఘం

గ్రంథావిష్కరణ-11

రావిపూడి రచన ప్రొ॥ లక్కూరు ఆనంద, కన్నడ అనువాదం

**"ఆదిశంకరాచార్య, జీవితం-తత్వం"**

ఆవిష్కర్త : డా॥ గుమ్మా వీరన్న

గ్రంథావిష్కరణ-12

డా॥ ఎన్. ఇన్నయ్య ఆంగ్ల రచన, మేడూరి అనువాదం

**"యం.యన్.రాయ్ - ఫొటో ఆల్బం"**

ఆవిష్కర్త : కుర్రా హనుమంతరావు

గంథావిష్కరణ-13

నార్ల వెంకటేశ్వరరావు రచన, ఆలూరి ప్రఫుల్లచంద్ర అనువాదం

**"భారతదేశంలో మేధో దారిద్ర్యం"**

ఆవిష్కర్త : మేడూరి సత్యనారాయణ

# ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ
# 22వ ద్వైవార్షిక మహాసభ

సభాధ్యక్షులు : **డా॥ గుమ్మా వీరన్న**

ఉపన్యాసకులు : **కుర్రా హనుమంతరావు**
**మేడూరి సత్యనారాయణ**
**షేక్ బాబు**
**కరి హరిబాబు**
**షేక్ దరియావలి**
**కరణం రవీంద్రబాబు**
**సింహాద్రి యల్లమందారెడ్డి**

## నూతన కార్యవర్గ ఎన్నిక

వందన సమర్పణ : **షేక్ దరియావలి**

**గమనికలు :**

1) హేతువాద, మానవవాద అధ్యయన తరగతులలో పాల్గొనేవారు రూ. 500/-లు బస వసతులకు ప్రతినిధి రుసుముగా చెల్లించాలి.
2) ఇంకొల్లుకు హైదరాబాదు, గుంటూరు, రాయచూరు, ఒంగోలు, చీరాల, అద్దంకి, చిలకలూరిపేటల నుండి బస్సు సౌకర్యం కలదు. రైలులో వచ్చేవారు చీరాల, ఒంగోలు దిగి ఇంకొల్లుకు బస్సులో రావచ్చు.
3) హేతువాద, మానవవాద సాహిత్యం 20% తగ్గింపుతో లభిస్తుంది.
4) అధ్యయన తరగతులలో సందేహాలకు సమాధానాలు వుంటాయి.

వివరాలకు : **మేడూరి సత్యనారాయణ, Cell : 98499 35117**

**కుర్రా హనుమంతరావు, RAI** **మేడూరి సత్యనారాయణ, RAI**

**డా॥ గుమ్మా వీరన్న, APRA** **షేక్ దరియావలి, APRA**

## హేమా పబ్లికేషన్స్, చీరాల

### డా॥ గుమ్మా వీరన్న రచనలు

1. హేతువాదం - భావవిప్లవం - 1984
2. హేతువాదం - మార్క్సిజం - 1987
3. నవ్యమానవవాద మీనాటి బాట - 1996
4. స్వేచ్ఛ - 2001
5. హేతువాదం-స్వరూప స్వభావాలు - 2007
6. భారతీయ సంస్కృతి -తత్వం - 2008
7. హేతువాదం - అపోహలు - అపార్థాలు - 2012
8. రావిపూడి రచనల సంపుటాల సమీక్ష - ప్రథమ భాగం - 2014
9. రావిపూడి రచనల సంపుటాల సమీక్ష - ద్వితీయత భాగం - 2016
10. రావిపూడి వెంకటాద్రి రచనలు - హేతువాద మానవవాదాలు - 2017

### అనువాద గ్రంథాలు

11. రాడికల్ హ్యూమనిజం - వి.యం.తార్కుండే - 2005
12. గతితార్కిక భౌతికవాదం శాస్త్రీయమా? - 1988
13. మానవజాతికి మతమెందుకు. - 2010
14. శాస్త్రం-తత్వం - యం.యన్.రాయ్ - 2020
15. భారతదేశంలో బౌద్ధ నిర్మూలన - డా॥ డి.సత్యనారాయణ - 2021
16. ఆంధ్రప్రదేశ్‌లో మానవవాద ఉద్యమ చరిత్ర -డా॥ యన్.ఇన్నయ్య-2020
17. భారతీయ తత్వదర్శనం
    ఎ) విశ్వపరిణామంలో మానవ ఆవిర్భావం - సింధూ నగరికత
    బి) ఆర్యులు వేదవాఙ్మయం
    సి) ఉపనిషత్తులు
    డి) చార్వాకం - జైనం

**లభించు చోటు :**

**మేడూరి సత్యనారాయణ, సెల్ : 98499 35117**

**కేరాఫ్ రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు - 523 167**

హేతువాది పత్రిక 40 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకొని 41వ సంవత్సరంలోకి ప్రవేశించిన సందర్భాన పత్రిక ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి శుభాకాంక్షలతో........



# రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్

## ఇంకొల్లు.

హేతువాది పత్రిక 40 సంవత్సరాల ప్రచురణ పూర్తి చేసుకొని 41వ సంవత్సరంలోకి ప్రవేశించిన సందర్భాన పత్రిక ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి శుభాకాంక్షలతో........



# భారత హేతువాద సంఘం,
# ఆంధ్రప్రదేశ్ హేతువాదం సంఘం,
# రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్,
# హేతువాది,
# రేషనలిస్ట్,
# హేమా పబ్లికేషన్స్

**HETUVADI** September 2022
Postal Concession Regd. No. PRAKASAM/19/2021-2023
Registered with the Registrar of News papers No. 44832/82

# రావిపూడి రచనల సంపుటాలు

| సంపుటం పేరు | పేజీలు | వెల | బౌండు |
|---|---|---|---|
| 1. హేతువాదం | 350 | రు. 350/- | - |
| 2. హ్యూమనిజం | 492 | రు. 500/- | - |
| 3. నాస్తికత్వం | 393 | రు. 400/- | రు. 500/- |
| 4. మార్క్సిజం | 479 | రు. 500/- | రు. 600/- |
| 5. ఔనా; వేదంలో అన్నీ ఉన్నాయా? | 196 | రు. 200/- | రు. 300/- |
| 6. విశ్వాన్వేషణ | 246 | రు. 250/- | రు. 350/- |
| 7. జీవమంటే ఏమిటి? | 203 | రు. 200/- | రు. 300/- |
| 8. మతజాడ్యాల మచ్చుతునకలు | 277 | రు. 250/- | రు. 350/- |
| 9. ఆదిశంకరాచార్య : వ్యక్తిత్వం-తత్వం | 172 | రు. 200/- | - |
| 10. మనుధర్మాల కౌటిల్యం | 250 | రు. 300/- | రు. 400/- |
| 11. శాస్త్రం-అశాస్త్రం | 227 | రు. 250/- | రు. 350/- |
| 12. హ్యూమనిస్టు సమీక్షలు | 154 | రు. 150/- | రు. 250/- |
| 13. సమకాలీనాలు - సార్వకాలికాలు (1వ భాగం) | 284 | రు. 300/- | రు. 400/- |
| 14. సమకాలీనాలు - సార్వకాలికాలు (2వ భాగం) | 410 | రు. 400/- | రు. 500/- |
| 15. హేతువాది ప్రశ్నోత్తరాలు | 236 | రు. 250/- | రు. 350/- |
| 16. హేతువాద హ్యూమనిస్టు అన్వయాలు - స్పందన - ప్రతిస్పందనలు - 1 | 252 | రు. 250/- | రు. 350/- |
| 17. హేతువాద హ్యూమనిస్టు అన్వయాలు - స్పందన - ప్రతిస్పందనలు - 2 | 252 | రు. 250/- | రు. 350/- |
| 18. ఎం.ఎన్.రాయ్ - భారత కమ్యూనిజం | 600 | రు. 250/- | రు. 350/- |
| 19. స్వామినేని - త్రిపురనేని | 356 | రు. 350/- | రు. 450/- |
| 20. నేనూ - నా రచనా వ్యాసంగం | 156 | రు. 150/- | |
| 21. అడుగుజాడలు | 116 | రు. 120/- | రు. 200/- |
| 22. మనం ఏమి చేయాలి ? కళ-శాస్త్రం-తత్వం- | 214 | రు. 250/- | రు. 350/- |
| 23. వాస్తువు శాస్త్రమా? | 146 | రు. 150/- | |

## English Version of Ravipudi Writings

| | | | |
|---|---|---|---|
| 1. Rationalism : Part-I | 312 | రు. 300/- | రు. 400/- |
| Rationalism : Part-II | 289 | రు. 300/- | రు. 400/- |
| Rationalism : Part-III | 264 | రు. 300/- | రు. 400/- |
| 2. Marxism | 384 | రు. 400/- | రు. 500/- |
| 3. Aadisankaracharya | 196 | రు. 300/- | రు. 400/- |
| 4. New Humanist Theses | 96 | రు. 100/- | రు. 150/- |
| 5. Atheism Vs. Nihilism | 208 | రు. 200/- | |
| 6. What Shall We Do ? | 120 | రు. 120/- | |
| 7. Rationalist Outlook | 120 | రు. 120/- | |
| 8. Rationalist Thought Process | 120 | రు. 150/- | |

హేమా పబ్లికేషన్స్, చీరాల - 523 155. సెల్ : 9849935117
రాడికల్ హ్యూమనిస్టు సెంటర్, ఇంకొల్లు, 523 167, ప్రకాశంజిల్లా.

Edited, Printed and Published by Ravipudi Venkatadri and
Printed at Sri Kavya Offset Printers, Vijayawada for Hema Printers, Chirala



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M251 |
| పుస్తకం పేరు | హేతువాది |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | 410 |
| వెనుక అట్ట | 410 |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | 110 |
| ఖాళీ పేజీలు | 110 |
| లేని పేజీలు | 110 |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |